# శ్రీమద్




శ్రీ తి.గ. వయ్యారి రంగాచార్యులు

మద్రాసు యూనివర్శిటీ రిటైర్డ్ సాన్స్క్రిట్ స్కాలర్

# జైమిని రామాయణము

**10622**

గ్రంథకర్త:

ఉ. వే. క.

ఉభయ కవితా విశారద, ఉభయ భాషా ప్రవీణ

శ్రీమాన్ విద్వాన్ శ్రీ తి. గు. ఒయ్యారి రంగాచార్యులు

(రిటైర్డ్ మదరాసు విశ్వవిద్యాలయ సంస్కృత పరిశోధనాచార్యులు)

this Book is published with the financial assistanc of Tirumala Tirupati Devasthanams under their scheme 'Aid to publish Religious Books'

వెల: రూ. 25/-

ప్రోత్సాహకులు:
స్వధర్మ స్వారాజ్య సంఘము
(orthodox National League)
29. బ్రాడ్వే : : మద్రాసు - 600 108.

ప్రతిస్థానము:
జి. వి. రంగాచార్యులు,
30, బరాకా రోడ్డు,
మద్రాసు - 600 012.



ముద్రణ :
క్రాంతిప్రెస్. మద్రాసు - 600 001.



కీర్తిశేషులు

శ్రీ కౌతా సూర్యనారాయణరావు



కీర్తిశేషురాలు

శ్రీమతి కొత్తా లలితాంబ



కీ ర్తి శే షు లు

శ్రీ బులుసు రామలింగేశ్వరుడు

శ్రీమతి ప్రేమేశ్వరి

# అంకితము

బులుసు కులాబ్ధి చంద్రముడు పూజ్యుడు, భవ్యుడు రామలింగ
కున్

సలలిత ప్రేమ యీశ్వరికి సాధు జన స్తుతుడైన పుత్రుడౌ,
సులలితు వెంకటాఖ్యయుత సూర్య సుశోభిత సుబ్రహ్మణ్యకున్
చెలగిన ప్రేమనిచ్చితిని, చిన్మయ రూపిణి. కావ్య కన్యకన్.

లలిత యసంగనొప్పు, వరరమ్య మనోహర దివ్యరూపిణిన్
తెలియగ. యిందిరామణికి దీటగు కాంతను బొంది తెన్నడో,
యిలగన మీర లిద్దరును ఎన్నగ, శంకర పార్వతుల్ సుమీ,
వెలదిని, గంగ, నీశువలె యిమ్ముగనందుము కావ్యకన్యకన్.

అంకితమీయ వచ్చితిని ఆత్మజ బోలిన కావ్యకన్యకన్
శంకర సన్నిభుండవని సాధులు మెచ్చగ సంతసంబుతో,
శంకర పాదదాసుడగు జైమిని వ్రాసిన రాము వృత్తమున్
అంకుప వ్రాసినాను వచనంబుగ జేకొను మాంధ్రభాషలో.

లలితవు నీస్త్ర సెక్కె్యముగ. రమ్యమనోహర రూప సంపదన్
చెలియ మనోహరాకృతియె చింతను బొందక చేరదీయు మా
వెలదులు. యిద్దరున్ గలసి వేడుక సేయుడు సుబ్రహ్మణ్యకున్
యిలపయి. సూర్య చంద్రు లుదయించెడి నంతకు నెల్లవేళలన్.

రాముడు. సర్వవేళలను రాణబెలంగగ, పుత్రపౌత్రులన్
ప్రేమను గాచుచున్. సుఖము ప్రతినొసంగుచు, భోగభాగ్యముల్
ధీ మహితా! యొసంగ భువి దేవపతిత్వము నంది హాయిగా
కామిత మెల్లదీర సుభగత్వ వినోద సుఖంబు లందుమా.

# విన్నపము

నేను తంజావూరు సరస్వతీ భాండాగారములో ప్రాచీన సంస్కృత తాళపత్ర గ్రంథ పరిశోధన జేయు సమయమున, ఒక దినంబున నాకు స్వప్నములో ఒక శ్రీవైష్ణవుడు ద్వాదశోర్ధ్వపుండ్రమండిత శరీరుడై సాక్షాత్కరించి, "ఒరే! నీ విద్య నింతవరకు సేవకావృత్తికే వినియోగించితివి, ఇకనైనను పరమార్థమునకుపయోగింపు" మని బల్కి, నెం. 103 రు బీరువాలో 3వ అరలో నెం. 835 రు. గల గ్రంథమును బరిశీలింపుమని చెప్పి అంతర్థానము జెందెను. అంతట నాకు మెలకువ రాగా ఎదుట గడియారము గం. 4-30 లను జూపించినది.

తరువాత నేను కాలకృత్యములు దీర్చి, గం. 8 లకు భాండాగారమునకు బోయి, 103 నెంబరు బీరువాలోని గ్రంథమును దీయించి, దానిని శుభ్రపరిపించితిని. అయ్యది మహాకవి జైమిని మహర్షిచే రచింపబడిన గాయత్రీ మంత్ర బీజాక్షరక్రమముతో 24-సర్గలు గల శ్రీమద్రామాయణము.

నేను ఒక సంవత్సరములో, దానిని ఆమూలాగ్రము జదివి తెనిగింపవలయునని గోరిక మనసున రేకెత్త, దానిని వచనకావ్యముగా రచించితిని. కాని, దాని ముద్రణకు ధనసహాయము సమకూరనందున మూడు వత్సరంబులు నిలచిపోయినది.

ఉ॥ "కోడలి గొల్చువారమని కోపముజేతను లక్ష్మి మమ్ములన్
జూడదు, మా మొరల్ వినదు చోద్యమిదేమొ ఎరుగంజాల బల్
ప్రోడయె పండితుండనుచు పూవుల మాలల ముంచి సత్సభన్
రేడులు గౌరవింతు రిల లేని దురాశల మమ్ము ముంచుచున్."

ఏమి జేయజాలక ఒక దినంబున "జగన్మాతా పిక్చర్స్ భాగ్యస్వామి యగు టోనం ఆంజనేయులుగారికి జైమిని రామాయణమునందలి ఒకటి రెండు ఘట్టములు వినిపింప, వారు విని, వెంటనే నన్ను తిరుపతి దేవస్థాన గ్రంథపరిశోధనాధిపతులగు మ-రా-రా-శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి గారి వద్దకు గొనిపోయిరి. నేను వారికి కూడ నాలుగు ఘట్టములు విని పించితిని. అంతట వారు ఆనందబడి యీ గ్రంథము సర్వజనోపయోగ మయినదని దలంచి, ముద్రణకుగాను సహాయ మర్థించి అర్జీ వ్రాయుమనిరి. నేను అర్జీ వ్రాయగా వెంటనే రు. 5000-00 (ఐదువేల రూపాయలు) గ్రాంటు జేసిరి. ముద్రణ ప్రారంభించితిని గాని ఆ ధనము జాలనందున మరికొంతమంది ధనవంతులను, దర్మసంస్థలను ప్రాధేయపడి ప్రార్థించితిని. వారందరూ సరస్వతీప్రసన్నము జేసిరి గానీ-లక్ష్మీప్రసన్నము గావింపరైరి. క్రాంతిప్రెస్ (మద్రాసు)లో గ్రంథము కొంత ముద్రణ అయినది. మిగిలినది ధనము లేక నిలచిపోయినది. నా మనసున దిగులు చెలరేగినది.

అంతట నొక దినంబున మ-రా-రా-శ్రీ వేదమూర్తులగు బ్రహ్మశ్రీ బులుసు వేంకట సూర్యసుబ్రహ్మణ్యశాస్త్రిగారిని సందర్శించి విషయము వివరింప వారు—

చం॥ అడిగినయంత లేదనక ఆత్మను సంతసమంది వెంటనే
తడబడకుండ ముద్రణను దప్పకసేయుదు రాము వృత్తమున్
ఒడయుడు పార్వతీధవుడు ఊరకయుండనె? సాయమీయకన్,
అడలగనేల? రాము కృపనంతయు శోభనమౌను బొమ్మనెన్.

అంతట నేను ఆనందంబున క్రాంతి ప్రెస్‌కు బోయి త్వరగా ముద్రణను బూర్తిగావింప మనగా మ-రా-రా-శ్రీ హనుమంతరావుగారి పుత్రుడు శ్రీధరరావు సర్వబాధ్యతలు వహించి ముద్రణను బూర్తి గావించిరి. రంగుల్లో ముఖచిత్రాన్ని గీసి యిచ్చిన శ్రీ గంగాధర్‌కి కృతజ్ఞతలు.

జైమిని రచించిన రామాయణము హేతుబద్ధమయి శ్రీమద్రామాయణములో లేని విషయము లనేకములు గలవు.

నేను వాల్మీకి రామాయణములో లేనివి జనప్రవాదములో గల విషయములను క్రోడీకరించి—వచనము వ్రాసితిని. ఇందు తప్పు లున్న మన్నింప ప్రార్థన.

ఇట్లు,
బుధజన విధేయుడు
ఉ. వే. శ,
ఉభయ భాషాప్రవీణ, ఉభయకవితా విశారద, తార్కిక సింహ,
శ్రీమాన్ విద్వాన్
శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ
ఒయ్యారి రంగాచార్యులు.

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# శ్రీః జైమిని రామాయణము

శ్రీమతేరామానుజాయనమః  శ్రీమద్విష్వక్సేనాయనమః

శ్లో॥ వందే సర్వకళామయీం, శుభకరీం, సంపత్కరీం శారదామ్
వందే శంకర సర్వమౌని సుర యక్షేశ సంసేవితామ్
వందే సామకళాసుశోభిత సభాం నాట్యాది సుద్రూపిణీమ్
వందే పద్మజ గేహినీం కవిప్రియాం వందే విపంచీరతామ్.

# కథా ప్రారంభము

పూర్వము మేరు సానువుల యందు రేణుకా నదీ తీరమున ఆనంద వనమను ప్రదేశమున మహా తపస్సంపన్నులగు వాలఖిల్యాది మహామునులు నివసించుచుండిరి. ఆ వనము సర్వకాల సర్వావస్థల యందు సకల ఫల పుష్ప భరితమయి తృణ, కాష్ట, జల సమృద్ధమయి పాంథజనానుమోదమై యుండెడిది. అట్లుండ నొకనాడు మహాకవి యగు జైమిని మహర్షి తీర్థ యాత్రా సంసేవనాయత్త చిత్తుడయి కతిపయ శిష్యసహితముగా భూ ప్రదక్షిణము సేయదలచి మార్గరూపమున ఆనంద వనమునకు జేరెను వాలఖిల్యులు మహర్షి రాక విని ఎదురేతెంచి అర్ఘ్యపాద్యాది విధుల పూజించి అర్హాసనమున ఆశీనుం జేసి అందరూ ఆనంద భరితోత్సాహ మానసులై కూర్చుండి జైమిని మహర్షిని ఇట్లడిగిరి.

"ఓ మహానుభావా నీవెరుంగని శాస్త్రములు లేవు, గావున రామరావణ చరితంబును ఆ మూలాగ్రముగా వినవలయునని తలంపు కలదు. కావున మమ్మనుగ్రహించి మా కోరిక తీర్ప ప్రార్థన" అనిరి. అది విని జైమిని పరమానంద సంభరితుడయి "నాయనలారా మీ కోరిక ప్రశంసనీయమైనది.

సర్వపాపహరం, దివ్యం, సర్వకామ్య ప్రదాయకం
రామరావణ సచ్చరితం భూసురై ర్మానితం భువి,

అనునట్లు సకల శుభఫల సంధాయకంబయిన రామరావణ చరితము ఎన్ని పర్యాయములు విన్నను తనివితీరదు.

శ్లో॥ మోక్షార్థినాం మోక్షదాయా, కామ్యార్థినాంచ, కామిదం
సర్వసంపత్కరం దివ్యం రామచారిత్ర్య పర్వసమ్.

అనునట్లు శ్రీరామ చరితమును వినిన కొలది అమృత పానము వలె ఆత్మానందము కలుగును. మీరు కోరితిరి కావున చెప్పెదను అవధరింపుడు."

## జయవిజయుల విలాపము

పూర్వము కృతయుగమునకును త్రేతాయుగమునకును సంధికాలమున సనకసనందనాది మహామునుల వలన శాపగ్రస్తులయిన జయవిజయులు భగవదాజ్ఞాను సారము తొలి జన్మమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించి, శ్రీమన్నారాయణమూర్తికి విరోధులయి మోక్షమంది వైకుంఠము నకు జేరిరి. ఆ సమయమున కాలజ్ఞులను వారు వచ్చి శ్రీ మహావిష్ణువు వద్ద జేరి జయవిజయులు రెండవ జన్మ ఎత్తవలసిన సమయమాసన్నమైనదని తెల్పిరి. అది విని జయుడు కన్నీరు మున్నీరుగా వాపోవుచు "స్వామీ అకారణముగా అనుభవింపవలసిన శాపము మన్నింపుడు. నిర్దోషులము. దేవర ఆజ్ఞానువర్తులమై తలుపులు మూసినారమే గాని స్వయం కృతాపరాధ మేమియు ఆచరించినవారము గాదు. శ్రీమన్నారాయణుని పాదారవింద సంసేవనాయత్త చిత్తులమని ఆత్మశక్తి సంపన్నుల మని దలంచి అహంకార మున యుక్తాయుక్త పరిజ్ఞాన విహీనులయి మహామునులు మమ్ములను శాప గ్రస్తుల గావించిరి. తత్ఫలితముగా ఒక జన్మము ఎటులనో అతి కష్టముగా నిర్వర్తించి తమ సన్నిధానమునకు జేరితిమి. మమ్ముల మన్నించి ఇంతతో శాపవిమోచనము అనుగ్రహింప ప్రార్థన." అని వేడెను. అది విని లక్ష్మీ నాథుడు కింకర్తవ్యతామూఢుడయి యూరకుండెను. అప్పుడు ప్రక్కనున్న గరుత్మంతుడు లేచి నిలువబడి ముందునకు వచ్చి ఇట్లనెను.

## గరుత్మంతుని శాపము

ఓరీ జయా! అధికారమందినదిగదా యని అహంకరించి అన్ను మిన్ను గానక అంతరమెరుంగక ఆత్మశక్తి సంపన్నులగు సంయములను అవమాన పరచితివి. శాపగ్రస్తుడవయితివి. శాపవిమోచనమున కానాడు మూడు జన్మముల శత్రువు నయ్యెదనని యొప్పందబడితివి. ఈ నాడేడ్చిన

ఏమి లాభమురా? ఈ శాంతము, ఈ అనునయము ఈ గుణములానాడుండిన నీకీ శాపము వచ్చునా? ఆత్మానుకృత దోషమనుభవింపక తప్పదు. విచారించి ప్రయోజనము లేదు. కాలహరణము గావింపక పొమ్మనెను. అది విని జయుడు అవమానపీడిత మానసుండయి క్రోధావేశపూరితుండయి గరుత్మంతుని జూచి కనులెఱ్ఱజేసి ఓరీ వాచాలా ఆశ్రయ బలము గలదు గదాయని లోకపాలకుల వాహనమునుగదాయని అహంకరించి నోటికి వచ్చిన మాటలాడకురా. ఆనాడు నీవే గదా మా వద్దకు వచ్చి "లోకపాలకులు విలాస వినోద క్రీడల నున్నారు. తిరిగి వారి ఆజ్ఞ అగువరకు వైకుంఠ ద్వారము తెరువరాదు, ఇంద్రాది సురలు వచ్చినను ప్రవేశమీయరాదనియు ఇది లోకపాలకుల ఆజ్ఞ అని చెప్పి పోయితివి. నీ మాట ననుసరించి ఏలిన వారి యాజ్ఞాను సారము తలుపులు మూసితిమి. అకారణముగా శాపగ్రస్తుల మయితిమి. ఈ తలుపులు మూయుటకు కారకుడవు నీవే. గావున నీవును మా వలెనే భూలోకమున రాక్షస కులమున అవతరింపగలవు. ఇది నా శాపము అనెను.

అపుడు గరుత్మంతుడు లబోదిబోమని మహావిష్ణువు పాదములబడి స్వామీజయుడు అకారణముగా నన్ను శాపగ్రస్తుడను జేసినాడు. ఇది అన్యాయము. అధర్మము. రక్షించండి అని పలుమారు ప్రార్ధింప మహావిష్ణువు కరుణించి తలపై చేయి నుంచి గరుడా విచారించకు ఆత్మావమానఖిన్నుడగు జయుడు తన బాధ దీర్చుకొన వలెనను తలపున శాపవిముక్తికి నన్ను ప్రార్ధించుమండ మధ్యలో అకారణముగా నీవు కల్పించుకొని జయుని తూలనాడుట తగనిది. కావున ప్రభుభక్తి పరాయణుడు నిష్టానియమ తత్పరుడు నగు జయుని వాక్యము తిరుగులేనిది. అయినను నీవు రాక్షసవంశమున జన్మించినను నాకు భక్తుడవు కాగలవు అనెను. అది విని మహాలక్ష్మి మహావిష్ణుని జూచి సాభిప్రాయ పూర్వకముగా ఇట్లనియె. ఇది ఏమి స్వామీ. జయుడు చేసిన అపచారమేమి? గరుడు దొనరించిన ఘనకార్య మేమి? లోకపాలకుల దాసుడయిన జయుడు లోకపాలకుల ఆజ్ఞానుసారము వైకుంఠ

ద్వారము మూసినాడు. అది ధర్మమే గదా. జడదారులగు మహామునులు మీ ఆశ్రయ బలము కలదు గదా యని అహంకరించి ఆత్మశక్తిని నీ భృత్యులను శాపగ్రస్తులను గావించిరి. దానిని మీరు సహించితిరి. న్యాయముగా దలచిన జయుడు మీకు భృత్యుడు. మీ యాజ్ఞ నెరపవలసిన బాధ్యత అతని కున్నది. లోకు లెవ్వరైన నేమి? వారి మాట వినవలసిన పని ఏమి? మీరానాడు గరుత్మంతునితో ఇంద్రాదులరుదెంచినను తిరిగి నా యాజ్ఞ యగువరకు తలుపులు తెరువ వలదు అని చెప్పలేదా? మీ యాజ్ఞను గరుడుడు వారికి దెల్పినాడు. వారా యాజ్ఞమేరకు తలుపులు మూసియుంచిరి. అంతు జయ విజయుల దోషమేమి? జడదారుల అహంభావ చేతలను శ్రీవారు సన్నుతించి ప్రభుభక్తి పరాయణులు, స్వామి కార్య ధురంధరులు నగు జయవిజయులను శాపగ్రస్తులను గావించిరి. అది యటుండ చానాడు జయుని శాపమున రాక్షసుడుగా బుట్టబోవు గరుత్మంతుని నాకు భక్తుడవు కాగలవని యనుట కేవలము అధర్మము. ఇరువురును స్వామి భక్తి పరాయణులే. ఇరువురును మన కొకటియే. అట్లుండ అకారణముగా శాపమున మునింగిన భృత్యులలో నొకడు మీకు శత్రువా? వేరొకడు మిత్రుడా? జయా, గరుడుడు స్వామికి భక్తుడు కాగా నీవు నాకు భక్తుడవయి శాపవిమోచనము పొందగలవు అనెను.

అపుడు జయుడు ఆనందమున యుప్పొంగి మహాలక్ష్మి పాదపీఠమున రెండు చేతులుంచి అమ్మా మహాప్రసాదము. నీవు నా యిల్లుజేరి నాకు శాపవిమోచనము గల్పింపుము తల్లీయని అనెను. అపుడు లక్ష్మి నీ కోరిక దీర నేను నీ యిల్లు జేరి శాపవిముక్తి గల్పించి మోక్షమిప్పింతునని చెప్పెను.

అపుడు విష్ణువు గరుడుని జూచి గరుడా నీవు నా పజ్జనిలిచి శాశ్వతానందమును పొందగలవు అనెను. అంతట మువ్వురు కాలజ్ఞుల ఆజ్ఞానుసారము భూలోకములో అవతరించుటకు సంసిద్ధులయి లోకపాలకుల ఆశీషంబుల నొంది వైకుంఠ ప్రాకారంబులు దాటి విరజానదీ తీరమున నిలు

చుండి భూలోకమునకేగి ఎవరి గర్భమున జనింపవలయునో యని దలంచు చుండిరి.

## రావణ, కుంభకర్ణ, విభీషణుల జననము

ఆ సమయమున నారదుడు వచ్చెను. వీరు మువ్వురు నారదుని జూచి తమ శాపముల తీరులను తెల్పి వాపోవ, నారదుడు జాలినొంది నాయనలారా విచారింపకుడు. మీ అవతారము లిపుడు మీకు బాధాకరములయిననూ లోక ముల యందు యుగయుగంబుల ప్రశంశింపబడగలవు. మీరలు మహా తప స్సంపన్నుడును, ప్రజాపతులలో నొకడగు విశ్రవసబ్రహ్మ భార్య కేకసి యను సాధ్వి గలదు, మీరలా పతివ్రతా తిలకమునకు పుత్రులయి మహా తపస్సంపన్నులయి లోక విఖ్యాత కీర్తి ధుర్యులు గాగలరని చెల్పి నారదుడు వెళ్ళిపోయెను.

## వసంత ఋతువర్ణనము

గంగానదీ తీరమున, విశ్రవసబ్రహ్మ తన భార్యయగు కేకసితో సకల శిష్య బృందంబుతో ఆశ్రమము నిర్మించుకొని కాపురముండెను. అట్లుండ కాలప్రవాహమున వసంత ఋతువు వచ్చెను. అపు డా వనమునగల సకల వృక్షములు పుష్ప ఫలభరితములై నవ్యకళా శోభితములై కనువిందు గూర్చు చుండెను.

అట్లుండ నొక దినంబున కేకసి ఆ పుష్పవనమున విహరించుచూ అందు దిరుగు శుక, పిక శారికాది జంటలు యొకచో జేరి పరస్పర చెంచు పుటాభి గమనమున మధురానుభూతి నందుట గాంచి తన మనంబున ఇట్లు విచారించెను. ఆహా తిర్యగ్జంతులకు సహితము కామరసానుభూతి ఆత్మా నందదాయకము గదా, తపస్సంపన్నులను వివాహమాడిన తరుణులు అంగజ రాజ్యభోగ విహీనులేగదా యని తన పతి దన దరిజేరకుండుట దలంచి మనంబున చింతించి పుష్ప వాటిక విడిచి ఆశ్రమంబునకేగి బహిః

ప్రాంగణంబున, విచారరసాధి దేవతయో యన యొక రాతిపైన గూర్చుండెను.

అది జూచిన ఆశ్రమవాసినులు కేకసి మనోవిచారము నెరుంగజాలక పరిపరి విధంబుల మనంబుల నాలోచించి కారణము దెలియజాలక నుండిరి. ఆ సమయమున మహా తపస్వియగు విశ్రవసబ్రహ్మ వచ్చి విచార వదన యగు భార్యను జూచి ఏమి ఇది యని యడిగెను. కేకసి బదులు పలకక ఆశ్రమములోనికి వచ్చెను. విశ్రవసుడును ఆశ్రమములోనికి వచ్చి ఆసనమున గూర్చుండి సతిని దగ్గరదీసి లాలించి విచారమునకు కారణమేమని యడిగెను.

అపుడు కేకసి మోకాల దల నానించి వినయ వివేక భాషణముల నిట్లనియె. స్వామి ప్రపంచమున ప్రతిజంతువులలోను గల స్త్రీ పురుష జాతులు ఏదో యొక సమయమున ఏకాంత భావాను భోగభాగ్య మనుభ వించుట సృష్టిలోనిదే గదా. స్త్రీ పురుషుల అన్యోన్యానురాగభావమేగదా ఆనందదాయకము. నాల్గు పుష్కరంబులు గడిచినవి. యౌవన మంతరించు సమయ మాసన్నమయినది. ఇంతవరకు ఒక్కనాడేనియును అన్యోన్యానురాగ ఆలింగనాభాగ్య మెరుంగను. అధరాధర మధురానుపానభూతి చవిచూడ లేదు. అంగజ లీలాతరంగిణి నడుగిడలేదు. పురుషార్థములలో కామము గూడ యొకటి గదా. భార్యయనిన గృహకృత్య నిర్వహణకేనా? గృహ స్థాశ్రమ ధర్మమగు కామ లీలా వినోదము నందవలదా. తాళి గట్టినంత మాత్రమున తరుణికి యానంద ముండునా? ఏకాంత భర్తృ సేవనాలింగనాదు లందక ఏ యువతియైనను ఆత్మానంద మందునా? మనసిజలీలా తరంగిణి నోలలాడి, అంగజ రాజ్యాను పాలనంబున ఆత్మానందమంది ఆత్మజుల గాంచకున్న తరుణి హృదయమెంత తహ తహ పడునో మీరూహింపుడు. అని కన్నీరాలుక భర్తృనొడిలో దలవాల్చిన భార్యను జూచి విశ్రవసబ్రహ్మ తల నిమిరి చెక్కిలి ముద్దిడి సతీ ఈ దినంబున నీ కోరిక నెరవేర్తునని సంధ్యావందన సమయమగుట అరసి గంగానదీ తీరమునకు బోయెను.

అంత కేకసి నానావిధ పరిమళ తైలముల జలకమాడి, మల్లె, మొల్ల జాజి, మందార, గులాబి, సంపెంగ, మాలతీ సుమంబుల శయ్య నమర్చి తాను దివ్యమాలికాంబర భూషితయైన శృంగార రసాధిదేవతయో యన అలంకరించుకొని ఆశ్రమ ప్రాంగణంబున నిలుచుని యుండెను.

ఇంతలో చంద్రోదయమాయెను. చల్లగాలులు గంగానదీ తరంగ సేకర తుంపరుల నవవికసితసుమ పరిమళంబుల సేకరించి కామినీ హృదయా నందము గూర్చ విచ్చలవిడి విహరింపదొడగె. ఆ సమయమున మహర్షి స్నాన సంధ్యాది విధులు పూర్తిగావించి ఆశ్రమంబునకు జేరి రతీసౌందర్య ద్విగుణీకృత రూపసియగు భార్యను జూచి "ఆహా! ఈమె గంధర్వకాంతల తలదన్నినది. అప్సరసల కధికమగు అందచందముల అలరారుచున్నదని దలంచి తన నేత్రముల నెన్నడెరుగని కేకసి సౌందర్యంబును తనివితీర జూచి ఆహా పాడుబ్రహ్మ నాకు పదివేల కనులీయగూడదా? రెండు కనులు మాత్రమిచ్చి ద్రోహ మాచరించినాడని తలంపు నంతలో కేకసి భర్త దరి జేరి చేతనున్న కమండలము తీసికొని విలాసముగా ఆశ్రమములోనికి తీసి కొనివచ్చి ఆసనమున గూర్చుండజేసెను.

అపుడు మహర్షి తన భార్యజేయు సపర్యల కలరి ఏమి కావలయునో కోరుమనెను. అపుడు కేకసి అమందానంద సందోహోత్సాహ పూరిత మనస్క అయి విలాసముగా భర్త ఒడిలో వ్రాలి ఆయన చేతులను తన యురోజముల జేర్చి తన చేతుల మహర్షి గండ పార్శ్వముల నానుచూ మందస్మిత వదనారవిందయయి మధుర మంజుల మనోహర స్వరంబున ఇట్లనియె: "స్వామీ ఈ దినము నా జన్మకు సుదినము. నాకు తమ సమా గమము వలన సద్యోగర్భమున పుత్రుడుదయించి నిత్యయౌవనుడయి తండ్రిని మించిన తపోశాలియయి అఖండ విక్రమపరాక్రమంబున ఆ ఖండలు నోడించి అష్టదిక్కులను పరిపాలించి అనన్య సామాన్యానుభూతి ననుభ వించి అఖండ భోగభాగ్య విభవ సంపన్నుడగునట్లు, వర మొసంగమన మహర్షి సంతసించి ఆనందాతిశయమున, అతివతో పూలపాన్పుచేరి, ఆ రాత్రి

అంగజలీలాడోలలనోలలాడగ బ్రాహ్మీ ముహూర్తమున సద్యోగర్భమున కేకసికి కుమారుడుదయించెను.

అంత విశ్రవస్బ్రహ్మ తమ పురోహితు డగు శుక్రాచార్యులను రావించెను. ఇంతలో కేకసి పుత్రుడు పరప్రభావమున యౌవనుడాయెను. ఆశ్రమ వాసులందరు ఆ వింత జూచి ఆశ్చర్యపడి ఆత్మతపోశక్తి కలవి గానిదేదీ ప్రపంచమున లేదని దలంచి కేకసి యదృష్టమును వేనోళ్ళ పొగిడి మహర్షి మహత్వమును గొనియాడిరి.

శుక్రాచార్యులు విశ్రవసుని అనుమతిని కేకసి పుత్రునకు జాత కర్మ లాచరించి మధురమగు కంఠరవము కలవాడు కనుక రావణుడని నామ కరణము గావించి రావణునకు దివ్యమంత్ర ముపదేశించి తపోవనమునకు బంపెను.

## రావణుని తపము - వరములు

రావణుడు నిష్ఠా గరిష్ఠుడయి ఘోరాతి ఘోర మగు అరణ్యమున ఏకపాదాంగుష్ఠమున నిలచి, కేవలము వాయుమాత్ర భక్షకుడయి, తప మాచ రించెను. అట్లు ఘోరతపమాచరించు రావణుని జూచి దేవతలు భియపడిరి. గంధర్వులు కంగారుపడిరి. కిన్నరులు కెవ్వమనిరి. గరుడులు గొల్లుమనిరి. ఈ విధంబున ఖేచరులందరు భయాందోళిత మనస్కులయిరి.

అట్లుండ దేవేంద్రుడు రావణుని తపోభంగము కావింప అనేక ప్రయత్నము లాచరించి విఫలుడాయెను. అపుడు బ్రహ్మ రావణుని తపము నకు మెచ్చి వరమీయ ప్రత్యక్షమాయెను. రావణుడు తన ఎదుట నిలిచిన నాల్గు ముగముల వానిని జూచి, నమస్కరించి, చేతులు జోడించి నిలువ బడెను. అపుడు బ్రహ్మ 'వత్సా నీకే వరము కావలెనో కోరుకొనుమనెను. అపుడు రావణుడు స్వామీ నీవు నాల్గు మొగములతో నవ్యవిలాస వినోద భరితముగా ఆడు వాక్యములను వినుటకు నాకును నాలుగు మొగములిమ్ము, నీ వలన వినిన వాక్యములను, నాలుగు దిక్కులకు జాటుటకు మరియొక నాల్గు ముగములను,పాతాళవాసులకు తెలుపుటకు, ఒక మొగము, ఆకాశచారు

లకు చెప్పుటకు, ఒక మొగము, మొత్తము పది మొగములిమ్ము. ఇప్పుడొక టున్నదిగాన తొమ్మిది మొగములిమ్ము. ఒక మొగమునకు రెండు చేతు లిచ్చితివి గాన పది రెండ్లు ఇరువది చేతులిమ్ము అని ప్రార్థింప అట్లె పది తలలు ఇరువది చేతులు రావణునికి వచ్చినవి.

అప్పుడు రావణుడు బ్రహ్మకు నమస్కరింప బ్రహ్మ "రావణా నీకు సమస్త శాస్త్రములు కరతలామలకములు. ఈ పది తలలు ఇరువది చేతులు నీవు తలచినపుడు రాగలవు. అవసరము లేనప్పుడు నీ తొమ్మిది తలలు, పదునెనిమిది చేతులు నీవు దలచినప్పుడు అంతర్ధానమందగలవు. ఈ తలలు, చేతులు, కామినీ విలాస సమయమున తలచితివేని అవి నశింపగలవు జాగ్రత్త. యజ్ఞయాగముల యందు రణరంగముల యందు వాదోపవాద ములయందు నీ తలలు, చేతులుపయోగపడగలవు అని ఇంకేమి గావలయునో కోరుమనిన రావణుడు తనకు చావు లేకుండ వరమీయమని కోరెను. అది విని బ్రహ్మ నవ్వి రావణా అది అసాధ్యము. భూమిపై బుట్టిన ప్రతిప్రాణి ఏదో యొకనాడు మృతి నొందవలసినదే. శాశ్వతముగా నుండుటకు ఎవరికీ సాధ్యముగాదు. కానేరదు. కావున నీకు ఎవరి వలన చావు కలుగకుండ వరము గావలయునో, గోరు మిచ్చెద మని బలుక, రావణుడు నరవానరుల నొదిలి మిగిలిన వారి వలన దనకు చావు లేకుండునట్లు వరమంది తన యాశ్రమంబునకు చేరెను.

పది తలలు ఇరువది చేతులతో జగన్మోహనముగా సామమును పాడుచు, వచ్చిన కుమారుని జూచి కేకసి ఆనందబడి ఆలింగనముజేసి, తల ముద్దాడి, కుమారుని తండ్రి వద్దకు గొనిపోయెను. విశ్రవసుడును రావణుని ప్రతిభకు సంతసించెను. తరువాత రావణుడు నిత్య తపోనుష్ఠానముల ఆత్మా నంద మందుచుండెను.

## కుంభకర్ణ జననము

ఇట్లుండ నొకనాడు కేకసి ఒక్క కుమారుడు కుమారుడు కాడు. ఒక కన్ను కన్నుగాదని దలంచి తిరిగి భర్తదరిజేరి మరియొక పుత్రుని

ప్రసాదించవనెను. విశ్రవసుడు సరేనని తపమునకుబోయి రాత్రికి యిల్లు జేరి భార్యచే సపర్యలనంది పూలశయ్యజేర కేకసి సమాగమ సమయమున కనులు మూసుకొని అనందరసానుభూతి విహీనయయి వరుండెను. అపుడు ఆమెకు సద్యోగర్భమున పుత్రుడుదయించి కన్నులు తెరువకున్న కేకసి భయపడి యిదేమియని భర్తనడుగ మహర్షి సాధ్వీ సమాగమ సమయమున నీవు కనులు మూసుకొంటివి. గాన యీతడు నిరంతర నిద్రాసక్తుడు కాగల డని చెప్పెను.

అప్పుడు కేకసి, భర్త పాదములబడి, పలువిధముల విలపించగా మహర్షి తిరిగి మరియొక పుత్రునిత్తునని వెళ్ళిపోయెను. కేకసి తాను ఆచ రించిన అకృత్యమునకు మనసులో విచారపడి అమరిన ఆనందమును అనుభ వింపజాలక పరిపరి విధముల పలవించి తను చేసిన అకృత్యము వలన తనకు జనించిన పుత్రుడు మహాబలశాలి అయినను సర్వకాలములయందు నిద్రాసక్తుడయి యుండుటకు ఎటులనో మనమున ఊరటబొంది తిరిగి తన మనోనాధుని సమాగమము కొరకు మంచి సమయమునకు ఎదురు చూచు చుండెను.

## విభీషణు జననము

ఒక దినంబున కేకసి శ్వేతాంబరధారిణియై శ్వేత కుసుమాలంకృతయై భర్తను జేరి సకల వినయ వినోద విలాస లాలనాయత్తచిత్తయైన మహర్షి మనోభావానుగుణ్యముగా మనోజలీలాతరంగిణి నోలలాడ ఆనందమంద ఆ రోజున సకల సౌందర్యరూపుడు, శాంతదాంత సద్గుణ సంపన్ను డుద యించి సద్యోయౌవనుండాయెను. అంత శుక్రాచార్యులు వారిద్దరికీ మంత్ర ముపదేశించి తపోవనమునకు బంపెను.

## కుంభకర్ణుని తపము

శుక్రాచార్యుల అనుమతిని కుంభకర్ణుడు తమకు ఆజన్మ శత్రువులగు దేవతలు ఈ భూమిని లేకుండ జేతునని శపధముజేసి, "నిర్దేవత్వమను వర

మును పొందదలంచి, బ్రహ్మను గూర్చి తపము జేసెను. ఆ తపముజేయు సమయంబున, నారదుడు కుంభకర్ణుని అభిప్రాయమెరిగి, తమ తల్లి యగు సరస్వతి వద్దకు బోయి, అమ్మా నాయన భక్తపరాధీనుడు. భక్తు దేవరమడిగినా ఈయక మానడు. కావున కుంభకర్ణుడు మరాశాపాశబద్ధుడై ఈ భూమిని సకల దేవతా నాశన మొనరింపదలచియున్నాడు. ఈ యాపద నీవు దక్క ఘాటింపగలవారు లేరని, పరిపరి విధముల ప్రార్థింప, సరస్వతి పుత్రుని కోరిక దీర్ప లంతరు ప్రకాసినియై కుంభకర్ణు నాలుక నావహించెను. బ్రహ్మ తపమునకు మెచ్చి కుంభకర్ణుని వర మడుగమనిన వాడు నిర్దేవత్వం అన బోయి నిద్ర నిద్ర యని ముమ్మారు గోరెను. అంత బ్రహ్మ సరేనని వర మిచ్చి అంతర్ధానమాయెను. కుంభకర్ణుడు బ్రహ్మ వరప్రభావమున నిద్రా బద్ధుడయి ఉండెను. విభీషణుడు తప మాచరించి తన మనసు ఎల్లప్పుడును ధర్మబద్ధమయి ఉండునట్లు వరము బొంది, ఆశ్రమమునకు జేర తల్లి కేకసి రావణ, విభీషణుల జూచి పరమానందమున నుండెను. విశ్రవసబ్రహ్మ యున్నూ పుత్రుల జూచి ఆనంద మొందుచుండెను. ఆశ్రమవాసు లందరు రావణుని సామ గాన వినోదమున ఆనంద మందుచుండిరి.

## రావణుడు స్వర్గముపై దండు వెడలుట

శుక్రాచార్యానుమతిని, రావణుడు కొంత రాక్షస మూక జేర్చి, స్వర్గముపై దాడికి వచ్చెను. ఆ వార్త వినిన ఇంద్రుడు మిగిలిన దిక్పాలుర నెల్ల రావించి సకల ఖేచర సేనలతో రావణు నెదిరించి ముప్పది దినములు హోరాహోరి పోరి చివరకు దిక్పాలకు లందరు రావణున కోడిపోయిరి. అపుడు శుక్రాచార్యులు రావణుని విజయమును అష్ట దిక్కులను చాటి ఇంద్రాదులను బంధించి రావణుని స్వర్గరాజ్యమున పట్టాభిషిక్తుడవు గమ్మన మని జెప్పి, రావణునకు స్వర్గరాజ్యము నంతయు జూపెను. రావణుడు స్వర్గ లోకమంతయును జూచెను. ఆ లోకమున కొందరు మత్తుగా మద్యమును సేవించి మత్తున పడియున్నవారలును, ఒక కాంతను ఒకచోట జేరిచి పది

మంది పురుషులు రమించువారలుగను, వివస్త్రలన స్త్రీల వెంబడి లజ్జావిహీను లయి శృంగార రసాభాస లీలల నుండువారలను జూచి రావణుడు అసహ్య మంది శుక్రాచార్యులను జేరి ఇట్లనియెను.

గురువర్యా, ఏమి ఈ విపరీతము? సప్తవ్యసనములకు ఆలవాలమగు ఈ ప్రదేశమా స్వర్గము? ఈ భోగమునకా నిరంతరము నిష్టాగరిష్టులయి అడవిన బడి దప మాచరించుట. ఈ స్వర్గపాలనము నా కక్కరలేదు. మాన విహీనులగు కాంతలు, ధర్మ భ్రష్టులగు పురుషులనా నేను పరిపాలించునది. అని తెల్పి బందీలగు ఇంద్రాదులను రావించి మీ రాజ్యములు మీ రేలు కొమ్మని నిరంతరము రావణ పాదపీఠ సేవానిరతులుగా నుందుడని శాసించి, రావణుడు తల్లి దరిజేరి నమస్కరించి స్వర్గలోక దుర్భర దౌర్భాగ్య ములను పలుదడవలుగ్గడించి నీతి, నియమ, నిష్టాశూన్య లగు సన్యాసుల సత్రమగు స్వర్గపాలనము సిగ్గుచేటని తిరిగి తపోవనమున కేగెదనన, కేకసి కుమారుని నియమమునకు ధర్మవర్తనమునకు ఆనందబడి నాయనా చావుకు ముగము వాచిన యింద్రాదుల నోడించుట ప్రతిభ కాదు. పరమపద వాసు డగు వాసుదేవు నోడించిన లోక విఖ్యాతి నందగలవు. ఆతనిచే జచ్చినను శాశ్వతానంద మందగలవని చెప్పెను.

అది విని రావణుడు తల్లికి నమస్కరించి వైకుంఠము పైదండు వెడలుటకు ముహూర్తము నిశ్చయించి తలిదండ్రుల, ఆశ్రమవాసుల ఆశిష ముల బొంది శుభముహూర్తమున అనంతసేనా పరివృతుడై వైకుంఠముపై దండు వెడలెను.

## రావణుడు వైకుంఠమును ముట్టడించుట

ఈ విధమున రావణుండు సేనాపరివృతుడయి విరజా నదీతీరము జేరి రణభేరి మ్రోగించెను. దానికి ప్రతిభేరి వినపడలేదు. తిరిగి పలుసారులు భేరులను మ్రోగించి, శంఖారావములు జేసినను ప్రతిరవము లేనందున రావణు ఆశ్చర్యపడి ఏమి ఈ విపరీతము? లోక విఖ్యాత పరాక్రమ సంపన్నుడగు, శ్రీ మహావిష్ణువు శత్రువు మ్రోగించిన రణభేరికి బదులు

భేరి మ్రోగింపకుండుట ఓడుటయే గదా. మహావిష్ణువు అంత భీరుడా? కానిమ్ము ఏమైనను అతని నొకసారి జూచి దీరవలెనని దలంచి సేనలన్నిటిని విరజా నదీ ప్రాంతములనునిచి గదామాత్ర సహాయుడై, వైకుంఠనగర ప్రాకారముల ప్రవేశించెను. ఏ ప్రాకారములోను మానవ సంచారము లేదు. ద్వారపాలకు లసలే లేదు. వందిమాగధులు మచ్చుకైనను గానరారు. భట నివహములు గాని, భక్త బృందములు గాని ఎవ్వరూ లేక ఏడు ప్రాకారములు నిర్జనముగా నుండుట జూచి రావణుడు ఆశ్చర్యమంది చివరకు ఏడవ ప్రాకారమున గల శేష పాన్పు దరిజేర ఆ ఆదిశేషుడు జీవరహితమగు శిలాప్రతిమ వలె నుండెను.

ఆది జూచి రావణుడు ఏమి యాశ్చర్యము, చతుర్దశ భువన విఖ్యాత పరాక్రమ సంపన్నుడగు శ్రీమహావిష్ణువు, నా రాక ఎరింగి, ఎచటికేనియు దాగి యుండుటకు పారిపోయెనా? సకల చరాచర సృష్టి స్థితిలయ కారకుడగు, ఆదినారాయణుడు, అంతర్ధాన మగుటయు, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణయే తనకు ప్రధాన నిత్యకృత్యములుగా గలిగిన అనంతశయనుండు, అరివర్గమునకు భయపడి అఖండ దివ్యాలంకార మండితమయి, అనంత మణిమయ ప్రాకార గోపుర సౌధ సౌధాంతరాళ నిర్మితమయి అనేక పరివార పరివృతమయిన పరమపదమును వీడిపోవుట ఆశ్చర్యముగా నున్నది. అని పరి పరి విధముల చింతించి, ఏమి జేయుటకు దోచక తన సంరంభమంతయు వ్యర్ధమగుటకు చింతించి, కింకర్తవ్యతామూఢుడయి, దిక్కులు జూచుచుండ, ఒక దివ్యసుందరి అట గాన వచ్చెను. అంత రావణుడు నేలకు తన గద మోది, తన రాక నామెకు దెలిపి, వైకుంఠుడేడని యడిగెను. ఆమె మందస్మిత వదనారవిందయయి, వైకుంఠునితో నీ కేమి పని యని ప్రశ్నింప, రావణుడు గంభీర గర్జనారవంబున, అతనితో యుద్ధ మొనరించి అతనిని చంప దలచితి ననెను.

ఆ మాట వినిన ఆ దివ్యసుందరి ఫక్కున నవ్వి, నీకు యుద్ధ సమయ మననేమియో దెలియునా? నీకు అస్త్రశస్త్ర ప్రయోగాది రణ ధర్మములు

నేర్పిన గురు వెవరని ప్రశ్నించెను. అది విని రావణుడు, సకల శాస్త్రకర్త యగు శుక్రాచార్యులు అనినంతనే ఆ దివ్యసుందరి కనులు లేని గుడ్డివాడి శిష్యుడవా? నీవు రణము సేయ వచ్చితివా? అని అవహేళనముగా మాటలాడ రావణుడు ఒకప్రక్క రోషము, యొకవంక క్రోధము, మరియొకవంక ఆక్రోశము పెల్లుబికి పర్వదినంబున సంద్రమునలె మన మారాటపడుచుండ కింకర్తవ్యతామూఢుడయి నేలను జూచుచూ అవుననెను.

అది విని ఆ సుందరి నీకు రణ ధర్మములు సర్వము తెలియునంటివే రణమున వెనుదిరిగి పారిపోయిన వానినేమి సేయుదువు? ఆతని వెనుక పరుగిడి పరిమార్తువా యనెను. అపుడు రావణుడు ఆ మాటలతో అంతరార్థమును గ్రహించి తాను రణభేరి ప్రయోగించిన అదివిని అదృశ్యుడయిన వానిని వెదకి జంపెద ననుట వీరధర్మము గాదని దలచి, మనసున సిగ్గుజెంది సేనా సహితముగా ఆశ్రమమునకు తిరిగివచ్చి, తన తల్లియగు కేకేసి పాదము లకు నమస్కరించి తనకు విష్ణువు గానరాలేదని, తాను వైకుంఠమున జూచిన సుందరి ఆడిన మాటలను తల్లికి సవివరముగా వివరించెను. అది విని కేకసి నాయనా శ్రీమహావిష్ణువు పేరుబొందిన ఇంద్రజాలకుడు. ఎప్పు డైనను నీకు అతనివలననే ముప్పు కలదని చెప్పిపోయెను.

## రావణుడు శివుని గూర్చి తపము జేయుట

అంతట రావణుడు సకల ప్రాణులకు మృత్యువును ప్రసాదించువాడు శివుడు గదాయని తలంచి, తపోనిష్ఠ నాతనిని వశపరచుకొని, తనకు మృత్యువు లేకుండ జేయదలచి, అరణ్యమునకు బోయి, ఘోర తప మాచరించెను ఆ తపమునకు మెచ్చి పార్వతీ పరమేస్వరులు ప్రత్యక్షమయి వరము వేడుమన, రావణుడు తనకు చావు లేకుండ వరమిమ్మనెను. అందులకు పరమేశ్వరుడు నవ్వి, నాయనా చావు లేకుండ వరమీయజాలను. "జాతస్య మరణం ధృవం." అని నీవు ఏ రోజున భూమిపై బుట్టితివో ఆ రోజుననే నీ మరణము నిర్ణయింపబడినది. మరి యేది అయిన గోరుమనగా రావణు డాలోచించి

ఎప్పుడైనను లయకారుడు ఈశ్వరుడు గదా అతనిని తనకు సర్వదా ఆరాధ్య దైవముగా నుండమనియు తలంచినప్పుడు సర్వమంగళ సహిత ముగా దర్శనమీయమని గోరెను. శివుడు దానికి సమ్మతించి అంతర్ధాన మాయెను.

రావణుడు తిరిగి ఆశ్రమంబునకు జేరి తలిదండ్రులకు, గురువగు శుక్రాచార్యులకు నమస్కరించి ఆశిషములందెను. అపుడు కేకసి శుక్రా చార్యులతో ఇట్లనియెను. ఓ మహానుభావా నీ శిష్యుడు రావణుడు అఖండ భూమండలమును జయించిన వీరుడు. దిక్పాలకుల దాస్యము లందుచున్న మహనీయుడు.

అతడీ చిన్న తపోవనమున జడదారివలె నుండవలయునా? ఏ సాధ్వి యైనను తన పుత్రుని గొప్పదనమును జూడగోరును కదా అనెను. శుక్రా చార్యుడా మాటలోని అంతరార్థమును గ్రహించి తల్లీ రావణునకు అందమున అమరావతిని మించినదియును, విశాలమైనదియును సకల సౌభాగ్యముల కాలవాలమగు అలకాపురికన్న అధికమగు పురమును గల్పింతును. అని మయుని దలచిన మయుడు ప్రత్యక్షమాయెను. అపుడు శుక్రాచార్యులు మయుని జూచి నీవు దానవ సార్వభౌమునకు నివాస యోగ్యమగు పురమును గల్పింప మన మయుడు యిట్లు సంద్రము నొడ్డున త్రికూటమను పర్వతము గలదు. అందు మణిమయ రత్నరాసులతో విరాజిల్లు పురమును గల్పింతు నని వెళ్ళిపోయెను.

## లంకాపుర నిర్మాణము

మయుడు త్రికూట పర్వతమున సకల సంపదలు గలిగి సమస్థలముగా నున్న ప్రదేశమున నానా విధ మణి, రత్న, కాంచనలతో దివ్యప్రాసాదములు సృష్టించి శత్రుదుర్భేద్యమగు ద్వార బంధముల గల్పించి అనవరత వాయు సంసేవితము, నిరంతర జ్యోతి ప్రభావితము దివ్యసుందర మందిరారామ ములు గల్పించి విశాలములగు రాజవీధుల నేర్పరచి నానావిధ పరిమళ

కుసుమ భరితంబులగు యుద్యాన వనంబులు, ఇక్షురసంబును హేళనజేయు మధురాతి మధుర జలసమృద్ధములగు జలాశయముల గల్పించి, దివ్యమణి మయ సంశోభితంబులగు, నానావిధ రత్న దీపంబుల, సకల వీధులను, ప్రాసాదంబులను ప్రాకారంబులను అలంకరించి, దిక్పాలక పురంబుల, దల దన్ను కాంతిమంతమయిన, పురమును సృష్టించెను. ఆ పురమును గాయ లంఖిణియను యొక దివ్యసుందరిని సృష్టించి మయుడు ఆ పురమునకు అష్టవిధ లక్ష్ములకు ఆలవాలమయిన సుందరమయిన పురంబు గావున దానికి లంక (లంక యనిన లక్ష్మీకాపుర ముండు ప్రాసాదమని అర్థము) అను నామ కరణము గావించి, లంఖిణిని జాగ్రత్తగా ఆ పురమును గాయమని నియ మించి తాను విశ్రవసుని ఆశ్రమమునకు వచ్చుచుండెను.

## మండోదరి జననము

ఇక్షు సముద్రతీరమున, దివ్యసుందర పరిమళకుసుమభరితమైన ఉద్యాన వనమున, మృకండు డను మహర్షి ఆశ్రమము నిర్మించుకొని యుండెను. అట్లుండ నొకనాడు సుమపరిమళ యను అప్సరస సఖీగణముతో, ఇక్షు సముద్రప్రాంతమున, విలాసవిహారము సలుపుచు, నవవికసిత కుసుమ పరిమళశోభితము, మందమలయా నిలసంసేవితమగు, పూలనికుంజముల, గంధర్వగానంబున, ఆనందాతిరేకంబున, మైమరచి నాట్యంబు సలుపుచూ మృకండుని వనవాటి సమీపమున జేరెను. మృకండుడును సాయం సంధ్యావిధులు నిర్వర్తించి, ప్రశాంతమనస్కుడై యుండ. ఏదో మధురాతి మధుర మంజులమనోహర గానలహరి, తన చెవులబడ, మృకండ మహర్షి ఆనందాతిరేకంబున నలుదిక్కులజూచుచూ, ఆశ్రమంబునకు వెలుపలకు వచ్చెను. అపుడు చంద్రుడు ఆ కాశమున తన శోడశ కళలను వెదజల్లి దిక్కులను వెన్నెలచే నింపివేసెను ఆ సమయమున చంద్రబింబమునకు సాటి యననొప్పు ఆ యప్సరస, గానవాహినితో, దిక్కులు ప్రతిధ్వనింపజేయుచు

శృంగారరసాధి దేవతవలె ఒయ్యారముల కబోయుచు, నవపల్లవంబులబోలు తన కోమల మృదులాతిమృదుల హస్తంబుల, పూలకుంజముల చిగురులు గిల్లుచు, నవవికసితకుసుమంబుల ద్రుంచి తల ముడుచుచూ విహరించు చుండుట జూచి, మృకండుడు, ఆ వనిత దగ్గరకుబోయి ఆమె మనోహ రాకారము జూచి కామమోహితు డయి, పలువిధము లా కాంతను కామకేళికి బలాత్కరింప, ఆ అప్సరస మీసము, గడ్డము పెరిగి విభూతి నలదిన సుందరవిహీనరూపు డగు, ఆ మహర్షి సంగమమున కిష్టములేక, అచ్చట దిరుగు కప్పలలో కలియసంకల్పించి, కామరూపము గలది కాన తాను కప్పగా మారిపోయెను.

మహర్షి తానును కప్పగామారి ఆ కన్యను సంభోగించెను. అపుడు సద్యోగర్భమున ఆ కాంతకు ఒక ఆడపిల్ల జన్మించెను. అంత ఆ అప్సరస ఆ పిల్లను చేతనెత్తి మహర్షితో ఇట్లనెను.

ఓ తపోధనా నేను కుబేరుని సభలో నాట్యముసలుపు అప్సరసను. నాకు ఈ పిల్ల కలిగిన దనిన నన్ను యక్షేశుడు పదభ్రష్టను జేయగలడు. మా అప్సరసలకు సంతానము గలిగినదను విషయము వెల్లడియైన, మా కులం బున, మమ్ములను వెలివేసి నీచముగా జూతురు. కావున ఈ పిల్లను మీరే దీసికొనిపొండని మహర్షి పాదములనుంచి, మనోవేగంబున ఆ యప్సరస అంతర్ధాన మాయెను. మృకండుడును తానొనరించిన, కామవ్యసన విహార మునకు, చింతిల్లి తన తపోశక్తిని, ఆ పసికందును నిత్యయౌవనిగాజేసి "అమ్మా నీకు సకలకళలను ప్రసాదించుచున్నాను. నీవు అనన్యసామాన్య భోగవైభవముల విరాజిల్ల గలవు. త్రిలోకవీరుడు, సకలసద్గుణసంపన్నుడు, రసికాగ్రేసరుడు నీకు భర్తకాగల"దని జెప్పి నీ కెందరు బిడ్డలు కలిగినను నీ కన్యాత్వమునకు భంగమురాదని వరమొసంగి తాను తపోవనమున కేగెను. మందోదరియును అభినవవిలాస విభ్రమముల ఆ వనమున దిరుగు చుండెను.

19

# అంగద జననము

వాలి యను వానరరాజు విలాసముగా జలతరుకాననంబుల తిరిగి తిరిగి సాయంసమయమున, తమ ఇంటికి బోవుచుండెను. అలా పోవునపుడు అపర రతివలె సౌందర్యరాసి యగు మండోదరి యొంటరిగా పూలవనంబున తిరుగాడుటజూచి, దగ్గరకువచ్చి ఆమె ముగ్ధమోహన సౌందర్యమును జూచి మోహావేశపరుడయి, మండోదరిని రమించెను. అపుడు మండోదరికి సద్యోగర్భమున కుమారు డుదయించెను. మండోదరి ఆ కుమారుని చేతనెత్తి వాలి పజ్జజేరి "ప్రభూ నేను కన్యను. అవివాహితను. నన్ను బలాత్కారముగా సంభోగించిన కారణముగా నా కీ కుమారుడు కలిగినాడు. నేను మీ యర్థాంగిని. నన్ను మీ వెంటగొనిపొ"మ్మని అనేకవిధముల ప్రార్థింప వాలి ఇదివరకు తనకు ఇద్దరు భార్య లుండుట దలంచి దిగులుజెంది మండోదరిని అనునయ వాక్యముల ఇట్లనియె.

"లలనా నాకిదివరకే ఇరువురు భార్య లుండిరి. వారికితోడు మూడవదానివి నీవుకూడ వచ్చిన త్రేతాగ్నులను దాచియుంచిన సమిధల గుట్టవలె నా గృహము నిత్యకలహదహనదావానలము కాగలదు. కావున నేను నిన్ను దీసికొని పోజాల" నన మండోదరి కన్నీరు మన్నీరుగా ఏడ్చుచు తన ఏకాకిత్వము తలంచి వాలిపాదము లంటి వాపోయెను. అపుడు వాలి మండోదరి నోరార్చి పుత్రుని దీసికొనిపోయెను. అప్పుడు మండోదరి ఒక పూల పొద జేరి విలపింపసాగెను.

ఇది అంతయు దూరమునుండి జూచుచున్న మయుడు, మండోదరి యొద్దకు మెల్లన జేరి, అనునయవాక్యముల ఆమె నోదార్చి తనతో ఇంటికి గొనిపోయెను. ఆమెను తన భార్యకు జూపించి మండోదరి వృత్తాంతము ఆమూలాగ్ర మెరింగించి ఈ మండోదరిని దానవ సార్వభౌము డగు రావణునకు పరిణయము గావింప నిశ్చయించెను.

# రావణుని వివాహము

మయుడు శుక్రాచార్యులయొద్దకుపోయి, లంకాపుర నిర్మాణము పూర్తి యయినదని దాని స్వరూప, సౌధ నిర్మాణాదులను యథాక్రమముగా వివరించి చెప్పెను. అంత శుక్రాచార్యులు కేకసి, విశ్రవసుల వద్దకు రావణుని బిలచి లంకానగరమున రావణ ప్రవేశమునకు శుభముహూర్తము నిర్ణయించెను. ఆ సమయమున మయుడు చేతులు జోడించి అందరు విన ఇట్లనియె:

"ఓ మహానుభావులారా! పురలక్ష్మితోబాటు, గృహలక్ష్మిని గూడా గ్రహింపు" మని మందోదరి తనకుమార్తె యని చెప్పి ఆమెను రావణున కిచ్చి వివాహము చేయుమని ప్రార్థించెను. అప్పుడు కేకసి భర్త అనుమతిని మందోదరిని పిలిపించి అపూర్వ సౌందర్యరాశి యగు ఆ కాంతామణి తన కుమారునకు దగినపత్ని యని దలంచి వివాహమునకు ముహూర్తమును నిశ్చయింప భర్తను కోరెను. అది అంతయు ఎరింగిన మందోదరి కేకసి పాదములకు నమస్కరించి "అమ్మా నాదొక మనవి. నన్ను పరిణయమాడు పురుషుడు ఏ సమయముననైనను ఏ యవస్థనైనను పరకాంతాసమాగమము నపేక్షింపరాదు. నన్ను వీడరాదు. అందులకు సమ్మతించిన నన్నాతని కిచ్చి పరిణయము సేయుడు లేకున్న అక్కరలే"దన, కేకసి రావణుని బిలచి విషయము వివరింప రావణుడు తలిదండ్రుల పాదయానతిని కలనైనను నేను నా కులకాంత మందోదరిని దప్ప ఇతరులను కామింపనని ప్రమాణముసేయ శుభ ముహూర్తమున మందోదరీ రావణులకు పరిణయమయి లంకాపురమున త్రిలోక్యరాజ్య పట్టాభిషిక్తు లయిరి.

అటు తరువాత రావణుడు మందోదరి, దివ్యలతా పరివృతకాననంబుల రత్నప్రభాదీపిక సౌధంబుల ప్రణయలీలావిభూతి నందుచుండిరి. దిక్పాలకాంతలు రాత్రింబవలు మందోదరి కూడిగంబు సేయుచుండిరి. ఇంద్రాదులు రావణుని సేవింపుచుండిరి. ఈ విధముగా రావణుడు అఖండ భోగభాగ్యవిభవముల త్రిలోకముల నేలుచుండెను.

రావణుడు ఈ విధముగా త్రిలోకాధిపత్యము సేయుచుండ విభీషణుడు అన్నకు ప్రధానామాత్యు డాయెను. మందోదరి అక్షయుడు, మేఘనాధుడు అను ఇరువురు పుత్రులను తండ్రిని మించు వారిని కని, భర్తృ, పుత్రలాల నంబున, త్రిలోకభోగభాగ్యవిభవంబుల అలరారుచుండెను. రావణుడు తనకు దగినవారలగు దానవులనుగూడి అమందానందభూతుడయి రాజ్యమును పరిపాలించుచుండెను.

## నారదునితో ఇంద్రాదుల మొర

ఒక దినంబున త్రిలోక సంచారుడగు నారద మహర్షి హరినామ స్మరణ జేయుచు ఆకాశవీధిని హాయిగా వచ్చుచుండ ఇంద్రాదులు ముసుగులు ధరించి దీనవదనముల ఎదురయిరి. నారదుడు వారిని జూచి పలుకరించి, "ఏమీ దిక్పాలకులా? ఈ ముసుగు లేమి? ఈ పాదాచారమేమి? ఈ యజ్ఞాతవాసమేమి?" యని అడిగెను.

అది విని ఇంద్రుడు, రెండుచేతులు జోడించి, దీనముగా ఇట్లనియె: "నారదమునీంద్రా, మా యాపదను దాటింపగలవారు నీవుదక్క మరి యొకరు లేరు. సకల ఖేచర సంసేవితులగు మేము ఇపుడు దానవదాసుల మయితిమి. దిక్పాలకాంతలు, రావణసతి అంతఃపురమున, యూడిగము జేయుచున్నారు. పంచమహాభూతములు, రావణుని, ఆజ్ఞమేరకు సంచరించుచున్నవి. మా దురవస్థను, ఏమని చెప్పగలను. స్వర్గమా, నేడు దయా, సత్యశౌచ, విహీను లగు రాక్షసాధముల విలాస భవనముగా మారినది. రంభాదులు రాక్షస బాహావల్లరిలో బందీలయి మెలగుచున్నారు. నందన వనము, మద్యపాన కుటీర మయినది."

అది విని నారదుడు చిరునవ్వు నవ్వి, "ఏమి! మీరు త్రిలోక రక్షకు డగు శ్రీమహావిష్ణువును వేడలేదా?" అనెను. దానికి ఇంద్రాదులు అనేక పర్యాయములు ప్రార్థించితిమి. మా దీనావస్థ విన్నవించితిమి. నీకన్న దిక్కులేదని వాపోయితిమి. కాళ్ళబడితిమి. ఏమి ప్రయోజనము!

ఆ ఇందిరా నాథుడు మా దీనవదనములు కాంచలేదు. దీనాలాపములు చెవినిడ లేదు. మా దీనస్థితిని గురించి ఇంచుకైనను మనంబున చింత చెందలేదు. మా మొరకు బదులిడలేదు. తిరిగి తిరిగి విసిగి వేసారి వేప కాయలమైతిమి. " అనునంతలో దిక్పాలకాంతలును అచటకు జేరి, తమ దీనస్థితిని ఎరింగించిరి.

అంతయూ విని, నారదుండు ఇంచుకాలోచించి వారల జూచి ఇట్లనియె: "అయ్యలారా! అమ్మలారా! ఎంతవారికైనను కర్మ ననుభవింపక తప్పదు. కాలము వక్రగతి గలది. విపరీతకాల మాసన్నమయినపుడు ఎంతవారలైనను ఏమీ చేయజాలరు. శచ్యాదికులకాంతలకు పరదాస్యమా? కాలవిపరీతము; అమ్మా ఇంద్రాణీ! స్వాహామతల్లీ మీ రందరుబోయి శ్రీమహాలక్ష్మికి మీ దీనస్థితి వివరింపుడు. ఆ మహాతల్లి తలంచిన గాని మీ యాపదలు దీరవు. రావణుని రాక విన్నంతనే వైకుంఠపురము వదలి తరులపొదల దాగిన విష్ణువు మిమ్ము గాపాడుననుట కల్ల. మహాలక్ష్మిని ప్రార్థించిన, ఆమె మనసు కరిగి దయదల్చిన మీ యాపదలు దీరగలవు. రావణసంహారము జరుగ గలదు. అంతకన్న వేరు దారిలే"దని చెప్పి, నారదుడు తనదారినబోయెను.

## శచ్యాదులు లక్ష్మివద్దకు వచ్చుట

శచ్యాదులు నారదోపదేశమున అందరును గుమిగూడి శ్రీమహాలక్ష్మి విలాసవరమున విహరించు సమయమున ఆమె దరి కేగి తమ బాధలను సవిస్తరముగ విన్నవించిరి. మహాలక్ష్మి అన్నియు విని వారల వెంటగొని మహావిష్ణు కడకువచ్చి దిక్పాలురయొక్క, వారి భార్యలయొక్క, సకలదేవతలయొక్క బాధలను వివరించి రాక్షస ఘోరకృత్యములు, రావణుని దుండగములు వినిపించెను.

అవి అన్నియూ వినిన మహావిష్ణువు, చిరునగవున బదులాడక యూరకుండెను. అపుడు లక్ష్మి పలుసారులు తన భర్తకు దేవతారక్షణను

గురించి, ఇంద్రాదుల దుస్థితి గురించి, చెప్పి చెప్పి, ఆయన మారుబలుక కుండిన విసిగి దిక్పాలకాంతల జూచి, అప్మ "నేను చెరబడియయినను మీ చెరచాపెదవని" వాగ్దానము జేసెను. అదివిని దిక్పాలకాంతలానందమున బోయిరి.

శ్రీ మహావిష్ణువు లక్ష్మిదరిజేరి "ఏమి లక్ష్మి ఈ సాహసము. పరుల కొరకు నీవు చెరబడెదవా?" అనెను. అపుడు లక్ష్మి కనులెఱ్ఱజేసి, "స్వామీ ఆత్మబంధువులగు ఆ ఖండలాదులను, తమరు రక్షింపకున్న వారికి దిక్కెవరు? ఇంద్రాణి దానవపత్ని పాదములకు పారాణి వ్రాయుటయా? ఇది మీకు ధర్మమని తోచినదా? ముక్కోటి దేవతలను ముక్కుపట మూకజేసి మూడు లోకముల నేకచ్ఛత్రాధిపత్యముగా రావణు డేలుట మీరు వినలేదా? పరులను బరిమార్చి ఆత్మీయుల నాదరించుట మీ కవసరగార్యము గాదా?" అని వాదింపు సమయమున, నారదుడట వచ్చి లోకపాలకులను ప్రార్థించి వారి అనుమతిని, దేవతల దీనస్థితిని, రాక్షసుల దుండగములు సర్వము విన్నవించి, సకలదానవ నిర్మూలనకు దారి వెదకమనెను.

అపుడు మహావిష్ణువు కొంతసేపు ఆలోచించి రావణుడు అఖండ పరాక్రమ సంపన్నుడు. ఆదియునుగాక పరమేశ్వర ప్రధానభక్తుడు. నిత్యము మూడువేళల పార్వతీ పరమేశ్వర సహితమగు కైలాసమును వామహస్తములనుంచి సప్తసాగరముల అభిషేకించి, అనన్య సామాన్య ప్రపత్తులతో వారిని పూజించుచుండెను. అతని శక్తి అమేయము." అనెను.

అది విని నారదుడు "మహానుభావా, మీరు సకల చరాచర సృష్టి స్థితి లయముల కాధారభూతులు. మీ సంకల్పమున సకల ప్రపంచము, సమసి పోగలదు. మీరే ఈ విధమునాడిన మా బోంట్ల గతి ఏమి?" అనినంత, మహావిష్ణువు గరుత్మంతుని పిలిచి. బ్రహ్మాశాది సకల ఖేచర బృందంబును బిలువ మని ఆజ్ఞ నిచ్చెను. మహావిష్ణు వాజ్ఞానుసారము గరుత్మంతుడు బ్రహ్మాదుల నందరినీ రావించి సభ ఏర్పాటు గావించెను. ఆ సభకు పార్వతీ, పరమేశ్వరులు తప్ప అందరు వచ్చిరి.

## బ్రహ్మాదులు రావణ సంహారమునకు ఆలోచన

ముక్కోటి దేవతలు బ్రహ్మపురఃస్సరముగా వచ్చి సభ గూర్చుండిరి. యక్షకిన్నర, కింపురుష, గరుడ, గంధర్వాదులు, కుబేర పురస్సరంబుగా సభదీర్చిరి. ఆ సమయంబున ఇంద్రాణి మొదలగు దిక్పాలకాంతలు మహాలక్ష్మి ఆదేశమున అర్హస్థానమలంకరించి యుండిరి. అపుడు మహావిష్ణువు నారదపురస్సముగా సభ కరుదెంచెను. ఆ సమయంబున ఖేచరులు, దేవతలు, మహావిష్ణునకు జయజయ ధ్వానముల గావించిరి. జేజేల నడుమ మహావిష్ణువు అర్హాసన మలంకరించి యుండగా నారదుడు రావణుని ప్రతాపాదులను రాక్షసుల ఘోరకృత్యములను వరుసగా వివరింపగా అందరూ ఏకకంఠమున రావణ సంహార మెట్లు సలుపవలయునా యను యభిప్రాయమును వెలువరించిరి.

అపుడు, బ్రహ్మ లేచి నిలబడి రావణునకు దాను వరము లొసగు నపుడు "నరవానరులు దప్ప మిగిలిన ఎవ్వరిచేతను మరణము లేకుండ వర మొసగితి" ననగా, పై నుండి పూలవానలు కురిసెను. సురదుందుభులు మ్రోగినవి. అపుడు నారదుడు విపంచి సారించి "మహానుభావా, లక్ష్మి సనాథా, వైకుంఠవాసా, తమరిక నరరూపమున అవతరింపక తప్పదు" అనెను. అపు డాదిశేషుడు శంఖచక్రములు మేము మహావిష్ణువుతో పాటు భూలోకమున పుట్టగలమనిరి. అంత ఇంద్రాదులు, వగైరా అందరూ నరవానర రూపమున భూలోకమున అవతరించి రావణసంహారము సేయవలయునని నిశ్చయించిరి. శంఖము మోగినది. అంత సభాసదులందరు శ్రీమహావిష్ణువు శంఖారావము వినినంతనే నరవానర రూపములు ధరింపగలమని శపథము జేసిరి.

లక్ష్మి మాత్రము తాను అయోనిజగానే అవతరింతు ననెను. అంత శ్రీమహావిష్ణు వసుమతిని, శ్రీమహాలక్ష్మిని, గరుత్మంతుడు బంగారు

పంచనములో నుంచి విరజా నదిలో యొదలెను. అందరు వారి వారి మందిరములకేగి మహావిష్ణు శంఖారావమున కెదురుజూచుచుండిరి.

## రావణుడు దుష్టులను, లంకనుండి వెడలుగొట్టుట

రావణుడు ధర్మబద్ధముగా రాజ్యమును బాలింపుచుండెను. ఆ సమయమున లంకలో అందరు ఆబాలవృద్ధులు ప్రతినిత్యము తమ తమ విధులను నిర్వర్తింపుచుండిరి. అనేకమంది మహర్షులు లంకాపట్న సౌందర్యమును జూడ గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. లంకా నగరమున ఏ వేళ జూచినను ఒకవంక వేదపారాయణ, మరియొకవంక యజ్ఞయాగ ఘోష, వేరొకవంక శాస్త్రపాండితీ వాదములు, ఇంకొకవంక సంగీత నాట్యాది సరసకళా వినోదములతో లంకానగరము పాంథజనులకు కనువిందు గొలుపుచుండెను.

"ఆ సమయమున లంకలో రావణుని సోదరి యగు శూర్పణఖ, తాటకి, మరి కొంతమంది కాంతలు తమ కామరూపములచేత వచ్చు పాంథులను మోసగించుచుండిరి. ఆ సంగతి విభీషణుడు ఎరింగి రావణునకు దెలుప రావణుడు వారలనందరిని పిలిచి తనవారని, పరవారని దలంపక ధర్మమార్గము దప్పినవారల నందరిని, ఆచారవిహీనులను, కర్మబాహ్యులను దేశభ్రష్టులుగా జేయుమని ఆజ్ఞనొసంగ రావణానుమతిని విభీషణుడు ఖర దూషణాదులను దేశబహిష్కృతుల గావించెను.

అపుడు వారందరు గంగా గోదావరి మధ్యను గల అరణ్యముల నాక్రమించి నివసించుచుండిరి. అట్లు లంకానగరము నుండి వెడలగొట్టబడిన రాక్షసులందరు దండకారణ్యమున గల మహర్షుల దపోచర్యలకు విఘాతములు సలుపుచు అనేక దురాగతముల సలుపుచుండ, అచ్చటి మునిజనంబులు ఆరణ్యము వదలి చిత్రకూటాది పర్వతములచెంత జేరి రాక్షస బాధా భయ మనస్కులయి దైవచింతన జేయుచు కాలము గడుపుచుండిరి.

# దశరథ మహారాజు కౌసల్యా పరిణయము

పరశురాముని క్షత్రియ నాశకర్మవలన సుక్షత్రియ కుటుంబములు అంతరించ, మిగిలిన కుటుంబములవారు రహస్యముగా అజ్ఞాతవాసములో నుండిరి. అట్లుండ యిక్ష్వాకువంశ పౌరోహితు డగు వశిష్టుడు అజ మహారాజు చనిపోయిన వెనుక అతని కుమారుడగు దశరథుని తన యాశ్రమమునకు గొనిపోయి, రహస్యముగా బెంచి ఆతనికి సకల విద్యలూ నేర్పి, అతడు నవయౌవనుడయిన పిదప, యొకదినంబున దన మంత్రశక్తిచే, నొక యశ్వమును గల్పించి, వశిష్టుడు దశరథుని బిలిచి, "నాయనా దశరథా, నీ వీ యశ్వముపై నెక్కి, నానావిధ నదీ, నద, కానన, పర్వత, పరివేష్టితం బగు, ఈ భూమండలంబు నంతను దిరిగిరమ్మని చెప్పిపంపెను.

దశరథుడు ఆ యశ్వము నెక్కి మందర, కైలాసాది పర్వతములు ప్రదక్షిణముచేసి, గంగా యమునా మొదలగు నానా నదులను దాటి, భూమండలంబంతయు, నలుబది దినంబులు దిరిగి దిరిగి చివరకు కోసల సామ్రాజ్య రాజధానియగు, అయోధ్య జేరి అందు కోసలరాజకుమారి విలాస వనమగు, యుద్యానవనమున నీరు గ్రోలి; చంద్రకాంత వేదికపయి పరుండెను. రాజపుత్రి బరిచారికలు జూచి అతని రూపలక్షణాదులను రాకుమారి కెరిగింప రాకుమారి, తన సౌధంబు నుండియే అతనిని జూచి మోహించి ఆతనిచుట్టు అభేద్యమగు, బాణవెల్లి గూర్చెను.

దశరథుడు, మేల్కాంచి లేచి తన చుట్టునున్న అంపవెల్లి నొంప ప్రయత్నించి దాని నొంపలేక దాను బయటకు వచ్చుటకు దారి గానక ఆలోననే క్రుంగుచుండెను. తన బాహుబల మంతయు వ్యర్థము అయిన కారణంబున దశరథుడు చిన్నబోయి బందీ యయితినే యని విచారపడుచుండ, కోసలరాజు ఈ వృత్తాంతమంతయు దాసీలవలన విని, మంత్రి సహితముగా వచ్చి తానును ఆ దుర్భేద్య శరవల్లిని ఛేదింపలేక ఆలోచింపుచుండెను. ఆ సమయంబున రాకుమారి దన తండ్రికి దాసివలన కబురు బంప

తండ్రి తన యంతఃపురంబునకు రాగా, తన యానతి లేకయే, నిర్భయముగా తన యుద్యానవనమున బ్రవేశించినందులకు కోపగించి దానే యా అంపవెల్లి నల్లితిననెను. అదివిని రాజు తన కుమార్తె ప్రతాపమున కానందించి ఆతనిని విడువమనిన, కౌసల్య అతనిని శిక్షింపక విడువరాదు. ఆత డెవడో, ఈ పురమున కేల వచ్చెనో యను విషయము లన్నియు ఆమూలాగ్రముగా విచారింపవలయునని పలుకి, రాజు, మంత్రి పురోహితుల నాతని వద్దకు బంప వారికి దశరధుడు తాను వశిష్ట శిష్యుడననియు, ఆ మహాముని ఆజ్ఞ మేరకు అఖండ భూవలయం బంతయు జుట్టి, గోదావరీ తీరప్రాంతమున గల వశిష్టాశ్రమమునకు బోవుచు బందీనైతి ననెను. మంత్రి ఆ సంగతి మహారాజునకు దెలుప, రాజు శీఘ్రముగా వశిష్ట మహర్షిని దీసుకురమ్మని జెప్పి, దూతను బంపెను. తన కుమార్తెను బుజ్జగించి, దశరధుని విడిపించి రాజాంతఃపురమున నుంచి గౌరవించుచుండెను.

అట్లుండ వశిష్టుడు వచ్చి కోసల రాజు చేయు సపర్యల నంది విషయ మెరింగి ఈ దశరధుడు ఇక్ష్వాకు వంశ సంభూతుడు. ఈతని తండ్రి అజుడు. తాత రఘుమహారాజు. ముత్తాత దిలీప మహారాజు. వీరి వంశమునకు రఘు వంశము అను ప్రశస్థి లోకవిదితము. అజ మహారాజు భార్యా వియోగమున పరలోకగతుడు కాగా పరశురాముని ప్రతాపానికి రాజలోక మెల్లయు భస్మ మగు సమయమున, ఇక్ష్వాకు వంశము నిలుప నేను ఇతనిని గొనిపోయి నా భార్య సహకారంబున, పెంచి పెద్ద గావించి, సకల విద్యాపారంగతుని జేసితి ననెను. అది వినిన కోసలరాజు దశరథుడు తన కుమార్తెకు తగిన వరుడని తలచి, కౌసల్యను దశరధుని కిచ్చి వివాహము గావించి. అల్లుని. కూతురిని వశిష్టానుమతిని, తన మందిరమందే యుంచుకొనెను.

## నారదుడు పరశురామునకు దశరథుని సంగతి జెప్పుట

దశరథ మహారాజునకు, కోసలరాజు పుత్రికకు వివాహము జరిగిన దని, దశరధుని అంద చందముల గురించి, పరాక్రమాదుల గురించి, లోక

మున ప్రచారము బాగుగా జరుగుచుండెను. ఆ సమయంబున, నారదు డొక నాడు పరశురాముని ఆశ్రమమునకు బోయెను. తన యాశ్రమమునకు వచ్చిన నారద మహర్షిని పరశురాముడు గౌరవించి, లోకమునగల విశేషము లడుగుచు, తనవలన నిర్మూలింపబడిన రాజలోకము ఎక్కడయినను తిరిగి, మొలకెత్తినదా యనెను.

అది విని నారదుడు, ఫక్కున నవ్వి, "నీ కంటికి గనుపించి నిన్నెదిరించిన రాజులను మాత్రమే నీవు జంపితివి గాని ఈ లోకమున నీ కనుమరుగున గల, రాజ కుటుంబము లెన్నియో గలవు. ఇక్ష్వాకు వంశ తిలకుడగు, అజ మహారాజు పుత్రుడు దశరథుడు వశిష్టునిచే గాపాడబడి, ఇపుడు కోసల సామ్రాజ్య రాజపుత్రికను, కళ్యాణమాడి, అయోధ్యా నగరంబున అఖండ భోగ విభవంబుల తులతూగుచున్నా" డనెను.

అది విని పరశురాముడు, ఔరా వశిష్టా. సాటి బ్రాహ్మణుడవయిన నీవు, నాకు విరోధులయిన రాజులను గాపాడి పెద్దగావించి రక్షించితివా! ఇపుడే వానిని హతమార్చెదనని, పల్కి గొడ్డలి జేత ధరించి, ప్రతాప క్రోధ రూపుడై బయలుదేరెను. అట్లు వచ్చు పరశురాముని ఆగమనమును చారుల వలన వినిన, కోసలరాజు భయపడి, రహస్యముగా దాగికొనియెను. కౌసల్య దశరథునకు ఆడవేషము వేసి, తన యంతఃపురమున దాచెను. పరశురాముడు వచ్చి, సౌధమునంతను గాలించి, ఆడవేషమున నున్న దశరథుని కనుగొని వధింపజాలక తిరిగి వెళ్ళిపోయెను. అంతట కౌసల్య తన భర్తకు ఈ ఆడ వేషమే అత్యంత ఆనందముగా నున్నదని తలచి, ఆడవేషంబున దశరథుని యంతఃపురమున, నుంచుకొనెను. దశరథుడు, పరశురాము భయమున, చేత గాజుల దీయక చీర ధరించి, కాలియందెలు. ముక్కున బులాకీల ధరించి, మెలగుచుండెను.

ఇట్లుండ నొకనాడు దశార్ణరాజు కూతురగు సుమిత్ర పూర్వ మొకప్పుడు కౌసల్యతో గలిసి వామదేవుని వద్ద విద్య నభ్యసించెను. విద్యాకాలమున కౌసల్య, సుమిత్ర శరీరములు వేరుగా నున్నను, ఆత్మ లొకటిగా సంచ

రించెడివారు. వా రిరువురు, విద్యాభ్యాస మయిన వెనుక పెద్దవారలై, అంతః పురముల నుండిరి

ఇట్లుండ నొకనాడు సుమిత్ర, తన స్నేహితురాలికి వివాహమైనదనిన వార్త విని, ఆశ్చర్యబడి కౌసల్య భర్తను జూచు కోరిక అయోధ్యకు వచ్చెను. చిరకాల స్నేహభావమున, కౌసల్య సుమిత్రను గౌరవించి, లాలించి, దన యంతఃపురమున నివసింపజేసెను. ఒకనాడు సుమిత్ర కౌసల్య నేకాంతమున ఇట్లడిగెను. చెలీ, నీకు వివాహ మయినదని, చక్కని రాజ చంద్రుని గూడితివని వింటిని. ఏడీ ఆ రాజచంద్రుడని అడిగెను. అది విని కౌసల్య తన భర్త ఆడరూపమున ఉన్నాడనిన ఏమి యగునో యని దలంపున, తన స్నేహితురాలితో నాకు వివాహము కాలేదు. పరశురాముని ప్రతాపాగ్నికి, రాజ లోకము భస్మముకాగా రాజచంద్రుడు, నాకెట్లు దొరుకు నని చెప్పెను. సుమిత్ర నిజమని తలంచెను. ఏలనన కౌసల్య రేలు బవలు అంతఃపురముననే గదా యుండినది. ఇందుండు వారలందరు ఆడవారే గదా, యని లోకాపవాద మబద్ధమని దలచియుండెను.

ఇట్లుండ నొకనాడు, కౌసల్య ఋతుమతియై. అంతఃపుర ప్రాంగణ మున, మరియొక గదిలో యుండెను. దశరధుడు ఆడవేషమున అంతఃపుర హంసతూలికా తల్పమున పరుండియుండ, సుమిత్ర అర్ధరాత్రమున అతనిని స్త్రీగా దలచి ప్రక్కచేరెను. దశరథుడు తన పత్నియే యని దలచి, ఆమెతో శృంగారలీల సలుప, చివరభాగమున ఒకరి నొకరు జూచుకొని మనమున సిగ్గుజెంది యుండిరి. ఈ విషయము కర్ణాకర్ణిగా కౌసల్యకు దెలిసెను. కాని, కౌసల్య దశరథుడు రూపరి యున్నాడనిన ఏమి ముప్పుగలుగునో యను భయమున తన స్నేహితురాలగు సుమిత్రతో రాజీపడి, వారిరువురును దశ రథునకు భార్యలుగా నుండుటకు సమ్మతించి రహస్యము బయలుపడకుండ ప్రతిన సలుపుకొనిరి.

ఆ దినంబు నుండి, వారిరువురు దశరథునితో, శృంగారలీలాతరం గిణి నోలలాడుచు, ముప్పది సంవత్సరములు గడిపిరి. గాని వారిరువురిలో

పే ఒక్కరికీ సంతానము గలుగలేదు. ఇంతలో కోసలరాజు మరణింపగా, కోసల రాజ్యమునకు దశరథుడు రాజయ్యెను. దశరథుడు వశిష్ట మహామునిని రావించి, తన భోగ భాగ్యములను జూపించి, గౌరవించి ఇకనుండి వారిని దన పట్నమందుండి, తనకు పురోహితులుగా నుండగోరెను. వశిష్టు డందు లకు సమ్మతించి. భార్యా సమేతముగా, అయోధ్యా నగరంమున, ఆశ్రమము నిర్మించుకొని నివాసముండెను.

## భరద్వాజాదులు కేకయ పురమునకు వచ్చుట

దశరథునకు ముప్పది సంవత్సరములు భార్యలతో కాపురము చేసినను, ఇరువురకును సంతానము గలుగలేదు అని వశిష్టుడు ఇక్ష్వాకు వంశమును నిలుపదలచి. అనేక ప్రయాసల కోర్చి, దశరథుని పెద్ద గావించి, అనురూపవయోగుణ సంపన్నురాలగు భార్యను సమకూర్చినను, తాను దలచిన, వంశాంకురము కలుగలేదుగదా అని విచారించి, భరద్వాజాదుల రావించి, తన మనసున గల విచారమును వెల్లడించెను. అదివిని అందరునూ వశిష్టుని ఆశయము కొనియాడదగినది అనిరి.

సుక్షత్రియులు నశించి కుక్కగొడుగులవలె, నీచజాతులు విజృంభించి, లోకమునంతను అరాచకము గావించుచున్నారు. రాక్షస బాధలచే, యజ్ఞ యాగాది కర్మ లంతరించినవి. స్వార్థపరులచే, లోకమున ధర్మము నశించినది. ఈ సమయమున ఈ లోకమున ధర్మరక్షణకుగాను. యొక సుక్షత్రియ వీరుడు. గావలెను. అందులకు తగిన ప్రయత్నము జేయుటలో అందరును సహకరింపవలసినదేనని, ఆ మునులందరు, ఏకగ్రీవముగా నిర్ణయించుకొనిరి. ఆ సమయమున వామదేవుడను ముని లేచి కేకయ రాజపుత్రి, స్వరూప స్వభావ సంపత్తి గలది సకల విద్యా విశారద, శౌర్య, ధైర్యసారనిధి. ఆ కన్యను దశరథునకు వివాహము గావించిన, ఆమె వలన మీ కోరికదీరి యిక్ష్వాకువంశ వృద్ధియును, పరశురాముని చేత సమూలముగా నిర్మూలింపబడిన క్షత్రియ వంశకీర్తియు, పునరుద్ధరింపబడగలవని చెప్పి,

ఏ విధంబునైనను కేకయ రాజపుత్రిని దశరథునకు పరిణయము సేయ ప్రయత్నము చేయమనియెను.

అది విని మునులందరు యిది మంచి యాలోచన యని దలంచి యీ విషయము దశరథుని కెరిగించి, దశరథుని అనుమతిని కేకయ రాజ పురమునకు బోయిరి. కేకయరాజు మహామునులు, తన మందిరమునకు వచ్చుచున్నారను వార్త విని ఎదురేతెంచి. వారిని యథాక్రమంబున గౌర వించి, అర్ఘ్యాసనంబుల కూర్చుండజేసి, తన కుమార్తె యగు కైకను బిలిచి అమ్మా మహర్షుల ఆశీర్వాదమమోఘము, వారి పాదములకు నమస్కరించి ఆశీర్వాద మందుమని చెప్పెను. కైక వినయము రూపము ధరించినటుల శృంగార కళ రూపమందినటుల హంసగమనంబున వచ్చి, మహర్షుల పాదములంటి నమస్కరింప, వారు శీఘ్రమే కళ్యాణప్రాప్తిరస్తు, దిగ్విజయ మస్తు, అనంతకీర్తి ప్రసాద సిద్ధిరస్తు అని దీవించిరి. తరువాత కైక లోనికేగెను.

కేకయ మహారాజు మునుల రాకకు కారణమేమని యడుగ, భర ద్వాజానుమతిని, అత్రి, కైకను దశరథున కిచ్చి వివాహము గావించిన ఇక్ష్వాకు వంశము నిలుచును. కైకకు బుట్టిన పుత్రుడు లోకపాలకుడయి, ధర్మము నుద్ధరింపగలడు. గావున. కైకను దశరథునికిచ్చి, వివాహము సేయమనెను. అది వినిన కేకయరాజు, ఆజ్యముపోసిన అగ్నివలె మండిపడి, మానాభిమానములు వదలి, ఆడదానివలె గాజులు ధరించి, అంతఃపురమున నున్న మూడుకాళ్ళ ముసలివాడగు దశరథునకు, నా కుమార్తె నిచ్చుటన ధర్మమా? అందునను వయసున ముసలివాడు. లోగడ ఇరువురు భార్యలు గలవాడు, ఇంద్రియపుష్టి నశించి జీవకళ లంతరించి, ముసలితన మావిర్భ వించి, ముడతలు శరీరమున ముప్పిరి గొనియున్న రాజాధమునకు, సర్వ కళా విలాసిని, నవయౌవనాంగి యయిన నా కుమార్తె నిత్తునా? ఇది యధర్మము, అన్యాయము. మీ రందరు మహర్షి రూపమున నా కుమార్తె జీవితము నాశన మొనరింప వచ్చిన, మహామారి రూపులు. పొండు, నా

మందిరమును విడచి పొందని, శోక గద్గద క్రోధావేశ కంఠనాదంబున, యుచ్చైస్స్వరమున, దిక్కులు ప్రతిధ్వనింప కేక వేసెను. అది విని అంతః పురకాంతలు మనసున దిగులందిరి. పరిజనులు తల్లడిల్లిరి. మహర్షులు, మౌనముద్రాంకితులయి యూరకుండిరి. అంత కేకయరాజు లోనికిపోయెను.

## కైక తాను దశరథుని వివాహ మాడెద ననుట

కైక మెల్ల మెల్లన తన తండ్రియొద్దకు బోయి, మృదుమధురా లాపనంబున నిట్లనియె. నాయనా, నాదొక మనవి. నీవు ఆక్రోశము వీడి, ఆలకింతునని దెల్పెదననెను. అది విని కేకయరాజు కుమార్తె తల నిమిరి, ముద్దాడి, అమ్మా నీవు చెప్పబోవునది నాకు తెలియును. నిన్నా ముదుసలి కిత్తుననియా నీ యభిప్రాయము. నా ప్రాణముండగా నీకిష్టములేని పనిని నేను జేయను. నీవు కోరిన వరునికే నిన్నిచ్చి వివాహము గావింతును ఇది ముమ్మాటికి సత్యము అని అనియెను. అది విని కైక, నాయనా మహర్షులు అమోఘ తపస్సంపన్నులని, నీవు దెలిపితివి గదా. వారి వచనములు యథార్థములని, వారి సంకల్పములకు, వికల్పములు గలుగవని, నీవు వచించితివి గదా! ఇపుడు భరద్వాజాదులు, నా వలన ఇక్ష్వాకు వంశ ముద్ధరింపబడగలదని, పరశురామునిచేత సమూలముగా నిర్మూలింపబడిన క్షత్రియ ప్రతాప జ్యోతి, నా మూలమున పునరుద్ధరింపబడగలదని, నాకు పుట్టిన పుత్రుడే పుడమి నేలగలడని పల్కిరి గదా? వారి వాక్యము లసత్యము లగునా! అదియునుగాక, మన గురువులగు, శతానందులు, నేను జగ త్కీర్తిని పొందగలనని, యుగయుగంబుల నా చరిత్ర కావ్య నాట, కాఖ్యాన, కాఖ్యాయికంబుల ప్రతిధ్వనింపగలదని. చెప్పెనుగదా! అట్లుండ సకులీనుడగు, దశరథ చక్రవర్తి వయోవృద్ధుడయిననేమి. నే నాయననే వివాహ మాడెదను, అని కైక తండ్రితో ఘంటాపదముగా పలికెను.

అపుడు కేకయరాజు చేయునది లేక మహర్షుల ఎదుటకు వచ్చి యిట్లనియెను; ఓ మహామునులారా! మీరు మహా తపోధనులు. మీ కోరిక

అత్యంతాదరణీయమైనది. కాని నా పుత్రిక ముక్కుపచ్చలారని ముగ్ధ. దశరథుడుత్తమవంశ సంజాతుడైనను, వయోవృద్ధుడు. అదియునుగాక ఇద్దరు భార్యలకు భర్త. నా పుత్రిక అతనికి మూడవ భార్య కాగలదు. కావున ఈ వయసున అతనికి నా కుమార్తె నిచ్చుటకు నాకంత అభిరుచి లేక పోయినను, మీ యానతి మేరకు పుత్రిక నీయ సంకల్పించితిని. కావున మీరు నా మనవి సావధానముగా చిత్తగించ ప్రార్థన. నా కొమార్తెకు జన్మించిన వాడే ఇక్ష్వాకు సామ్రాజ్య పాలకుడు గావలెను. అట్టి అధికార పత్రమును నాకు వ్రాసి యిచ్చి, నా కుమార్తెను మహారాజునకు వివాహము గావింపు డనెను.

అందులకు మునులు సంతసించి సరేయని, దశరథ చక్రవర్తిని పిలిపించి, బంగారు రేకుపై ఒక శాసన పత్రమున "కైకకు జన్మించినవాడే యిక్ష్వాకు రాజ్యపాలకుడు కాగల"దని వ్రాయించి ఇచ్చి, దానిపై భరద్వాజ, అత్రి, భృగు, వసిష్ఠ, వామదేవ, వాత్సల్య, అగస్త్యు లను ఏడుగురు సాక్షి సంతకములను గావించి, ఆ శాసనమును కేకయరాజునకు ఇచ్చి, మంచి ముహూర్తమున దశరథునకు, కైకేయికి వివాహము గావించిరి. అంత దశరథుడు కైకేయిని అయోధ్యానగరమునకు గొనివచ్చి సుఖంబున నుండు నంత యొకనాడు శంబరు డను వాడు లోగడ కైకేయి సౌందర్యాతిశయంబులు విని ఆమెను వివాహ మాడ వలయునను దలంపున కేకయరాజునకు వర్తమాన మంపెను. కేకయరాజు అఖండ బలపరాక్రముడు, అనేకాక్షౌహిణీ సేనా సమన్వితు డగు శంబరుడు నీచజాతి సంభవునిగా దలంచి, అతనికి తన కుమార్తె నీయ నిష్టము లేక స్వయంవరము చాటింతును అపుడు రమ్మని వర్తమాన మంపెను. కైకేయీస్వయంవరాహ్వానమున కువ్విళ్ళూరు శంబరుడు కైకను దశరథుడు వివాహమాడెనను మాట విని, అగ్గిబడిన గుగ్గిలము వలె మండిపడి కేకయుని, దశరథుని — ఇద్దరినీ హతమార్చి, కైకేయిని తన అర్ధాంగిగా జేసుకొను దలంపున అనేక రథ, గజ,

వాజి సేనా పరివృతుడయి వచ్చి, అయోధ్యా పురమునకు వెలుపల నిలిచి, దశరథునకు ఈ విధముగా వర్తమాన మంపెను.

"ఓరీ! ముసలిరాజా! ఇపుడు నీవు వివాహమాడిన నీ ముద్దుల మూడవ పెండ్లామును నాకిచ్చి దండమిడి, స్నేహమందెదవా లేక మరణము గోరి రణమొనరింతువా" యని కబురంపెను.

అది విని దశరథుడు భయపడి, తన మంత్రులను, సేనాపతులను రావించి కార్యాచరణము నిర్ణయింప గోరెను. అప్పుడు మంత్రియగు సుమంత్రుడు యిట్లనియె.

మహారాజా! శంబరుడు మహా బలశాలి. భూమి మీద గల వారి నందరిని జయించి పుళింద, మ్లేచ్ఛ, పారశీక, యవన, బర్బర, తురుష్క, వృందుల సేనల సమకూర్చుకొని భూలోక యింద్రుడని పేరుగాంచినవాడు. అనేక అక్షౌహిణీ సేనా సమన్వితుడు. ఆతనితో యుద్ధము అంత మంచిది గాదు. కేకయ రాజపుత్రిక నిచ్చుటయూ అవమానహేతువు. కావున ఏదో విధముగా అతనితో రాజీ బడి ప్రస్తుతము శాంతి వహించుట మంచిది అనెను.

అది విని వాలఖిల్యులు జైమినిని ఇట్లు ప్రశ్నించిరి:

మహామునీంద్రా! ఈ శంబరు డెవరు? ఈతని కింత శక్తి గలుగుటకు కారణ మేమి? వివరింపుడని అడిగిరి.

అది విని జైమిని మహర్షి శంబరుని చరిత్ర ఆద్యంతము వినిపించెద సావధానులు గండని యిట్లు చెప్పదొడంగె.

## శంబర వృత్తాంతము

పూర్వమొకప్పుడు మణికంఠుడను గంధర్వుడు నారదుని సంగీత మున నోడింపవలెనని దలంచి కుబేరసభను రెండుసారులు ప్రతిఘటించి ఓటమిజెంది, ద్విగుణీకృత రోషావేశపరుడయి సంగీత సాధన జేయ సంక ల్పించి, ఏకాంత ప్రదేశమును వెదకి, అనేక ఫలభరితంబులగు వృక్షములను

నానావిధ కుసుమ నిచయంబు లగు యుద్యాన వనంబుల నలరారు ప్రదేశమును జూచి అచ్చట గోదావరీ తరంగ శీకర సించిత ప్రదేశంబున గూర్చుండి సామగాన సాధన జేయుచుండెను. ఆ సమయంబున రావణుని చేత లంకనుండి వెడలగొట్టబడిన తాటకి యను రక్కసి సంగీతమును విని, ధ్వని ననుసరించి వచ్చి, మణికంఠుని జూచి అతని సౌందర్యమునకు సమ్మోహితయయి యెట్లైనను అతని సమాగమ సౌఖ్య మనుభవింప దలచి, కామరూపము నంది, జగన్మోహనాకారంబున అతని నెదుట సంగీతమునకు దగినట్లు నాట్యము సేయ ప్రారంభించెను. మణికంఠుడు తన గీతమునకు దగిన నాట్యము సమకూరినదిగదా యని దలంచి, నాట్యగానములను కుబేరసభలో ప్రదర్శించి, నారదు నోడింపవలెనను దలంపున జగన్మోహిని యగు యా కాంతను దరికి జేర్చి, ఊరు పేరు లడిగిన, ఆ సుందరి కన్నీరు, మున్నీరుగా దుఃఖించి మణికంఠుని పాదముల దన నవపల్లవ సుకుమార సుందరములగు హస్తములుంచి "స్వామీ, నా దొక విషాద గాథ. దయయుంచి ఆ గాథ నన్నడుగ వలదు. అది దలంపునకు వచ్చిన నా హృదయము బ్రద్దలయి నాకు ప్రాణాపాయము వాటిల్లగల ద"నెను.

అది విని, గంధర్వుడు సరే అడుగనని ఆమెను తన నివాసమున జేర్చి యిరువురు సంగీత నాట్య విలసనంబులు సలుపుచుండిరి. యిట్లుండ నొక దినంబున నా మాయాసుందరి మదన తాపర్తితో మణికంఠునిచేరి మన సిజ లీలా తరంగిణి నోలలాడి, సద్యోగర్భంబున పుత్రు గనియెను.

ఆ సమయంబున మాయామోహినికి దన నిజరూపము రాగా, గంధర్వు డా రూపము జూచి, ఔరా! ఎంత మోసగత్తెవు. ఉత్తమ కుల సంజాతనని నన్ను నమ్మించి, నా వద్ద విద్య గ్రహించితివి. నిన్ను నిర్మూలింతునని శపించుటకు చేత జలము ధరించునంత ఆ కాంత పిల్లవానిని గంధర్వుని పాదముల నుంచి "స్వామీ! ఈ బిడ్డడు మీ ప్రతిరూపము. ఈ పసికందుని జూచి యైనను నన్ను క్షమించండి" అని ప్రార్థింప, గంధర్వుడు

నీకు కామరూపము లేకుండు గాక! యని శపించగా, తాటకి దుఃఖించుచూ వెడలిపోయెను.

గంధర్వుడు తన మహిమచే నతనిని నిత్యయౌవనుని గావించి, అఖండ బల సమన్వితుడవై రాజ్యమేలుకొమ్మని జెప్పి, ఎప్పుడైననూ ఆడదానితో పోరాడిన నీకు మృత్యువు సంప్రాప్తము కాగలదని చెప్పి పంపెను.

అంతట ఈ శంబరుడు ఆటవికుల సంఘమును అంద జేసుకొని, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, పారశీక, యవన, బర్బర, పుళింద, మ్లేచ్ఛ రాజ్యములు జయించి వారిని సామంతులుగా చేసికొని, సింధునదీ ప్రాంతము నంతయూ ఏకచ్ఛత్రాధి పత్యముగా ఏలుచుండెనన విని, వాలఖిల్యు లానందించి, తరువాత వృత్తాంతము దెలుపమనిన, జైమిని సావధానముగా నిట్లు జెప్పదొడంగె.

## శంబర వధ

శంబర సేనలను జూచి దశరథుడు భయము జెంది, అతనికి పదివేల గజంబులను, నూరువేల హయంబులను అరణ యర్పింప నిర్ణయించుకొని, తన ముగ్గురు భార్యలతో గలసి రథంబున బోయి, అనంత కాంచన మణి రత్నాభరణంబులు, గజంబుల, హయంబుల నాతనికి సమర్పింప దలచి, కౌసల్యా, సుమిత్రల రథంబున నిడుకొని కైకేయీ సౌధంబునకు బోయి, విషయ మెరింగింప, కైక తోక త్రొక్కిన త్రాచువలె లేచి, బుసలు కొట్టుచు ఇట్లనియె.

"ఓ పిచ్చిరాజా! నీ వయసుతో పాటు సాహస, ధైర్య, శౌర్యంబు లంతరించినవా ఏమి? శత్రువునకు దడిసి అరణ మిత్తువా? యిక్ష్వాకు కుల సంభూతుడవు. అనంత విక్రమ పరాక్రమ సంపన్నుడగు రఘుమహారాజు మనుమడవు. ఒక అనామకునకు దడిసి అరణము లర్పించి, అతని పాద పీఠిన దలమోపుదువా? ఎంత నీచకార్యము, "యశోవా మృత్యుర్వా" యని

శత్రు నెదిరించి విజయమో, వీరస్వర్గమో అందవలయును గాని, అరణము లర్పించి, అడుగులకు మ్రొక్కుట అధముల లక్షణము అనెను.

అది విని దశరథుడు కైకను అనునయ వాక్యంబుల మెల్లమెల్లగా నూరార్చి, దేవీ! అతడనంతసేనా పరివృతుడు, అఖండ బలపరాక్రమ సమన్వితుడు. అతనిని జయించుట అమరేంద్రునికైనను అలవిగాని పని. అనవసరముగా అహంకరించి ఆపదలో మునుగుట అంత మంచిది గాదు. నామాట వినుమని గడ్డముపై చేయి వైచిన కైక రాజుచేతిని దూరముగా త్రోసి, కౌసల్యా, సుమిత్రల నొకకంట, రాజును వేరొక కంట జూచుచు యిట్లనియె.

మహారాజా! భర్త కీర్తి కాపాడుట భార్య కర్తవ్యము. కావున, నేను శత్రువు నెదిరింప సిద్ధముగా నున్నాను. కావున మీరు సేనలను సిద్ధపరుపుడని పల్కి, తన ఇష్టదైవమగు పార్వతీదేవిని దలంచి ప్రార్థింప అక్షయతూణీరము, ధనువు వచ్చినవి.

అప్పుడు కైక దాను పుట్టినింటి నుండి దెచ్చుకొనిన రథంబును సరి జేయమని సారథికి నియమించి కవచంబు ధరించి, ధనువు, అంబుల పొది చేత బట్టి, రథ మధిరోహించి శంఖము పూరించెను. ఆ ధ్వని ప్రళయకాల భేరీ నినాదంబు వలె శత్రువుల గుండె లవియ జేసెను.

అంత కైక తన సేనలను వ్యూహము పన్ని, తాను సేనానియై రణము ప్రారంభింప, శంబరుడు ఆహా! ఆడదాని యుద్ధమా యని దలంచి శంఖ మూదెను. కైక ఆ శంఖమునకు ప్రతిశంఖము నూది దన రథంబును శత్రుసేనల మీదకు ద్రోలించి, బాణ పరంపరల శత్రుసేనల ముంచెను. అపుడు ఆకాశ చారులు, "ఆహా, ఏమి ఈమె ప్రతాపము, ఈమె ప్రళయ కాల సంజనిత మారియా" యని యాశ్చర్యపడసాగిరి.

దశరథుడును విల్లు ధరించి, యుద్ధముసేయ, శంబరుడు శూలము ప్రయోగించి, దశరథుని మూర్ఛ మునుంగ జేసెను. అపుడు దశరథసేనలు దిగులొంది నలుదిక్కుల పరుగిడగా, కైక రాజును గుడారమునకు గొని పొమ్మని ఆజ్ఞ యిడి, రౌద్రమూర్తియై తాను శత్రుమూకలను కసిమసంగెను.

శంబర సేనలు చాలవరకు నశించినవి. అంత శంబరుడు, సేనామధ్యంబున నిలచి దిక్కుదెలియక పరుగిడు వీరులను బిలచి యిట్లనియె.

అడదని దలంపక శూలంబుల గొట్టుడను మాట కైక విని, ఘోరాతి ఘోర సాయకంబుల శంబర మూకలను చెండుచుండెను. ఈ విధంబుగా శంబర సేనలకు, కైకకు ఇరువది ఏడు రోజులు అహోరాత్రములు ఘోర యుద్ధము జరిగెను. యిరువది ఏడవ రోజున శంబరుని సేనలు అన్నియును సమసిన కారణంబున, చావగా మిగిలినవారు శంబరుని దరిజేరి, ఇట్లు పల్కిరి:

మహారాజా! ఇరువది ఏ డక్షౌహిణుల సేన అంతమొందినది. దశరథుని సేనలో నూరవవంతు గూడా నశింపలేదు. ప్రళయ కాళికా రూపిణియై మన సేనలను కైక దునుమాడుచున్నది. ఆమె ప్రతాపము ఎన్నడూ కని విని ఎరుంగము. అనునంతలో కైక తన రథంబును వారలపైకి దోలించి, ఇరువది మంది సేనానులను క్షణములో జంపి శంబరుని ఎదుటకేగి, శంబరుని రథ అశ్వముల జంపి, సారధిని గూల్చి, రథంబును నుగ్గుగావించెను. అంత శంబరుడు రథము దిగి గజము నధిరోహించి శూలము బట్టి విసర కైక ఆ శూలమును మధ్యలో దునుమాడి, యొక బాణంబున గజమును హత మార్చి, శూలముతో శంబరుని పక్షమున గొట్టెను. అపుడు శంబరుడు క్రిందబడి లేచి నిలువబడి దీనాననుడై ఇట్లనియె:

"ఓ కేకయ రాజపుత్రీ! నీ ప్రతాపము అనన్య సామాన్యము. నే నిపుడు వాహన హీనుడను, ఆయుధము లేనివాడను" అనునంతలో కైక గంభీరస్వరమున "ఓరీ, శంబరా! నీకేమి కావలయునో గోరుము ఇచ్చెద" నన, శంబరుడు పిగ్గుజెంది, గదాయుద్ధమునకు రమ్మన మనెను. అపుడు కైక రథము దిగి గదబూని, శంబరుని ఎదిరించి, తొలిదెబ్బనే అతని తల పగులనేయ శంబరుడు మృతిజెందెను. శంబరుడు చావగా మిగిలిన సేనలు పరుగులిడినవి. కైకపై పూలవాన గురిసినది. సురదుందుభులు మ్రోగినవి. ఆ ధ్వనికి దశరథ చక్రవర్తి మేల్కాంచి, రణరంగ వివరములు వారుల

వలన విని, కైక అవక్రవిక్రమ ప్రతాప సంరంభముల కచ్చెరువొందెను. కైక శంబరుని వెన్నెముక భటునిచే లాగించి, దానిని వెలిగించి, ఎన్నడో ఆరిన క్షత్రియ ప్రతాప జ్యోతిని ఈనాడు తిరిగి వెలిగించితినని శంఖ మూదెను. మిగిలిన సేనానులు శంబర సేనలోని జచ్చినవారి వెన్నెముకలు దీసి వెలిగించి బారులు దీరి రాగా, ఆ దినము దీపావళి యాయెను. కైక ఆ జ్యోతుల నడుమ మంగళవాద్యములతో దశరథుని దగ్గరకు రాగా, దశ రథుడు సంభ్రమానందాశ్చర్య మానసుడై కైకను ఆలింగనము జేసికొనెను. కైక నందరును పొగడిరి. కైక ప్రతాపము సూర్యకాంతివలె లోకము నంతనూ వ్యాపించెను.

## కైక వద్దకు మహర్షులు వచ్చుట

కైక వలన శంబరుడు హతుడయిన సంగతి దిక్కులయందు ప్రతి ధ్వనింప, కైక ప్రతాపాదులను రాజులందరూ ఎరింగి, అయోధ్యా నగరము నకు జేరి, కైక అనుమతిని దశరథుని సార్వభౌమత్వము నంగీకరించి కప్పములు చెల్లించిరి. భరద్వాజాది మహర్షులు వచ్చి తమ ఆశయము నెర వేరు కాలము ఆసన్నమయినదని సంతసించి కేకయరాజపుత్రిని అనేక ఆశీషంబుల నానందపరిచిరి. కేకయరాజు తన కుమార్తె ప్రతాపమును విని, తన కుమారునితోనహా వచ్చి దశరథున కనేక రత్నముల నరణముగా నిచ్చి కైకేయిని ఆశీర్వదించెను. ఆ సమయంబున సకల సామంత పౌర జానపద బృందములు కొలువుదీర్చియుండగా కేకయరాజపుత్రి భరద్వాజ పాదారవిందములకు నమస్కరించి యిట్లనియె.

మహామునులారా! మాకు సంతానము కలుగు ఉపాయము యాన తిందన, మహర్షుల యానతిని వామదేవుడు లేచి పుత్రకామేష్టి యాగ మాచ రించిన సంతానభాగ్యము లభింపగలదని, దానిని నిష్టానియమ విధానమున నలుబది దినములు సలుపవలయునని చెప్పి, దాని విధానము నంతయూ దెల్పెను.

అది విని కేకయ రాజపుత్రి సుముహూర్తమున యాగమాచరింప నిశ్చయించి, దానికి బ్రహ్మలుగా అవధూతలుగా యాజ్ఞికులుగా మహర్షుల నియమించి, యాగసందర్శనమున కొచ్చువారి నాదరించుటకు తన సోదరుడగు యుధాజిత్తుని నియమించి, తాను తన సపత్నులతో మహారాజు సహితముగా యాగదీక్ష నవలంబించెను.

ఇది అంతయూ వినిన వాలఖిల్యులు ఆనందపడి తరువాత వృత్తము ఆనతిండనిన జైమిని యిట్లు జెప్ప ప్రారంభించెను:

## నారదుడు మహావిష్ణువునకు అవతార విషయ మెరిగించుట

నారదమహర్షి శ్రీవైకుంఠము జేరి శ్రీమన్నారాయణమూర్తిని అనేక విధముల ప్రార్థించి శ్రీవారి కృపాపాత్రుడయి వినయముగా అవతార సమయ మాసన్నమయినదని చెప్ప, మహావిష్ణువు లక్ష్మి అవతారమును గూర్చి ఆలోచించి తాను శేషుడు శంఖచక్రములు దశరథపుత్రులుగా జనింప నిశ్చయించెను.

ఇది అంతయూ ఎరింగిన నారదుడు ఈ దేవరహస్యమును గడుపులో దాయజాలక, బయట దెలిసిన ఏమి జరుగునో యను భయంబున ఒక మహారణ్య మధ్యమున కేగి యొక పుట్టలో యిదియంతయూ పలికెను. ఆ పుట్టలో తపమాచరించు నిషాదుడు దానిని విని రామాయణముగా వ్రాసెను.

## రామావతారము

కేకయ రాజపుత్రి యాగము సేయుచుండ, సలుబది దినములు నిర్విఘ్నముగా పూర్తియాయెను. చివరి దినమున అగ్నికుండముననుండి యజ్ఞ పురుషుడు యొక పాయస భాండమును జేతబట్టి, ప్రత్యక్షమయి, ఆ భాండమును దశరథున కిచ్చెను. దశరథుడు వసిష్ఠానుమతిని ఆ పాయస భాండమును కైక కీయగా, కైక ఆ భాండమును రెండు చేతుల ధరించి పగుల

జేయ సగమున కొక చెక్క వంతున రెండుచెక్కలాయెను. అపుడు కైక ఒక భాగము కౌసల్య కిచ్చెను. అపుడు సుమిత్ర దీనవదనయై కైకను జూడగా, కైక తనచేత గల అర్ధభాగములో సగము సుమిత్ర కిచ్చి మిగిలినది తాను భుజించెను. కౌసల్యయును సుమిత్రకు సగమిచ్చి మిగిలిన సగము తాను భుజించెను—యాగము బూర్తియాయెను. వచ్చిన అతిధులు గౌరవముల నంది వారి వారి యిండ్లకు బోయిరి. మహర్షులు మహారాజు నాశీర్వదించి వారి వారి యాశ్రమముల కరగిరి. కొలది దినములు గడువ, సుముహూర్తమున కౌసల్యకు, కైకేయికి ఒక్కొక్క పుత్రుడును, సుమిత్ర కిరువురు పుత్రులును ఉదయించిరి. దశరధు డపుడు వసిష్ఠుని రావించి బాలకులకు యథావిధిని జాతకకర్మలు పూర్తిగావించి, కౌసల్య సుతునకు రాముడనియును, కైకేయి సుతునకు భరతుడనియు, సుమిత్ర పుత్రులకు లక్ష్మణ, శత్రుఘ్న లనియును నామకరణముల గావించిరి. దశరధ చక్రవర్తి ఆ నలుగురు బిడ్డలను జూచుచూ ఆనందముగా కాలము గడుపుచుండెను.

ఇంతలో కేకయరాజు వచ్చి తన మనుమడగు భరతుని, అతనితో సహా శత్రుఘ్నుని తన రాజ్యమునకు గొనిపోయి తన ఇంట అల్లారుముద్దుగా బెంచుచూ భరత శత్రుఘ్ను లిరువురును ధనుర్విద్యలో, సంగీత సరస కళలలో, వేద వేదాంగ పాండితిలో ప్రౌఢు లయిరి. అయోధ్యలో రామలక్ష్మణు లట్లే పదునాల్గు సంవత్సరముల ప్రాయముననే సకలవిద్యావిశారదులైరి. కైక రామునియందు మహాప్రేమాతిశయమున తన పుత్రుని గూడా తలపకుండెను. ఈ విధంబుగా దశరధ చక్రవర్తి కైక అనురాగము వలన, రామలక్ష్మణుల బాల్యక్రీడలవలన అనవరతానంద భరితుడై కాలమును గడుపుచుండెను.

## సీతాదేవి అవతరణ

మిథిలానాథుడగు జనకుడు యాగము సేయ సంకల్పించి, యాగభూమిని దున్నుచుండగా ఆ నాగటి చాలులో యొక బంగారు మందసము

కనుపించెను. జనకు డా మందసము నీవల దీయించి, శుభ్రపరచి జూడ అం దొక బాలిక అగుపడెను. జనకు డా బాలికను జూచి ఆశ్చర్యమంది ఆ బాలికను పేటిక నుండి ఈవలకు దీయ, ఆబాలిక సర్వాభరణ భూషితమయి పదునారు కళలు నిండిన చంద్రునివలె పదునారు వర్షముల ప్రాయము గల దాయెను. జనకు డా బాలికను తన మందిరమునకు గొనిపోయి, ఆ బాలికకు సీత యని నామకరణము గావించెను. సీతయును అందరికీ అల్లారు ముద్దుగా దిరుగుచు తన యాటపాటలతో అందరినీ ఆనందసంద్రమున నోల లాడించు చుండెను. ఇట్లుండ, నొకనాడు సీత తన యీడువారలతో కందుక క్రీడ సలుపుచుండ ఆ బంతి అనేక సంవత్సరముల నుండి జనకునిచేత బూజింప బడుచున్న శివధనువు గల మందసము క్రిందకు బోయెను.

అపుడు సీత బంతియాట నందుండు యుత్సాహమువలన ఆ మందస మును ఎడమచేత నెత్తి, దానిక్రిందబడిన బంతిని దీసెను. అది దూరమున నుండి జనకుడు జూచి, "ఆహా, ఏమి ఆశ్చర్యము. అనేక శతభట నివహముల కెత్తరాని మందసము నవలీల నెడమచేత నెత్తిన ఈ కాంత సామాన్యురాలు గాదు; లక్ష్మియో లేక గిరిజయో కాక జగన్మాత యగు ఆది శక్తియో గాకున్న ఈ మందసము నెత్త సాధ్యమా!" యని దలంచి, ఆ శివధనువు నెక్కుడువానికిగాని ఈ కన్య నీయగూడదని నిశ్చయించెను.

ఈ విధముగా జానకి జనకు నింట పెరుగుచుండెను. జనకుడు తన పురోహితుడగు శతానందుని యనుమతిని ఇట్లు ప్రచురించెను. "నా చే నిరం తరము పూజింపబడిన శివచాపమును ఎవ్వ రెక్కుపెడుదురో వానికి నాకు అయోనిజగా లభించి, నా యింట పెరుగుచున్న జానకి నిచ్చి వివాహము గావించెద అని ప్రచురించెను. ఈ ప్రచురణను విని అనేకమంది వీరాధి వీరులగు రాజపుత్రులు వచ్చి శివచాపము నెత్తజాలక సిగ్గుజెంది పోవు చుండిరి. అనినంతనే వాలఖిల్యులు జైమినిని జూచి మహాకవీంద్రా, సీత భూమిలో లభించినది. శివచాప మెట్లు లభించినది? అస లా చాప మేమిటి? శివునకు ఆయుధము త్రిశూలము గదా? చాప మెక్కడిది? ఆ విషయము

సవిస్తరముగా దెలుపు మనిరి. అది విని జైమిని సావధానులై వినుడని ఇట్లు చెప్ప ప్రారంభించెను.

## శివ చాప కథ

పూర్వము త్రిపురాసుర సంహార సమయమున దేవత లందరు కలసి తమ తమ శక్తు లనేకము గావించి వేదములను చక్రములుగను, భూమిని రథముగను, పంచమహాభూతములను అశ్వములుగను, శివుని రథికునిగను, మేరువు ధనువుగను నిర్మించిరి. అపుడు శ్రీమహావిష్ణువు బాణయయి త్రిపురాసురులను సంహరించెను. త్రిపురాసుర సంహారము బూర్తియయిన పిదప సకల దేవ, దానవ, యక్ష, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుషాదులు సభ గావించి, పరమేశ్వరునకు సానుభూతి దెల్పి, ఆయనవలన లోకములు రక్షింపబడినవి. ఆయన లేకున్న లోకములు త్రిపురాసురుల వలన హతమయి యుండెడివని శివుని పొగడిరి.

అది విని పార్వతి ఆ సభయందు అందరు విన నా భర్తయే లేకున్న మీకు గతులు లేవు. తారకాసురుడు విజృంభించి, లోకములను గగ్గోలు జేయునపుడు అందరినీ గాపాడిన వీరుడు సాంబశివుడు. ఇపుడు త్రిపురాసురులను హతమార్చినవాడు పరమశివుడు. సంద్రమున హాలాహలము జనించి లోకములను భస్మముసేయువేళ దానిని నిర్భయముగా మ్రింగి, లోకములను గాపాడినవాడు నా భర్త. సుఖమును, ఆనందమును అనుభవించునది ఇతరులు. ఆపదల యందు ఆదుకొని కాపాడునది మేమని గంభీరోపన్యాసము నొసంగెను.

అది వినిన సకల సభాసదులు పార్వతిని, పరమేశ్వరుని అనేక విధముల శ్లాఘించిరి. పార్వతీ పరమేశ్వరుల మీద పూలవానలు గురిసెను. ఆ సభయం దొక్కరును శ్రీమహావిష్ణువును గాని, ఆదిలక్ష్మినిగాని దలంచినవారు లేరు. అదియంతయు జూచిన లక్ష్మికి మనసున ఆవేదన గలిగి, ఇంటికి వచ్చిన పిదప తన భర్త దరిజేరి, రోషావేషపూరితయయి ఇట్లనియె:

స్వామీ! వైకుంఠవాసా! ఈనాడు మీ సోదరీమణి పార్వతి యిచ్చిన యుపన్యాసమును వింటిరి గదా! వేదముల నపహరించి, పాతాళమున దాగిన రాక్షసుని సంహరించినది శివుడా? దేవతలను గాపాడదలచి సముద్రమును మధించి అందు ఉద్భవించిన యమృతమును రాక్షసుల కందజేయక దేవతలకు బంచియిచ్చినది సాంబుడా? సకల దేవతా నివహంబును గాపాడదలంచి మంధర పర్వతమును గవ్వముగాజేసి సంద్రమును మధించునపుడు మంధరమును మునుగకుండ రక్షించినది శంకరుడా? సకల దేవతలు వారి వారి శక్తులను ధారపోసి నామమాత్రముగా రథికుని జేసినంత మాత్రమున శివుడంత గొప్పవాడాయెనా? ఆ సభలో పార్వతి మాటలు విని, మీరేల యూరకుంటిరి? అని యడుగ మహావిష్ణువు లక్ష్మిని సమయానుకూలముగా నూరార్చి, శివపార్వతుల గర్వప్రలాపము లణచవలెనని దలంపున శివుని బిలిచి త్రిపురాసుర విజయమునకు గౌరవము సలిపి, ఎల్ల దేవతలు విన నిట్లనియె:

'శంకరా? నీ కఖండ విజయము సమకూర్చిన ధనువును కైలాసమున భద్రపరుపుమయ్యా'యన శివుడు తన నౌకరి యగు నందిని బిలిచి, ఆ ధనువును గొనిరమ్మని ఆనతీయ, నంది బోయి ఆ ధనువు నెత్తజాలక సిగ్గున దలవంచి మరలి వచ్చి శివునితో తన అశక్తతను వెల్లడించెను. తరువాత నంది మొదలుగాగల ప్రమథులందరూ బోయి, ఆ ధనువును గదల్పజాలక తిరిగి వచ్చిరి. చివరకు పార్వతీ పరమేశ్వరులు బోయి, ఆ ధనువును కదల్పలేకపోయిరి. అపుడు శివుడు సిగ్గుచెంది నారాయణుని వద్దకు వచ్చి తలవంచి చేతులు జోడించి మహానుభావా! నారాయణా, ఏమి ఈ విపరీతము. ఎడమచేత నవలీలగా బట్టి, అనేక శతసహస్ర రాక్షస నివహమును సంహరించిన ధనువు ఈనాడు కదలకుండినది. కారణమేమని యడిగిన నారాయణుడు ఫక్కున నవ్వి అఖండ విక్రమ సంపన్నుడవు, అఖిలలోక రక్షకుడవు ఆ సంగతి నీకే దెలియవలెను. అసమర్థతతో అత్తవారింట ఆలికి దాస్యమాచరించుచు జీవయాత్ర గడుపు నా కేమి తెలియును? అనిన రుద్రుడు

నారాయణుని పాదములబడి క్షమింప వేడి. అట్టి మహాధనువు నీవే గొని వచ్చి భద్రపరుప మనిన, నారాయణుడు అవసరమగునపుడు ఆ ధనువును జేతబట్టెదను అని గరుడుని బంపి ఆ ధనువును ఒక మందసమున భద్ర పరిపించెను. ఆ మందసము త్రేతాయుగ సంధికాలమున మిథిలానాధుడగు జనకుడు నదీ ప్రవాహమున వచ్చి తన భూమిని బడి గనుపింప దానిని దెప్పించి, తన యింట నుంచి పూజింపుచుండెను. దానికి గల నారి వాసుకి యగుటవలన ఆ ధనువు నెవరు ఎత్తబోయినను ఆ పాము కాటువేయ, తమ శక్తియుడిగి నిర్వీర్యులయి బోవుచుండిరి. జనకుడు ఆ ధనువును ఎక్కిడిన వానికే సీత నిత్తునన, కన్యా పరిణయ వాంఛ కనేకు లరుదెంచి, శక్తి చాలక తిరిగి పోవుచుండిరి.

## విశ్వామిత్రుడు రామలక్ష్మణులను గోరుట

ఒకనాడు తపస్సంపన్నుడగు గాధి పుత్రుడగు విశ్వామిత్రుడు సత్ర యాగము సేయదలచి, తన యాగమును గాపాడ సమర్థు లెవరు యని యోచించి, దివ్యదృష్టిని శ్రీమహావిష్ణువు దశరథుని ఇంట రామునిగా అవత రించుట ఎరింగి, కతిపయ శిష్య సహితముగా అయోధ్యా నగరమునకు వచ్చెను. విశ్వామిత్రుని రాక చారులవలన నెరిగిన దశరధుడు కైకేయీ సహితముగా ఎదురేతెంచి, మునీంద్రునకు అర్ఘ్య పూజావిధుల నాచరించి, కైకేయీ మందిరమునకు గొనివచ్చి, ఆసనమున గూర్చుండజేసి, అర్ఘ్య పాద్యాది విధుల బూజించి, రాకకు కారణ మడిగెను. విశ్వామిత్రుడు, నీ పుత్రుల-రామలక్ష్మణుల - జూడవచ్చితినన కైక వారిని బిలిపించి మునీంద్రు నకు నమస్కరింపజేసెను.

విశ్వామిత్రుడు వారిని తన చేతుల నెత్తి ముద్దాడి ఇరువురుని దన రెండు చేతుల రెండు ప్రక్కల నానించుకొని, దశరథుని జూచి ఇట్లనియె:

మహారాజా! నీ తపఃఫలము అనన్య సామాన్యము, అఖండము, అద్వితీయము. సాక్షాత్ శ్రీమన్నారాయణుని పుత్రునిగా బడిసితివి. రాముడు నారాయణాంశ సంభూతుడు. దుష్టదానవ సంహారమునకు అవతరించిన ఆది దేవుడు, అని రాముని గుణగణములను పొగడి రామలక్ష్మణులను తాను జేయు సత్రయాగ రక్షణకు బంపవలయునని గోరెను.

అది విని దశరథుడు ముక్కు పచ్చలారని ముద్దు బిడ్డలు, ధనువు పూనలేని బాలకులు, అస్త్రశస్త్ర విన్యాసము ఎరుంగని అర్భకులు. వారు మీ యాగము నెట్లు సంరక్షింపగలరు స్వామీ! కావున, నేను మీ యాగరక్షణకు అఖండ సేనా పరివృతుడనయి వత్తు ననెను.

రాజా! రాక్షస సంహారము నీవలన గాదు. కైకేయి వలన గూడ గాదు. దానికి సమర్థుడు రాముడొక్కడే. కావున, నీ రామునకు ఏ భయము లేకుండ నా తపోశక్తిచే గాపాడి కళ్యాణమూర్తిని జేసి నీకు అప్పగించెద. భయపడక నాతో బంపమనిన, దశరథుడు విలపించి బంపననిన, విశ్వామిత్రుడు కోపించి నీ వంశము నశింపజేతుననిన, కైక మునీంద్రుని బ్రతిమలాడి రామ లక్ష్మణులను విశ్వామిత్రునితో బంపెను.

విశ్వామిత్రు డా బాలకులను గొనివచ్చి గంగాతీరమున వారికి దివ్య మంత్రముల నుపదేశించి బల, అతిబల యను విద్యలను, అనేక దివ్యాస్త్రముల నుపదేశించి, మంచి ముహూర్తమున యాగదీక్ష బూని, రామలక్ష్మణులను దాని రక్షణ కేర్పరచి యాగము ప్రారంభించెను. విశ్వామిత్రుడు యాగము జేయుచుండ తాటక పుత్రులగు మారీచ, సుబాహులు అనేక దానవ సమూహములతో యాగమును ధ్వంసము చేయ రాగా, రాముడు వారిని సంహరించెను. అంత సుబాహు, మారీచులు దమ సేనలు చచ్చుట కాగ్రహించి, ఆకాశమధ్య జేరి యాగశాలలో రక్తమాంస, మస్తిష్కలను గ్రుమ్మరింప, రాముడు యాగశాల వాటికకు బాణములతో పెద్దమందిరము నిర్మించి, దానికి ఇరు ప్రక్కల రామలక్ష్మణులు గాపుండిరి. యాగము ధ్వంసము సేయవచ్చిన సుబాహుని రాముడు సంహరించి, వాని సోదరుడగు

మారీచుని సంద్రమధ్యమున బడవేసెను. యాగము సురక్షితముగా నెరవేరిన పిదప, విశ్వామిత్రుడు రాము డాచరించిన యజ్ఞరక్షణ విధుల కాశ్చర్య మంది రాముని దగ్గరకు బిలిచి, తల ముద్దిడి, రామలక్ష్మణులను కల్యాణ మూర్తుల జేయవలయునని దలంపుచుండ యజ్ఞమునకు వచ్చిన యొక మహర్షి జనకుని ప్రకటనను దెలిపెను. అది విని విశ్వామిత్రుడు శిష్య సహితముగా రామలక్ష్మణులను గొని మిథిలా నగరమునకు ప్రయాణము గట్టెను.

## రావణుడు శివధనువువద్దకు వచ్చుట

రావణుడు అఖండ భోగభాగ్య వైభవములతో లంకానగరను రాజ ధానిగా జేసికొని ముల్లోకముల నెదురులేని పరాక్రమమున ఏలుచూ, యొక నాడు భూ భ్రమణము జేయదలంచి మండోదరి మందిరంబునకు బోయెను. మండోదరి తన మనుమలకు అస్త్రవిద్యాభ్యాసము జేయించుచుండెను. అది జూచి రావణు డానందమంది మంచి యుత్సాహమున కొడుకులు కోడండ్రు పరివేష్టించియుండ పరివార జనంబులు గొలుచుచుండ మనుమలను మహా వీరులుగా జేయదలచి, వారలకు ఆయుధప్రయోగ సంహారములు. అశ్వా రోహణ. గజారోహణాదులు గరపుచున్న భార్యను జూచి పరమానంద భరితుడై రావణుఁడు ఆహా! గృహిణులకుండు లక్షణ మిది. యానంద మంది మండోదరిని జూచి, "దేవీ, నేను ఒకసారి భూ ప్రదక్షిణము జేసి వత్తును...."అని బల్కి విమానారూఢుడయి ఆకాశమార్గమున బయలుదేరి వచ్చుచుండగా మిథిలానగర ప్రాంతమున యొక శిలాఫలకమున ఒక ప్రచార పత్రము గనిపించెను. దానిని జూచి రావణుడు క్రిందకు దిగి దానిమీద యున్న యక్షరముల నిట్లు జదివెను.

"నా యింట త్రికాలములు నాచే పూజింపబడుచుండిన శివచాపమును ఎవరు ఎక్కుడుదురో వారికి నాకు యాగభూమి యందు దొరకిన సీత యను కన్య నిచ్చి వివాహము గావింతును. ఇట్లు మిథిలానాథుడు. జనకమహా

రాజు" అను అక్షరముల జదివి రావణుడు పాదచారియై జనకమహారాజు మందిరమునకు వచ్చెను.

ఆ సమయంబున ఆకాశచారులు రావణుడు జనకమహారాజు సభకు బోవుచున్నాడు. ఈత డా ధనువును అవలీల నెత్త గలడు. ఇపుడు జనకు డేమిచేయునో చూతమని గుంపులు గుంపులుగా సభామందిరము జేరి, అర్హాసనముల ఆశీనులయిరి. రావణుడు ఖేచరులను జూచి ద్విగుణీకృత ఉత్సాహమున సభాసదనమునకు రాగా, జనకు డా రావణుని రాక దూతల వలన విని, రావణునకు అర్హవిధిని పూజసల్పెను. రావణుడు ఆ పూజ నంది, అందరూ విన "నీ ఇంటగల, శివచాపమును దెప్పింపుము" అనియెను. అది వినిన జనకుడు మనంబున దిగులు జెంది, ఆహా! కాలవిపరీతము. రావణునకు సీత నిచ్చుటయా? యని మనంబున పరి పరి విధంబుల విచారించు చుండ రావణుడు కను లెఱ్ఱజేసి, జనకరాజా! శివధనువు జూపుము. దానిని నే నెక్కుడెదను అనెను. అపుడు జనకుడు చేయునదిలేక విచారగ్రస్తమానసు డయి భటుల నాదేశించి, శివచాపము దెప్పించెను. రావణుడు శివచాప మందసమును జూచి, అమితానందభరిత మానసుడయి దాని తలుపు దెరచి, తన ఎడమచేయి ధనువుపై నుంచి ఎత్తబోయెను. కాని, ఆ ధనువు కదల లేనందున వామబాహువులు పదింటిచేత ప్రయత్నించి ఎత్తజాలక తుదకు దక్షిణబాహువులు పదిని గలిపి యిరువదిబాహువులతో అతి కష్టముమీద ధనువును మందసమునుండి దీసి నిలువజేసి, నారి తగిలింప యత్నించు నంతలో, ఆ ధనువు త్రుళ్ళి రావణునిమీద బడ, రావణుడు పెద్దకేక వేసి క్రిందబడెను. ధనువు రావణుని మీద బడ, ధనువు క్రింద బడిన రావణుడు చేతులను నేల బాదుచూ, పెద్ద కేకవేయుచూ కదలలేక, మెదలలేక ప్రాణావశిష్టు డాయెను. అపుడు జనకుడు భటులను బిలచి ధనువును పైకి ఎత్తించెను. అపుడు రావణుడు మెల్లగా లేచి నిలువబడి ధనువు క్రిందబడి నలిగిన చేతులను తడుముకొనుచుండ జనకుడు సానుభూతి వచనముల నాతని నోదార్చి, అతనికి మధుపర్కములు దెచ్చి ఇమ్మని పరిచారకుల కాజ్ఞ

ఇచ్చెను. రావణుడు ధరించిన దుస్తులు ధూళి, ధూసరములు కాగా, సభా సదులందరూ హేళనగా రావణుని జూడసాగిరి. రావణుడు తనకు జరిగిన పరాభవమునకు షేదరలు ఆనందించుట ఎరింగి లోలోన కనలు చుండెను. జనకరాజు రావణుడు దుర్మార్గుడు. అదియును గాక, యిపుడు అవమాన దాహ దగ్ధుడు. ఏమి సేయునో యను దలంపున లోలోపల విచారించు చుండెను. సభాసదులందరూ ఏమి జరుగునో యని యాతురతతో జూచు చుండిరి.

## విశ్వామిత్రుడు రామలక్ష్మణులను దీసికొనివచ్చుట

ఆ సమయంబున విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంట నిడుకొని జనకమహారాజు సభావాటిక సింహద్వారము జేరి సభా మధ్యభాగంబున నున్న రావణుని జూచి, ఆవేశపూరిత మనస్కుడయి, పెద్దగా "స్వస్తి జనక మహారాజా!" యని ఆశిషము పలికెను. ఆ ధ్వనిని వినిన జనకమహారాజు త్వరిత గతిని విశ్వామిత్రుని వద్దకు వచ్చి వినయవినమ్రుతాంగుడై నమస్కరించి లోనికి దయసేయుడన. విశ్వామిత్రుడు ఇట్లనియె:

"జనకరాజా! మేము నీ రాజ సన్మానమునంద వచ్చిన వారలము గాము. నీ ఇంట గల శివచాపమును ఎక్కిడి, సీతను వివాహమాడ వచ్చిన వారము" అనెను.

అది వినిన జనకుడు ద్విగుణీకృత మనోవ్యాకులుడయి ఇట్లాలోచించెను. గాధిసుతుడు గణనకెక్కిన తపోధనుడు. అస్త్ర శస్త్ర విద్యాపారంగతుడు. అఖండ బలశాలి. ఆత్మశక్తి సంపన్నుడు. శివధనువు నవలీల నెక్కిడగలడు. కాని, ఈ ముదుసలికి, జడధారికి నవ వికసిత శిరీష కుసుమ కోమలి యగు సీత నెట్లు నీయగలను. హతవిధీ రావణుని బారినుండి బయట పడితినిగదా యనుకొంటిని. ఇపుడు తిరిగి ఈ బాధ సంప్రాప్తమయినది. కాదంటినా విశ్వామిత్రుడు ప్రళయకాల రుద్రునివలె మండిపడి శపించి సర్వమును నాశనము కావింపగలడు. ఏమి సేయుదునా యని విచారింపుచుండ,

విశ్వామిత్రుడు తిరిగి పెద్దగా, "ఏమి రాజా, నీ వాలోచించునది. శివచాపము నెక్కిడు వానికి సీతను వివాహము గావింతునని ప్రచురించితివా? లేదా? శివ ధనువు జూపమనిన ఆలోచన ఏలనయ్యా" యని గద్దించెను.

ఆ స్వరము విని జనకరాజు మందస్వరంబున ఇట్లనియె: మహా మునీంద్రా! రాజలక్షణములు రమణీయమైనవి గావని తలంచి, సాత్విక లక్షణమున సర్వేశ్వరుని దలంచి తపమాచరించు మీరు ఎన్నడో వదిలిన రాజస, తామస గుణంబుల మనసు ద్రిప్పుట నిందావహము. జీవిత మధ్యాహ్నము గడిచినది. సాయాహ్నమున జీవయాత్ర గడపు తమకు తిరిగి సంసార లంపటము సాయుజ్యమార్గావరోధ మేమో యని నా భయము అని మెల్ల మెల్లగా నన విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వి ఇట్లనియె.

ఓ జనక మహారాజా! నాకు వివాహమేలనయ్యా. నేను గోరునది కర్మానుబంధ చాప మెక్కిడి మోక్షకాంతా కరగ్రహణముగాని, శివచాప మెక్కిడి సీతా కరగ్రహణము గాదు. అదియును గాక "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే" అనునట్లు నీకు దగిన రాజవరుడే నీకు బంధువు కాగలడు, అని రామునిపై చేయిడెను.

అది జూచిన జనకునకు మనసులో మరింత ఆవేదన కలిగెను. నవ కోమల సుకుమారుడగు, ముక్కుపచ్చలారని బాలుడును అగు అర్భకుడా ధనువు నెక్కిడుట? అహా! ఆ మహామునికి వయసుతోపాటు బుద్ధి మందగించినది. మేరుమంధర సమాన బలశాలి యగు రావణుడు ఎత్తజాలక, క్రిందబడి ప్రాణావశిష్టుడై బ్రతికి బయట బడెను. ఈ అర్భకుడా చాపము నెత్తునది అని శంసయాకూలిత చిత్తుడై, ముని కెదురాడజాలక, బాలకునకు ఆపద వాటిల్లునేమో యను భయమున కింకర్తవ్యతామూఢుడయి యుండెను. విశ్వామిత్రుడు మరల, చిరునవ్వు మొగమున చిందులాడ, జనకుని హస్తమును చేతబట్టి, మెల్ల మెల్లగా మృదు మధుర భాషణముల నిట్లనియె.

మిథిలాధిపా! సంశయింపకుము. శివ చాపమును దెప్పింపు మనెను.

అపుడు జనకుడు తన కిష్టము లేకున్నను ముని యాజ్ఞ మీరజాలక, పరమేశ చాపమును దెప్పించెను. దానిని జూచి లక్ష్మణుడు సంరంభమున నుండ, విశ్వామిత్రు డది గ్రహించి లక్ష్మణుని మూపున జేయి నిడి "వత్సా! నీవూరక జూచుచుండుము" అని రాముని బోయి చాపము ఎక్కుపెట్టు మనియెను.

అపుడు రాముడు విశ్వామిత్రునకు, జనకునకు పాదము లంటి నమస్కరించి, సభాసదు లందరికీ నమస్కరించి మందసమునకు మూడు పర్యాయములు ప్రదక్షిణ మాచరించి, ధనువునకు నమస్కరించి, తన వామ హస్తమున చిరపరిచితము గలవాని విధమున నవలీల నా చాపమును పైకెత్తి క్రింద కోపు కాలిబొటన వ్రేల నొక్కి, కుడిచేతి పైకోపును వంచునంతలో ఆ ధనువు నడిమికి విరిగెను. ఆ ధ్వనికి సముద్రములు కలత బడినవి. దిక్కులు ప్రతిధ్వనించినవి. భూమ్యాకాశములు జలదరించినవి. కుల పర్వతములు ఊగులాడినవి. వాసుకి వణకెను. సభాసదులందరూ బాహ్యప్రవృత్తులు మరచిరి. రామునిపై పూలవాన కురిసినది. సుర దుందుభులు మ్రోగినవి. అంత రావణుడు భయమంది, సిగ్గుజెంది, పాదాచారియై వెనుదిరిగి చూడక పరుగు పరుగున వెడలెను. సీత మెరుపు మెరసిన రీతి సౌధాంతరంబు నుండి క్రిందకు దిగి వచ్చి రాముని మెడలో పూలమాల వైచినది. ఆ విందు జూచి విశ్వామిత్రాది మహామునులు, జనకాది మహారాజులు, గంధర్వులు, దేవతలు పరమానందమునబడి సీతారాముల దాంపత్యము లోకకళ్యాణ ప్రదీపమని వేనోళ్ళ జేజేనాందబుల రాముని ముంచి వైచిరి. తరువాత విశ్వామిత్రు ననుమతిని జనకరాజు దన పురోహితుడగు శతానందుని అయోధ్యా నగరమునకు బంపెను.

## సీతా కళ్యాణము

శతానందుడు అయోధ్య జేరెను. దశరథుడు దన ముద్దుబిడ్డలను విశ్వామిత్ర మహర్షి గొనిపోయి సుమారు అరువది దినములు గడచినవి.

ఈ అరువది దినములు దశరథునకు అరువది యుగములుగా నుండెను. కైక కును అట్లే యున్నను, చక్రవర్తి దిగులొందునన్న భయమున, దాను ధైర్యము వహించి, దన యుపచర్యల రాజు నానందబరచుచుండెను. ఈ సమయంబున, మిథిలా నగరమున నుండి ఒక బ్రాహ్మణుడు వచ్చెనని ప్రతీహారి దెలుప, కైక లోనికి తీసుకురమ్మని ఆజ్ఞ ఇచ్చెను. అంత నా ప్రతీహారి శతానందుని కైక అంతఃపురమునకు గొనిరా, కైక ఆయనను అర్ఘ్యపాద్యాది విధుల గౌరవించి, అర్ఘ్యాసనము నిచ్చి కుశలప్రశ్న లడుగ, శతానందుడు, విశ్వామిత్ర మహర్షి చెప్పిన మాటలను చెప్పి జనక మహా రాజు ఇచ్చిన లేఖను రాజున కిచ్చెను.

దశరథు డా లేఖను దన ధర్మపత్నియగు కేకయ రాజపుత్రిక కిచ్చి చదువ మనిన ఆమె యిట్లు చదివెను.

"మహారాజ రాజశ్రీ..చతురుదధి వేలా వలయిత ధరణీ సామ్రాజ్య పాలకులు, అఖండ వదాన్యులు, కోసల సామ్రాజ్యాధిపతులు, రఘువంశ దీపకులు నగు దశరథ చక్రివర్తి బావగారి పాదపద్మముల సన్నిధికి - మహా రాజా! తమ పుత్రుడు రఘురాముడు, నా ప్రతినగాంచిన విధమున శివచాపమును ఎక్కిడబోయి విరచెను. కావున సీతను రఘురాముని కీయ నిశ్చయించి ని. కావున తమరు సకల పరివార బంధు మిత్రులతో మిథిల కేతెంచి సీతారాముల కళ్యాణ మహోత్సవము నెరప ప్రార్థన. ఇట్లు, విధేయుడు, జనక మహారాజు" అని చదివెను.

అది విని దశరథుడు అమందానంద సంద్రమున నోలలాడి సుమంత్రుని, వసిష్ఠుని రావించి, కేకయరాజునకు వర్తమానమంపి, వారి నంద రినీ క్షేమముగా దీసుకురావలయునని తగు వారల నియమించి, సకల సామంత పౌర జానపదులను చతురంగ బలములతో మిథిలానగర ప్రయా ణమునకు ఊరివారినందరినీ సిద్ధపరుపుమని ఆజ్ఞ ఇచ్చెను. తరువాత వసిష్ఠుడు నియమించిన సుముహూర్తమున దశరథుడు ముగ్గురు భార్యలతో, [illegible] లతో గలపి సకల సామంత పౌర జానపద బృందంబులు

వెనువెంట రా, అఖండ భోగభాగ్యములతో, చతురంగబలములతో, మంగళ వాయిద్యంబులతో కతిపయ ప్రయాణంబుల మిథిల జేరెను. తన పురము నకు వచ్చిన కోసలాధిపతులకు జనకుడు తగిన విడుదుల నేర్పరిచి, తగిన విధంబున అందరినీ గౌరవించెను. అపుడు కైకేయి అంతఃపుర జనంబుల జూచి ఆనందించి జనక మహారాజు కూతురగు ఊర్మిళను, జనకుని తమ్ము డగు కుశధ్వజుని పుత్రికలను జూచి, వారి సకల గుణంబులకు సంతసించి, దశరథుని దగ్గర జేరి కౌసల్యా సుమిత్రలు విన నిట్లనియె:

"మహారాజా! సీత రామునకు దగిన సతి. అటులనే ఊర్మిళ లక్ష్మణు నకు ఈడైన కాంత. జనకరాజ సోదర పుత్రికలు భరత, శత్రుఘ్నులకు అన్నిటా అనుంగైనవారు. విదేహ రాజులకు, ఇక్ష్వాకు రాజులకు ఆది నుండియు సంబంధము చరిత్ర ప్రసిద్ధ మనెను.

ఇంతలో జనక మహారాజు సతీసమేతముగా వచ్చి, కైక చెప్పిన విధంబుగా దశరథ మహారాజునకు విన్నవించి, విశ్వామిత్రుని రావించి, తన తమ్ముని బిలిపించి శుభముహూర్తమున సీతారాములకు, ఊర్మిళాలక్ష్మణులకు, మాండవీ భరతులకు, శృతకీర్తి శత్రుఘ్నులకు విధివిధానమున వసిష్ఠ, వామ దేవ, జాబాలి, విశ్వామిత్ర, శతానందులు వివాహము గావించిరి. జనకమహా రాజు తన అల్లుళ్లగు రామలక్ష్మణులకు ఒక్కొక్కరికి పదివేల గజంబులు, నూరువేల అశ్వంబులు. పదివేల రథంబులు, కాంచనాంబర దాసదాసీ బృందం బుల నరణ మిచ్చెను. కుశధ్వజుడు అట్లే దన అల్లుళ్లకు అరణముల నిచ్చెను. దశరథుడు నలుగురు కొడుకులు, నలుగురు కోడండ్రు, ముగ్గురు భార్యల మధ్య కూర్చుండి భూలోక ఇంద్రునివలె ప్రకాశించెను. తరువాత విశ్వా మిత్రుడు అందరినీ ఆశీర్వదించి, కైకవద్దకు బోయి "అమ్మా, కేకయ రాజ పుత్రీ! నీ పుత్రులను కళ్యాణమూర్తులను జేసి అప్పగించితి"నని చెప్పి ఆమెచే పూజలంది, శిష్యసహితముగా తన యాశ్రమంబునకు బోయెను.

దశరథుడు నాల్గు దినంబులు మిథిలా నగరమున గడిపి, సపరివార సహితముగా అయోధ్యకు పయనమాయెను. ఈ సంగతినంతయును పరశు

రాముఁడు నారదుని వలన విని, క్రోధఘూర్ణితమానసుండయి పరశువు చేత ధరించి వచ్చి,కళ్యాణమూర్తుల గొనిపోవు దశరథ వాహినుల కడ్డు నిలచెను.

అంత దశరథుడు భయసంభ్రమాక్రాంతచిత్తుడై రథముదిగి ముగ్గురు భార్యలు దన వెంటరా చేతులు జోడించి, వినయ విధేయ వివేకతా రూపుడయి పరశురాముని యొద్దకు బోయి, సాష్టాంగ నమస్కారము గావింప. పరశురాముడు ద్విగుణీకృత కోపోద్రిక్తుడయి "ఓరీ రాజాధమా! నీ నక్క వినయములు నా ముందర సాగవురా?" యని దశరథుని దల దన ఎడమకాల దన్నెను.

అంత దశరథుని తల నున్న కిరీటము క్రిందబడి నేలదొర్లెను. రాముఁడు అదిగాంచి సింహకిశోరంబుపగిది రథంబు నుండి క్రిందికి దుమికి, నేలమీదనున్న కిరీటము దీసి కనులకద్దుకొని చేతధరించి, పరశురాము నెదుర నిలఁబడి, "స్వామీ! మునిసార్వభౌమా! తమ రెరుంగని ధర్మములుగానీ, తమ రెరుగని శాస్త్రములుగానీ లేవు. తామస, రాజస ప్రవృత్తుల విసర్జించి, కేవలము సాత్వికప్రవృత్తి నవలంబించి, అడవిని దపమాచరించు మునులు మీరు. ఇక్ష్వాకుల నాటినుంటి రఘువంశ రాజుల తలమానికమయి, చతురుదధి వేలావలయిత ధరణీ సామ్రాజ్యాధిపతుల నీరాజనములందు ఈ రత్న కిరీటమును కాలదన్నుట అవివేకమగు పని."

అనినంతటనే పరశురాముడు ప్రళయకాలరుద్రునివలె గర్జించి, "ఓరీ దుర్మదాంధా! నన్నే హేళన జేయ నపకట్టితివా? నా గురువగు శంకరుని ధనువును విరచిన పాపివి. నీ కీనాటితో ఆయువు మూడినదిరా," యని గండ్రగొడ్డలి చేత నెత్తగా, రాము డా గండ్రగొడ్డలిని చేతబట్టి లాగి దూరముగా బారవైచి, మునీంద్రా, ఎంతటి ఘోరకార్య మాచరించినను బ్రాహ్మణుడు జంపదగినవాడుగాడను న్యాయమున ప్రాణముల దీయక వదలుచున్నాను. లేకున్న .... అనునంతలో పరశురాముడు దైవదత్తమగు చాపమును దలంప, అది పరశురాముని చేతికి రాగా పరశురాముడు దానినెక్కుబెట్ట బోవ, రాము డది గాంచి ఆ ధనువును లాగి విరచి దూరముగా బారవైచెను.

అంత పరశురాముడు భంగపడితిగదాయని సిగ్గుజెంది అవతారపూర్తి నెరింగి రాముని దల ముద్దిడి వెనుదిరిగి మహేంద్రపర్వతమున గల తన ఆశ్రమమునకు జేరెను. రాముని మీద పూలవానలు కురిసినవి. సురదుందుభులు మ్రోగినవి.

అంత దశరథుడు ఆనందసంభరితుడయి, అయోధ్యజేరి, సకల సామంత, పౌర, జానపదులను దగిన విధంబున గౌరవించి, కొడుకులు, కోడండ్రు దన్ను గొలువ సుఖంబుగ నుండె.

అట్లుండ కొన్ని దినంబులకు యుధాజిత్తు వచ్చి దశరథ చక్రవర్తి అనుమతిని భరత శత్రుఘ్నులను తన పురంబునకు గొనిపోయెను. రామ లక్ష్మణులు భార్యలతో అయోధ్యానగరంబున పదునాల్గు వత్సరములు అంగజ లీలా వినోదముల నందిరి. భరతశత్రుఘ్నులును కేకయపురమున తన సతులతో ఆనందమున కాలము గడుపుచుండిరి. దశరథ చక్రవర్తి ముగ్గురు భార్యలు ఋరిపముగా గొలువ ఆనందమున రాజ్యపాలనము చేయుచుండెను, అని జైమిని చెప్ప వాలఖిల్యు లానందమంది, అవమానమానసుండగు రావణు డేమి జేసెనో ఆ కథ దెలుపమన, జైమిని సరే నని ఆ తర్వాత వృత్తమును జెప్పదొడగెను.

ప్రథమకాండము సంపూర్ణము

# ద్వితీయ కాండము

## రావణ విలాపము

ఈశ్వర చాపము నెత్తజాలక అవమానపడిన రావణుండు ధూళి ధూసర శరీరుండయి మలినాంబరధారియై ఏకశిరోవధారియు, ద్విభుజమండి తుండునయి, అస్తవ్యస్తమకుటధారియై దిక్కుదెలియని పిచ్చివాని వలె పరుగు పరుగున బోవుచుండ, నారాయణనామ స్మరణ జేయుచు నారదుడు ఎదురేతెంచి, రావణుని వాలకముగాంచి, విస్మయాకులిత మానసుండయి ఇట్లనియె:

దానవ సార్వభౌమా! ఇదేమి అవతారమయ్యా! ఈ మలినాంబరంబు లేమి? శరీరమున ఈ ధూళిపటల మేమి? నానాబీభత్సములగు ఈ కాకపక్షము లేమి? ఈ అస్తవ్యస్త మకుటధారణ మేమి? బ్రహ్మదత్తములగు హస్తములు, శిరము లేడ బోయినవి? పిశాచగ్రస్తునివలె ఈ కాలి నడకను ఎటు బోవుచుంటివి? విమాన మేమయినది? అఖండ భూవలయంబును ఏకచ్ఛత్రముగా, అవక్రవిక్రమంబున బాలించు రాక్షసరాజేంద్రు డీ నాడు ఈ దీనావస్థ నుండుటకు గారణమేమి! అనన్యసామాన్య భోగవైభవ విభవ సంపన్నుడయి, అనవరత దిక్పాలక మకుటరత్న నీరాజిత పాదపీఠుడగు రావణ సార్వభౌమునకు ఈ పాదచారిత్వమా? అనెను.

అది విని రావణుడు ద్విగుణీకృత అవమాన దవానల దాహ దగ్ధ మానసుండయి దీనావలోకనంబుల నారదుని గాంచి వ్యాకులితచిత్త విభ్రమంబున మాటలు తడబడుటను జూచి, నారదుడు రావణుని దీనత్వము నెరింగి తన కమండలోదకమున కనులు కడిగించి, దాహబాధ దీరిచి తరుచ్ఛాయ విశ్రమింపజేసి ఇట్లనియె:

ఓ దానవసార్వభౌమా! సావధానచిత్తుడవై, ప్రశాంతముగా ఇక నీ వృత్తము చెప్పుము. లోకపాలకు లవమాన బరిచిరా? పార్వతీ పరమేశ్వరు లాగ్రహించిరా? మందోదరీ కాంత నిను వీడి చరించెనా? కాక అక్షయ, మేఘనాధు లేమయినా అగౌరవ పరచిరా? విభీషణుడు నిను వీడి చరించెనా? నీ యీ దీనత్వమునకు గారణము వచింపుము, అన రావణు డిట్లనియె:

నారద మునీంద్రా! నేను భూలోక పరిభ్రమణమున మిథిలానగర ప్రాంతమునకు బోయితిని. అందొక శిలాఫలకంబున "నాచే బూజింపబడు శివచాపము నెవరు ఎక్కిడుదురో వారికి నాకు అయోనిజయై లభించిన సీత నిచ్చి వివాహము గావింతు"నని వ్రాసిన ప్రచురణను జూచి, శివచాప మేమి! అయోనిజ యగు కన్య ఏమి! ఆశ్చర్యముగా నున్నదియే యని మనమున అచ్చెరువుదోప విమానంబు దిగి జనకుని నివాసమునకు బోయితిని. అచ్చట నా రాక నెరింగి సకల ఖేచర సముదాయము సభనలంకరించి యుండిరి. నేను వారలజూచి అతిశయ విక్రమ కార్యదక్షావేశమున జనకుని బిలచి శివచాపము జూప నంటిని. జనకుడు ముప్పదివేల బలిష్టులగు భటవర్గముచేత ధను ర్మందసమును దెప్పించెను. నే నా మందసము జూచి, అతిశయ ఆనందోత్సా హంబున దాని తలుపు దెరచి వామహస్తంబున ధనువును వెలికిదీయ ప్రయ త్నించి విఫలుండనై, దక్షిణ బాహువులను గలపి, మొత్తము ఇరువది బాహువుల బలముతో ఎటులో మందసమునుండి వెలికి దీసి, అతి కష్టంబున నిలువరించి ఎక్కిడునంతలో ఆ ధనువు త్రుళ్ళి నాపైబడ, నేను క్రింద బడి తిని. లేవజాలక, దాని బరువు మోయజాలక, అత్యంతనిష్ఠుర బాధా పీడితుడ నయితిని. ఆ సమయమున కరుణామూర్తి యగు జనకుడు వీరభటుల రావించి ధనువునెత్తి నా ప్రాణముల గాపాడెను. ప్రమధులు పరివేష్ఠించి యుండ పార్వతీ పరమేశ్వర సహితముగా కైలాస పర్వతమును వామ హస్తమున ధరించి, సప్తసాగరంబుల జలకమాడించిన నేను ఒక ధనువు నెత్తజాలక భంగపడుట అత్యంత శోకావహము, అవమానము గదా అనెను.

అది విని నారదుడు అయ్యో పాపము. ఎంత పని జరిగినది. మేరు, మంధర, హిమవన్నగముల నవలీల నెత్తగల రావణుడు ఒక చాపము నెత్త జాలక పోవుటయా? కాల విపరీతము, అనునంతలో రావణు డిట్లనియె:

మునీంద్రా! నే నా ధనువు నెత్తజాలకుండు టట్లుండ, పంచహస్త, పంచాంగుళప్రాయుడు, పదునారు సంవత్సరముల కుసుమకోమల శరీరుడు, అత్యల్పకాయుడు, ఆజానుబాహు డగు నరుడు ఆ ధనువు నవలీల నెత్తి, ఎక్కిడ బోవ, అంత సారవంతమగు నా చాపము పెళ్ళున అత్యల్ప గోగు గొట్టమువలె నడిమికి విరిగెను. ఆ ధ్వని నా గుండియల అశనిపాత సన్నిభ మాయెను. అంత జానకి సుందరసఖీ పరివృతయయి నానావిధ నవ వికసిత పరిమళ సుమ విరాజిత వినూత్న మాలాధారియై దనహస్తముల రాముని మెడ పూమాల, నా మెడ కాలపాశమాల వైచినది. రాముని ప్రేమానురాగ వీక్షణంబుల, నన్ను అవహేళనావలోకనంబుల, రాముని గౌరవాదరంబుల, నన్ను పరిభవావలోకనముల గాంచెను. అంత నేను ఖేచరుల మధ్య అవమానబడి ఈగతి వచ్చుచుంటిని అనెను.

అపుడు నారదుడు నీ హస్తము లేవి? శిరము లేవనిన రావణుడు శోక గద్గద భాషణంబుల "అవసరమున కుపయోగపడని బాహువులు, అవమానమున అవనతములగు శిరము లెందులకు? అవి సంకల్పమున వచ్చునవి, వికల్పమున బోవునవియు గాన నా రూపము బహిర్గతము గాకుండుటకు వాటిని ఉపసంహరించితి" నని చెప్పి, నారదమునీంద్రా! దేహబలమున రాక్షసులు, బుద్ధిబలమున దేవతలు గొప్పవారని గదా వదంతి నరులు, వానరులు ఏ బలము లేనివారు గదా. నే నెత్తజాలని ధనువును బలహీనుడగు నరు డెట్లెత్త గలిగె? నే నెత్తలేనందుకు విచారించను గాని. నా వామ బాహు ప్రమాణము లేని ఆ నరాధముడు ఆ ధనువు నవలీల నెత్తుట ఏ బలమున అంత శక్తి గలిగెనా యని నా అనుమానము మంధరాద్రివలె నా మనమును కలంచి వేయుచున్నది. రాముని కంత శక్తి ఏల కలిగెనో ఆ కథ సవిస్తరముగా చెప్పుమనిన నారదు డిట్లు చెప్పదొడంగె.

రాక్షస రాజేంద్రా! అది యొక దేవరహస్యము. ఆ రాముడు సామాన్యుడు గాదు. అతడే శ్రీ మహావిష్ణువు. నీవు ఇదివరకు వైకుంఠముపై దండు వెడలితివి గదా? అపుడు అచట ఎవరు గనుపించిరి? అనియెను.

రావణుడు ఆలోచించి స్వస్థచిత్తుడయి వైకుంఠమున ఎవ్వరూ లేరు. ఏడవ ప్రాకారమున శేషపానుపు ప్రక్క యొక కాంత నిలువబడి యుండినది. ఆమెను నేను పరకాంతాసక్తిని సరిగా చూడలేదు అనెను.

అపుడు నారదుడు చిరునవ్వు నవ్వి ఇట్లనియె. ఆమెయే జగన్మాత; శ్రీ మహాలక్ష్మి. ఆమె ఇపుడు సీతగా భూమియందు అవతరించినది. ఆమె రాగదృష్టితో రాముని,రజోదృష్టిచే నిన్ను జూచినది.కావున రామునకు ఆమెతో శృంగార లీలావినోద భాగ్యము. నీకు అఖండ విభవ వైభవ సామ్రాజ్య పాలనా భాగ్యము లభించినవి, అనినంతనే రావణుడు నారదా ఆమె పద్మజ, పరమేశులకన్న గొప్పదా? యని ప్రశ్నింప నారదుడు ఇట్లనియె.

రాక్షస సార్వభౌమా! ఆమె క్రీగంటి ప్రసారమున పద్మజ పరమేశు లయిరి. ఆమెను మించిన శక్తి లోకమున ఎవ్వరికీ లేదు. ఆమె నిర్గుణ రూపిణి అనునంతలో రావణు డిట్లనియెను:

నారద మునీంద్రా! ఈ సంగతి ఇదివర కెన్నడు ఎవ్వరూ నాకు జెప్ప కుండిరి. లోకమున పద్మజ పరమేశులే గొప్పవారని దలంచి వారిని గురించి అఖండదీక్షా తత్పరత్వమున తపమాచరించితిని మోక్ష మిప్పింపమంటిని. వారు మోక్ష మీయ మాకు శక్తి లేదు అనిరి. పోనీ మరణము లేకుండ వరమిమ్మనిన, అందులకును మే మసమర్థులమని ఏవో సుఖ ప్రీతివరముల నొసంగిరి. ఆ వరగర్వమున నే నీనాడు ఇంత పరాభవమునకు పాలయితిని. ఇక నన్ను ఇంద్రాదులు గౌరవింతురా? ఖేచరులు ఖాతరు జేతురా? మానవులు మన్నింతురా? యిక నా జన్మము, నా పరాక్రమము, నా ప్రగల్భము నిరర్థకము గదా? మునీంద్రా! నాకు ఈ యవమాన దాహ దావానలము నుండి బయట పడు నుపాయము వివరింపు మనిన, నారదుడు రావణుని దీనత్వమునకు జాలి నంది ఇట్లనియె.

ఓ రాక్షస రాజేంద్రా! నీవు మోక్షమందవలయుననిన, నిష్ఠా నియమ సంయమంబున ఆ దివ్యశక్తి నారాధించిన నీ కోరిక నెరవేరగలదు. నీకు మోక్షము రాగలదు, అనెను.

అది విని రావణుడు సీత గొప్పదనమును మనమున దలంచి ఆ జగన్మాత నే విధముగా నైన తన మందిరమునకు దేవలయునను దలంపు మనంబున గలుగ, దానిని దాచి నారదునితో ఇట్లనియె:

నారద మునీంద్రా! నేను సీతావలోకన భాగ్యము నందగలనా? ఆ దివ్యమంత్రముండిన నుపదేశింపుమన నారదుడు రావణునకు అష్టాక్షరీ దివ్య మంత్ర ముపదేశించి, రావణా! ఈ మంత్రము ప్రణవసహితమయి, మంత్ర రాజ మనబడు దివ్యమంత్రము. ఏక దీక్షాతత్పరుడవై నిష్ఠానియమ గరిష్ఠుడవై ఈ మంత్ర ముపాసించిన నీ కోరిక నెరవేరగలదని నంతనే రావణుడు ఆ దివ్యమంత్రమును నారదునివలని ఉపదేశమంది, నూట ఎనిమిది పర్యాయములు జపించి అవలోకన నంది. చరమశ్లోక సహితముగా అరణ్యమున ఏకాంతముగా జపించెదనని దోపుచుండ, నారదు డిట్లనియె:

దానన సార్వభౌమా! జితేంద్రియుడవై జపించుటకు అరణ్యమయిననూ, ఆరామమైననూ యొక్కటియే గావున, నీవు లంకా నగరమున కేగి, దివ్య సుందర మందిర ప్రాసాద యుద్యానవనమున జపింపుమనిన రావణుడు నారదవచనంబుల లంకానగరంబు జేరి, ఏకాంత సుందర మందిరోద్యానమున తపంబుసేయ ప్రారంభించెను.

అపుడు విభీషణాదులు రావణుని ఈ అకాల తపోనిష్ఠకు కారణమరియలేక పరిపరి విధముల దెలియ ప్రయత్నించి విఫలులైరి. రావణుడు కేవల వాయుభక్షకుడయి, ఏక నిష్ఠాగరిష్ఠుడయి, పద్మాసనంబున కూర్చుండి జపింప ప్రారంభించె. మందోదరి రావణునొద్ద జేరి సరస సంగీత నాట్య సత్కళావిభవంబుల ప్రదర్శించి, ఆతని దయకు పాత్రురాలు గాలేక నిరుత్సాహమున క్రుంగుచుండె. అటు లీ లోకమున అందరూ రావణుని తపోనిష్ఠకు కారణమరయ జాలకుండిరి. విభీషణాదులు అతని వద్దనే యుండి

ఆతనిని సేవించుచుండిరి, అని జైమిని నుడివినంతనే. వాలఖిల్యు లానంద మంది, మునీంద్రా! ఈ రామాయణ గాథ ఎంత విన్ననూ దనివిదీరకున్నది అని, దశరథ చక్రవర్తి అయోధ్యానగరమునకు జేరిన వెనుక ఏమి చేసెనో, రామచంద్రు డే విధంబున నుండెనో ఆ కథను వివరింపుమనిన జైమిని ఇట్లు చెప్పదొడంగె:

## కైక శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకు దశరథుని బొందరించుట

శ్రీరామచంద్రుడు సకల జన నయనానందకరుండయి ప్రజలు తన్ను గొనియాడ, సకల మునిజన బృందంబులు శ్రీరాముని గుణగణంబులను శ్లాఘింప, కవి, గాయక, నట బృందంబులు శ్రీరామచరితంబును కావ్యంబుల, ద్విపదల గానము సేయ, సకలజన నయనానందకరుడయి, సామంతరాజ సేవితుండయి, సకల ధర్మార్థ రక్షణ దీక్షాపరుండయి అన్ని విధంబుల రఘు మహారాజు కీర్తి నినుమడింపజేయు సుగుణవంతుడయి, దశరథ చక్రవర్తికి అనుంగు పుత్రుడయి, సీతామహాతల్లికి అనుగుణ భర్తయై నిరంతరము తన దివ్య లీలా వినోదంబున తల్లుల నానంద బరచుచు, పదునాల్గు వత్సరంబులు హాయిగా సీతాప్రణయ విలాసవాహిని నోలలాడెను. ఇట్లుండ నొకనాడు కేకయ రాజపుత్రి రాముని లోకాభిరాముని ప్రజాపాలనమున నిలుపదలంచి, దశరథ చక్రవర్తి ప్రజ్జేరి. విలాసవిభ్రమంబుల రాజును లాలించి, ఇట్లనియె.

మహారాజా! రాముడు వయోరూపముల, గుణగణముల, విద్యా వివేకముల సకలలోక సంస్తూయమానుడయి వెలుగొందుచున్నాడు. ఆ రాముని, సీతారాముని ఇక్ష్వాకు రాజ్యపాలనకు రాజ్య పట్టాభిషిక్తుని గావించి, వయోవృద్ధులగు మీరు విశ్రాంతినంది, రామరాజ్యపాలనంబున ప్రజ లానంద మంద, దానిని కనులార జూచి, మనసార ఆనందమందవలయునని నా కోరిక. రాముడు రవికులధీరుడు. యిక్ష్వాకువంశ కీర్తి దురంధరుడు. రఘు

కుల కీర్తి ప్రతాప శోభితుడు. వేయేల సర్వశక్తి సమన్వితుడు. సకల కళా శోభితుడు. కావున శ్రీరాముని పట్టభద్రుని గావింపు మని నంతనే దశరథుడు ఆనందమంది సుమంత్రుని బిలచి, సకల సామంత పౌర జానపద బృందంబులను, మౌని బృందారకాది సందోహంబును పిలచి, కొలువు నేర్పాటుజేయ నాజ్ఞనిడగా, సుమంత్రుడు రాజాజ్ఞానుసారము పేరోలగంబును సిద్ధపరచెను.

ఆ పేరోలగంబున సకల సామంతుల సమక్షమున కేకయ రాజపుత్రి ఇట్లనియె. సామంతులారా! దశరథ చక్రవర్తి ముదుసలి యగుటవలన, రాముడు వయోరూపగుణసమన్వితుడగుటవలన, కౌసల్యా పుత్రుడు ఇక్ష్వాకు రాజ్యపాలనకు అర్హుండని దలంచి, ఆతనిని పట్టముగట్టు అభిప్రాయమున మిమ్మందరినీ బిలచి కొలువుకూట మేర్పరచితిమి. ఏలయన, ఇది రాజధర్మము గావున, మీ అభిమతము దెలుపుడన సామంతులందరూ ముక్తకంఠంబున రాముని పాదపీఠి గొలువ సిద్ధముగా నున్నా మనిరి.

అపుడు సభాభవనంబున నగారాలు మ్రోగినవి పూలవాన గురిపినది. అపుడు దశరథుడు సకల సామంతానుమతంబున రామునకు పట్టముగట్ట నిశ్చయించి, వసిష్ఠుని బిలిచి ముహూర్తము నిశ్చయింపుమన, వసిష్ఠుడు రాముని పట్టాభిషేక నిర్ణయము అంత సులభము గాదు. దాని కనేకమగు అడ్డంకు లున్నవి. తొలుత వాటి నన్నిటినీ దీర్చి, తరువాత రామపట్టాభిషేకము సేయవలయునే గాని, ఈ నా డంత తొందరబడి నిర్ణయింప సాధ్యము గాదనినంతనే, దశరథుడు రోషావేశపూరితుండయి, ఆగ్రహము జెంది, ఆగ్రహావేశపూరితంబులగు వీక్షణంబుల వసిష్ఠుని గాంచి ఇట్లనియె:

ఓ బ్రాహ్మణాధమా! నిరంతరము మా యుప్పుపులుసులు దిని మా వలన నామరూపసంపన్నుడవగు నీవు నా కుమారునకు, దశరథమహారాజు జ్యేష్ఠపుత్రునకు, దశరథ చక్రవర్తి పట్టమహిషి యగు కోసలరాజపుత్రి గర్భ సూక్తిముక్తాఫలంబగు రామునకు పట్టముగట్ట అఖిల లోకంబులు ఆహా యన నీవు వలదందువా? పాపీ యని పలుక, వసిష్ఠుడు దశరథుని అనులో

చితమును ఎరింగి, సంధ్యావందన సమయ మను మిషతో సభనుండి వెళ్ళి పోయెను. అపుడు వామదేవు డను వానిని బిలిచి దశరథుడు ముహూర్తము నిర్ణయింపు మనిన వాడు రేపే దివ్యముగా నున్న దనెను.

ఆ మాట విని దశరథుడు రాముని కొలువుకూటమునకు బిలిపించి యిట్లనియె: రామా! రేపు నీకు ఇక్ష్వాకుసామ్రాజ్య పట్టాభిషేకముచేయ నిశ్చయింపబడినది. నీవు సీతా సహితుడవయి ఈ దినంబు వశించి మన కులదేవతల బూజింపవలయునని, సకల సామంతులను పురంబున నిలువ నియోగించి,సుమంత్రునితో పురం బలంకరింపుమని ఆజ్ఞ ఇచ్చి, కేకయపురమునకు, విదేహపురమునకు ప్రత్యేకాహ్వానము బంపుమన సుమంత్రుడు ఇట్లనియె:

మహారాజా! కేకయపురంబునకు, విదేహపురంబునకు ఆహ్వానము లందించుటకు ఒక దినము చాలదు. మూడుదినంబు లయిననూ వ్యవధి గావలెనన దశరథుడు సరే, వర్తమాన పంపుము. వారు వచ్చిననూ, రాకున్ననూ రేపు శ్రీరామ పట్టాభిషేకము జరిగితీరవలయునని సభ చాలించి అంతఃపురమునకేగెను. సుమంత్రుడు పురము నలంకరింప తగువారల నియమించి, పట్టాభిషేక మహోత్సవమునకు తగు ప్రయత్నములు సలుపుచుండె నని జైమిని చెప్పిన మును లాలకించి, తరువాత నేమి జరిగినదో చెప్పుమనిరి.

కేకయరాజపుత్రి శ్రీరాముని, సీతను తన మందిరమున సంపెంగాది పరిమళతైలంబుల జలకమాడించి, రామునికి కనకాంబరాభరణాదుల నలంకరించి, సీతను అట్లే అలంకరించి, సీతారాముల నొకచో నిలువజేసి, వారుభయుల అందచందముల దనివిదీర గాంచి, ఆహా నేను నేడు కనులు కలిగిన ఫల మందితినని ఆనందమునబడి వారిరువురను దశరథ చక్రవర్తికి నమస్కరింపజేసి, సీతారాములను కౌసల్యా మందిరమునకు బంపెను.

## అయోధ్యకు నారదుడు వచ్చుట

దశరథుడును తన యానందమును కౌసల్యా, సుమిత్రలతో కలపి అనుభవింపదలంచి వారి మందిరముల కేగెను. లక్ష్మణుడు దన యన్న

పట్టాభిషేక వార్త విని పరమానందసంభరితుడయి పురమును అలంకరించు కార్య నిమగ్నుడయి, అతిథులుగా అరుదెంచిన సామంత, పౌర, జానపదు లకును, మునిబృందారకులకును తగు విధమున విడుదులను సమకూర్చి, వారికి దగిన అన్నపానాది సౌకర్యములను గల్పించు యత్నములో నిమగ్ను డాయెను.

కౌసల్య రాముని పట్టాభిషేక వార్త విని, సీతారాములను దానే మంగళాస్నాన మాచరింపజేయు దలంపున నుండ, సీతారాములు సర్వాలం కార భూషితులయి కౌసల్యా మందిరమునకు వచ్చి కౌసల్యకు నమస్కరింప, కౌసల్య రాముని యలంకారము, సీతాసతీ శృంగారాలంకారమును జూచి ఈ యలంకారమంతయూ కేకయరాజపుత్రి స్వయముగా జేసినదను వార్త జానకి వలన విని, ఆనందవార్ధి నోలలాడి, ఆహా! సవతిబిడ్డడని తలంపక, కేకయ రాజపుత్రి జూపెడి మాతృవాత్సల్య మేమని అచ్చెరువు చెందెను. ఇంతలో దశరథుడు వచ్చి సీతారాములను దేవతారాధనకు బొమ్మనిన వారు దేవీ ఆలయమున కరిగిరి.

నారదుడు అయోధ్యాపురి అలంకారమును జూచుచు రాజవీధుల వెంట రాగా, రంగవల్లులతో, ముత్యాలతోరణంబులతో, రంగు రంగుల జ్వాలా తోరణములతో విరాజిల్లు గృహంబులును, పట్టాభిషేక మహోత్సవానంద మును దిలకింప నువ్విళ్ళూరుచూ, ఒకరిని మించిన యుత్సాహంబున చరించు జనసందోహంబును, నానావిధ గాయక గాయనీ బృందంబులను, నాట్య నాటక బృందంబులను జూచి, ఏమి ఈ వింత? అయోధ్యానగరమున ఎన్నడూ చూడని వింత వినోద వాహిని ప్రవహించుచున్నదను దలంపున మెల్ల మెల్లగా పురవీథు లధిగమించి, రాజసౌధంబులు అలరారు ప్రదేశంబు జేరి, అవి అలంకరించు పరివారమును జూచి, ఈ వింత వినోద విడ్డూరం బెరుంగ జాలక కైకేయీ అంతఃపురమునకు జేరెను. కేకయ రాజపుత్రి పరిచారికుల వలన నారదాగమనమును విని మందిరబహిఃప్రాంగణమున కరు దెంచి, మునీంద్రులకు నమస్కరించి, సగౌరవ పురస్సరంబుగా అంతఃపుర

అతిథి వినోదమందిరమునకు గొనిపోయి, ఆసనమున ఆసీనుని గావించి అర్ఘ్యపాద్యాది విధుల బూజించెను. నారద మహర్షియును అతిథి సత్కారముల నంది అమందానందసంభరితుడయి, కేకయ రాజపుత్రితో నిట్లనెను:

మహారాణీ అయోధ్యాపురమున ఏమి యుత్సవము జరుగనున్నది? పురమంతయు దివ్యాలంకార మండితమయి, పాంథజన స్వర్గమయి అందమున అమరావతిని మీరుచున్న దనెను.

అది విన్న కైక మందస్మితావలోకనముల నారదుని గాంచి, "మునీంద్రా! రేపు శ్రీరామచంద్రుని పట్టాభిషేక ముహూర్తము. తలవని తలంపుగా నిర్ణయింపబడినది" అనెను.

అది విని నారదుడు, "అమ్మా! భరతు డెచ్చట" అనెను. అపుడు కైక "భరతుడు మాతామహ గృహంబున సతీసమేతుండయి. శత్రుఘ్నుడు తోడు నిలువ, మేనమామ, మేనయత్త, తాత, ముత్తవల మురిపములాడ ముద్దుబిడ్డ యయి ముదమందుచున్నా" డనెను.

అపుడు నారదుడు కైక కనులలో కనులుంచి జూచి "అమ్మా! మహారాణీ! ఈ యుత్సవము నీ తండ్రికిని, అన్నకును తెలియునా?" యనెను.

అపుడు కేకయరాజపుత్రి కబురంపితిమి. వ్యవధి చాలనందున వర్తమాన మందునో లేదో ఊహింపలేకున్నా మనెను. అది వినిన నారదుడు దాసీల నావలకు బంపమని, కేకయరాజపుత్రికి కనుసన్నజేసి, ఏకాంతమున నిట్లనియె.

అమ్మా, కేకయ రాజపుత్రీ! ఈ క్షణంబువరకు నీ వాచరించిన వంశ ప్రవర్ధన యజ్ఞము ఈనాడు వ్యర్థమగుటకు సిద్ధముగా నున్నది. ఇది సకల క్షత్రియ భయంకర సంఘటన; రవివంశ నిర్మూలన కంకురార్పణ; అత్యంత దుర్భర దుర్నివార అపకీర్తి కార్యవిజృంభణ, ఏమందువా, నీ వివాహ సమయమున నీ తండ్రికి నీ భర్త దశరథ చక్రవర్తి వ్రాసి ఇచ్చిన బంగరు

పత్రలేఖ్యము నీకు గుర్తుండెనా? దానియందు గల విషయము నీకు జ్ఞాపక మున్నదా? ఆ విషయము నేను వివరముగా దెల్పెదను సావధానవయి విను మన, కేకయ రాజపుత్రి దాసదాసీల నావల బంపి, కవాటముల బంధించి, రక్షకుల నియమించి, ఎవ్వరినీ లోనికి రానీయవలదని ఆజ్ఞాపించి, దశరథ చక్రవర్తి వచ్చిననూ తన యనుమతి లేనిదే లోనికి రానీయవలదని చెప్పి, నారదుని ఎదుర అననమున శ్రవణాసక్తయై గూరుచుండె.

నీ తండ్రి దశరథునకు నిన్నిచ్చి వివాహము సేయునపుడు నీ కుద యించిన కుమారునకే సకల సర్వంసహా పాలనము గాగలదని, నీ కుమా రుడే ఇక్ష్వాకు కులక్రమాగతమగు సింహాసనము నధిష్ఠింపగలడనియు యొప్పించి, ఆ విషయమును బంగరు పత్రము మీద వ్రాయించుకొనెను. దాని మీద అత్రి, భరద్వాజ, వసిష్ఠ, జాబాలి, వామదేవ, గౌతమ, శతా నందులు సాక్షిసంతకములు చేసిరి. నీ తండ్రి రాజకీయ రంగమున, రణ రంగమున అఘటన ఘటనాసమర్థుడు. అనేక సేనా పరివృతుడు. నీ యన్న ఆఖండల తుల్యుడు. నీ తండ్రి భరతుడు పుట్టిన నాటనుండియు మనుమని దన మందిరముననే పెంచి పెద్దగావించి, విద్యాబుద్ధుల గరపెను. వివాహ మయిన తరువాత ఈనాటివరకును భరతుని, భార్యను తన ఇంటనే యుంచు కొని వారికి స్వర్గభోగములను సమకూర్చుచూ అతిశయానందమున కాపాడు చున్నాడు. అంతలోని పరమ రహస్యము విచారింప, ఏనాటికయిననూ పట్ట మహిషియగు కౌసల్యా పుత్రుడు ఇక్ష్వాకు రాజ్య సార్వభౌముడు కాగలడను నేమో యను సందియమున తనవద్ద గల పత్రాధారము వలన రామ పట్టాభి షేకము నివారించి, భరతుని పట్టభద్రుని జేయుటే నీ తండ్రి యుద్దేశ్యము. ఇపుడు రామ పట్టాభిషేక వార్త వినినంతనే నీ తండ్రి అగ్నిబడిన గుగ్గిలము వలె మండిపడి చతురంగ బలముల గూర్చుకొని దశరథునిపై దండు వెడలక మానడు.

తన తండ్రికి బాసటగా నీ యన్న సర్వసేనాధిపత్యమంది, సేనల నడిపి తీరును. తాతకు, మామకు బాసటగా భరతుడు రథ మధిరోహింప

గలడు. భరతునకు బాసటగా శత్రుఘ్నుడు రాగలడు. త్రేతాగ్ని తుల్య లగు యుధాజిత్తు, భరత, శత్రుఘ్నుల నెదుర దశరథునకు అలవియగునా? ఆ సమయంబున రామలక్ష్మణులు తండ్రి రక్షణకుగాను చాపాయుధ హస్తులు కాగా, అగ్ని, వాయు సమతేజులగు రామలక్ష్మణులకు, భరత శత్రుఘ్నులకు సంగరము గాక మానదు. అందు రామునిచే భరతు డంతమందిననూ లేక భరతునిచే రాము డంతమందిననూ యింతవరకూ ఇక్ష్వాకు వంశ పున రుద్ధరణకు నీవు గావించిన శంబరవధాదు లన్నియూ వ్యర్థములే యగును గదా?

కావున ఇపు డీ శ్రీరామ పట్టాభిషేకము లోకకళ్యాణమునకు గాక, లోకవినాశమునకు కారణముగాక మానదు, అనినంతనే కేకయ రాజపుత్రి కనుల నీరు గార్చుచు, శోకదవానల దంధహ్యమాన మానసాంతరయై ఏమి జేయుటకు దోచక, మంత్రబద్ధ భుజంగమువలె బుసలిడుచూ, ఆయాస బడుచూ, తాను రాజును బలవంతపరచి నిర్ణయించిన రామపట్టాభిషేకమును ఆపుట ఎట్లాయని ఆలోచన దోపక - రామపట్టాభిషేక వార్త వినిన దన దండ్రి ప్రళయకాల రుద్రునివలె రాక మానడనియును, తండ్రిని కాపాడ రామలక్ష్మణులు ధనుర్ధారులయిన, తాతను రక్షింప భరత శత్రుఘ్నులు బవ రంబు సేసిన ఆత్మజులలో అంతఃకలహము అధికమయి, లోక వినాశము నకు కారణము కాగలదు. దీనికంతకూ కేకయరాజపుత్రియే కారణమని లోకులు నన్ను నిందింపక మానరు. ఏమి సేయుదునా యని తోచక నారదుని దిక్కు తిరిగి, 'మునీంద్రా, ఈ యాపద గడుచు నుపాయము సెలవీయు' డన, నారద మునీంద్రుడు ఆలోచించి ఇట్లనియె:

"ఈ అభిషేక సంబరముల భరతునకు పట్టము గట్టి, రాముని అడవి కనుప ఆజ్ఞ నిమ్ము" అనెను.

అది విని కైక రూక్ష స్వరమున ఏమి రాముని అడవి కనుపుటయా యని, 'హా రామా!' యని పెద్ద కేకవేసి మూర్ఛాగతయై ఆసనము నుండి

క్రింద బడెను. అపుడు నారదుడు దాసీల రావించి, కైకను సేదదీరజేసి, మెల్ల మెల్లన ఇట్లనియె:

"అమ్మా కేకయ రాజపుత్రీ! లోకకళ్యాణమును గోరునపుడు చిన్న చిన్న బాధలను లెక్కచేయరాదు. ఏమనిన రఘుమహారాజు చనిన వెనుక నీ మామ అజమహారాజు శృంగార లీలా విలాసముల నెరిగి, రాజ్యమును సరిగా చూడనందున ఇక్ష్వాకురాజ్యమును ఇతరులు ఆక్రమించిరి. అదియును గాక, దండకారణ్యమున పదునాల్గువేల రాక్షసులు ఖర దూషణుల నాయకత్వమున జేరి, అందలి మునులను బాధింపుచున్నారు" అని చెప్పు సమయమున మంథర యను దాసి రహస్యముగా వచ్చి, ఒక మర్మప్రదేశమున దాగి, నారద సంభాషణము వినజొచ్చెను.

"ఆ రాక్షసులను సంహరింపవలయుననిన రాము డొక్కడే సమర్ధుడు. అదియునుగాక, మహర్షులు తా మాచరించు దపంబున ఆరవభాగము రాజునకు పన్ను రూపంబున ధారాదత్తము గావింపవలయును. కావున, మీకా మహర్షులు చాల ఋణపడి యున్నారు. ఆ పన్నులను వసూలుజేయుటకు, దుష్టదానవ సంహారమునకు, ఇతరు లాక్రమించిన రాజ్యములను దిరిగి స్వాధీనము గావించుటకు రాము నడవికి బంపిన, పదునాల్గువేల రాక్షసులే గాక, విరాధ కబంధాదులు గూడ హతులు గాగలరు. కావున ఇక్ష్వాకు వంశ గౌరవము కాపాడ రాము నడవికి బంపవలయును. ఇచట శత్రువులు రాకుండ భరతునకు రాజ్య పట్టాభిషేకము గావించి, రాజును జేసిన నీ భర్త ఆడిన మాట అబద్ధము కాదు; నీ తండ్రితో విరోధము రాదు. నీ కోరిక నెరవేరగలదు. రామునకును, లక్ష్మణునకును విశ్వామిత్రమహర్షి బల, అతిబల యను మంత్రములు ఉపదేశించినాడు. ఆ మంత్ర మహిమవల్ల రామ లక్ష్మణులకు ఆకలి దప్పు లుండవు. శీత, వాత, ఆతప బాధ లుండవు. అదియును గాక, సీత ఆదిలక్ష్మి అవతారము. ఆమె యడవిలో నివసించినను అది సకల సౌందర్య సౌభాగ్య నిలయ మారామమే అగును. కావున ఆలోచింపక రామునకు వనవాసము, భరతునకు రాజ్యపట్టము నిర్ణయించి జరి

పించి, ఇక్ష్వాకు కుల గౌరవమును కాపాడు"మని చెప్పి నారదుడు వెళ్ళి పోయెను. కైక ఆ మాటలు మనంబున తిరిగి, తిరిగి మననమందుచూ యూరకుండెను.

## కైక మందిరమునకు దశరథుని రాక

దశరథ చక్రవర్తి కేకయ రాజపుత్రి సౌధంబునకు రాగా, అచ్చటి దాసీలు చిత్రపు ప్రతిమలవలె నిలుచుండి, యొకరి మొగము నొకరు జూడ నారంభించిరి. ప్రతీహారులు ఏమి యన బదులిడకుండిరి. కైకేయీ మందిర మంతయూ నిశ్శబ్ద వాతావరణంబున దాసీజన పరివృత్తంబయిననూ నిర్జనా రణ్యమువలె నుండెను. అపుడు దశరథుడు కైక కూర్చొని యుండిన అంతఃపురమునకు బోవ, కైక చెదిరిన యలంకారముతో తన మొగము రాజునకు జూపింపక, పెడముఖంబున మందిరాంతరములకు పోజొచ్చెను. దశరథుడును కొంత దడవు వెనుమడించి, ప్రయోజనము లేక యొకచోట నిలుచుండి, దాసీజనంబుల బిలచి, 'ఏమి ఈనాడీ విపరీతము. నను జూచి ద్వారమున ఎదురు వచ్చి, ఆలింగనం బిచ్చి. అత్యంతాదరంబున అంతఃపుర హంసతూలికా దల్పమున జేర్చు నా ముద్దుల పడతి, నా భాగ్యలక్ష్మి ఈనాడు నా ముఖము జూడదు; నా మాట వినదు; నన్ను పలుకరింపదు. ఈ వైప రీత్యమునకు గారణమేమి?' యని యడిగిన. మంథర యను దాసి ఇట్లనియె.

"ఏమియు లేదు, మా మహారాణి చక్రవర్తుల మురిపముల భార్య యని ముచ్చటలు దీర్చుకొనుటయే గాని తనయందుగాని, తన పుత్రునియందు గాని ఇసుమంతయు గౌరవాదరంబుల గనబరచుట లేదను తలంపున కుమిలి కుమిలి వ్యధనందుచున్నది. అదియును గాక, శంబర వధానంతరము మహా రాజులు మా మహారాణి కిడిన రెండు వరములు యింతవర కీయలేదనియు, ఆ వరములకు గాను మొదటి వరమునకు భరత పట్టాభిషేకము, రెండవ వరమునకు పదునాల్గు సంవత్సరంబులు రామ వనవాసము గావలయునని మా మహారాణియగు కేకయ రాజపుత్రి అభిమతము. అట్లుండ, భవ్యలక్షణ లక్షి

తుండగు భరతుడుండ కౌసల్యా తనయునకు పట్టముఁగట్టుట ఆమె అంత రాత్మ దహించుచున్నది'' అనెను.

అది విని దశరథుడు తిరిగి కేకయ రాజపుత్రి దరికిబోయి, వెనుక నిలువబడి, మెల్లగా తన హస్తమును భుజముపై నుంచి—''ఓ కైకేయీ! ఈ దశరథుడు నీ దాసుడు. నీయాజ్ఞ నుల్లంఘించువాడు గాదు. నీ కోరిక దెలుపు''మన, వెనుకనుండి మంథర ''కోరి కేమున్నది, భరతునకు రాజ్య పట్టము, రామునకు వనవాసము'' అనెను. అది విని దశరథుడు, ''ఔను కైకా!'' యన, మంథర తిరిగి, 'ఔను భరతునకు రాజ్యపట్టము, రామునకు పదునాలుగేండ్లు వనవాసము' అనెను.

అది విని దశరథుడు మొదలు నరికిన అరటివలె నేలగూలెను. అది జూచి కేకయ రాజపుత్రి సంభ్రమంబున రాజునకు శీతలోపచారములు సలుప, రాజు కొంచెము సేదదీరి కైక మొగము జూచి కనుల నీరునిండ గద్గద స్వరమున ''కైకా! రాము డేమి యపకృతి జేసినాడు, రాముని కరణ్య వాసమా?'' అని తిరిగి మూర్ఛనందెను. కైక రాజు పదే పదే మూర్ఛ మునుంగుట జూచి భయవ్యాకుల చిత్తయై హంసతూలికా తల్పంబున జేర్చి, దాసీ సహితముగా ఉపచారము జేయుచుండెను.

## రాముడు దశరథుని జూడవచ్చుట

ఆ సమయంబున రాముడు తమ కులదేవతల పూజలు పూర్తి గావించి, తలిదండ్రులకు నమస్కరించు తలంపున కైక మందిరమునకు వచ్చెను. అట్లు వచ్చిన రాముని, లోకాభిరాముని జూచి కైకేయీ మందిరం బున ఒకరును పలుకరింప కుండిరి. మందిర మంతయూ నిర్జనారణ్యము వలె శోక రసాధిదేవతా గారమువలె శోభావిహీనమయి, ప్రతిశబ్ద శూన్య మయి యుండుటకు గారణ మరయజాలక రాముడు కక్ష్యల గడచి, అంత రంగిక మందిరమునకు వచ్చుసరికి, అచ్చట దశరథుడు చేతన రహితుడయి పడుండి యుండెను. ఆయన ప్రక్క అలంకార రహితయు, కనుదమ్ముల

వెంట గారు కన్నీటి ధారాకలుషితమగు గండము గలదియై, ఆనందరహిత అంతరాత్మయు, చింతాక్రాంత చిత్తమయి యున్న తన పినతల్లిని జూచి రాముడు దగ్గరకేగ, కైకలోనుండి వెల్లువికి వచ్చు దుఃఖంబు నాపజాలక కన్నీట కలుషితంబగు కనుల రాముని జూడజాలక, పయిటచెరుగున ముఖము కప్పుకొని లోలోన వెక్కి వెక్కి ఏడ్వసాగెను. రాముడు కైక పరివేదనకు కారణ మరియలేక దీనవదనుడయి, పరిపరివిధము లాలోచించియు దెలియజాలక చివరకు మెల్లన కైక దరిజేరి తన యుత్తరీయమున కనులు తుడచి, మందస్వరంబున నిట్లనియె.

"అమ్మా! నేడు నీ మందిర మంతయూ కళారహితమై యుండుటకు, నీవు విచారవదనయై కనుదమ్ముల నీరు గార్చుచూ కళావిహీనమగు కమలము వలె నీ వదన ముండుటకు గారణ మరయలే కున్నానమ్మా. అదియును గాక, నా ముఖావలోకమునకు యువ్విళ్ళూరు నా తండ్రి దశరథ చక్రవర్తి ఈ నాడు నన్ను జూడడు; నాతో మాట్లాడడు. కారణ మే"మన, ఆ మాట విని కైక మరింత శోకభరితయై లోలోన కుములుచుండ ప్రక్కనున్న దాసి మంథర రాముని కెదురు నిలచి ఇట్లనియె:

"నాయనా! శ్రీరామా! నీ తండ్రిగారి యాజ్ఞ నీవు అతిక్రమింతువో లేక పితృవాక్య పరిపాలనంబు సేతువో లేదో నను భయమున నీ తండ్రి దశరథ చక్రవర్తి శోకాక్రాంత చిత్తుడయి నీ ముఖము చూడజాలక పరుండి యున్నాడు. నీ తల్లి కైకయును ఆ సందేహముచేతనే...." అనునంతలో రాముడు గభీమని లేచి మంథర ఎదుట నిలువబడి "నా తండ్రి యానతిని నేను అతిక్రమింతునా? సూర్యచంద్రులు గతులు దప్పిన తప్పవచ్చును. సంద్రము లింకిన ఇంకవచ్చును. కులపర్వతములు కూలవచ్చును గాని నేను నా తండ్రి యానతియైన దవానలంబున దూకమన్న దూకెద; కాలకూట విషంబు ద్రావమని నా తండ్రి యానతిడిన అమృతమువలె త్రావెదను. నా తండ్రి యానతిని విరమింపు"మని పలుమారులు వాపోవ, మంథర ఒకవంక

కైకను జూచుచు, ఈ రెండవప్రక్క రామునిని, దశరథుని జూచుచు యిట్లనియె'

"నాయనా, శ్రీరామా! భరతుడు పట్టాభిషిక్తుడయి అయోధ్యా రాజ్యమును పాలించుట, నీవు జటావల్కలములు ధరించి, పదునాలుగు వత్సరంబులు వనవాస మాచరింప తండ్రిగారి యాజ్ఞ" అనినంతనే రాముడు నవ్వి, ఇందులకా ఇంత ఆవేదన అని కైకవద్ద కరిగి. "అమ్మా! తప్పక తమ్ముని రాజ్య పట్టభద్రుని గావింపుము: నేను అడవుల కేగెదను. విచారింపకమ్మా!" యని తండ్రికి ముమ్మారు ప్రదక్షిణ మాచరించు నంతలో జానకి వచ్చెను.

రాముడు సీతను జూచి, జానకీ! నేను తండ్రి యానతిని అడవుల కేగుచున్నాను. అనునంతలో సీత నేనును మీతో వత్తు ననునంతలో మంధర వల్కలముల దెచ్చి ఇచ్చెను. సీత నారచీర ధరింప అంతర్మందిరమున కరుగ. మంధర వెంట జని, సీత యాభరణము లన్నియును దీసికొనెను. ఇంతలో ఈ వార్త పట్టణమంతయూ వ్యాపింప, లక్ష్మణుడు కరవాలము చేత ధరించి, దశరథుని, కైకను హతమార్తునని ప్రళయకాల రుద్రుని విధంబున హుంకరింపుచు "రాముని అడవికి పొమ్మనిన వారిని నిర్మూలింతు" నని కోపోద్రేకమున వచ్చు లక్ష్మణుని జూచి అందరూ భయపడిరి. అంత రాముడు లక్ష్మణుని దరిజేరి, సమయానుకూల వచనరచనా భాషణంబుల లక్ష్మణుని శాంతుని గావించెను. అపుడు లక్ష్మణుడు తానును రామునితో అడవికి వత్తునని, రాముడు లేని రాజ్యము అడవియే యని, ఈ యడవిన నేనుండనని, రాము డుండిన అడవియే తనకు ఆ రామపుని దెల్పి, అరణ్యవాసమునకు రామునివలన అనుమతుడై ప్రయాణమాయెను. ఈ కథ యంతయూ జూచుచున్న కైక కింకర్తవ్యతా మూఢురాలై యుండెను.

## రామలక్ష్మణు లరణ్యమున కేగుట

అంత రాముడు సుమంత చోదితంబగు రథంబున సీతాలక్ష్మణ సహితుడయి అరణ్యములకు బోవుచుండ, అయోధ్యాపురవాసు లందరూ

ఎదురువచ్చి, "రామా! శ్రీరామా! నీవు లేని ఈ యయోధ్యలో నిమిష ముండజాలము. నీతో మేమును అడవులలో కాలము గడిపెదము. దుష్ట రాజ్యమున నివసించుట కన్న అడవులలో ఆకులు, అలములు మేసి జీవించుట ఆనందము. భరతుని రాజ్యమున మే ముండజాల" మని పలుక, రాముడు రథము దిగి, "అయ్యలారా! భరతుడు తండ్రి యానతిని ఈ రాజ్యంబునకు చక్రవర్తి. చక్రవర్తిని విడనాడుట మహాపాపము. కావున మీరు ఈ రాజ్యములో హాయిగా నుండుడు. నేను తిరిగి త్వరలో రాగల" నని చెప్పి, సూర్యాస్తమయ సమయమునకు గంగానదీ తీరము జేరెను.

సుమంత్రుని తిరిగి బంపి, ఆ రాత్రి గంగాతరంగ సీకర సంశోభిత పూలవనంబున సీతాసహితుడయి పరుండెను. లక్ష్మణుడు ఆ రాత్రి యంతయు వారలకు దూరముగా నుండి ధనుష్పాణియై కావలా గాయు చుండెను. గంగానదీ తీరవాసులగు పల్లెవారు సీతారాములు నిద్రించు చుండ, లక్ష్మణుడు వారికి ఏమయినా యపకారము సేయునేమో యను దలంపున గుహుడు లక్ష్మణునిపై కావలా గాయుచుండెను. గుహుని పరిచారకులు గుహుడు సీతారాముల కేమయినా ఆపద వాటిల్లజేయునేమో యను దలంపున వారందరూ గుహుని కాయుచుండిరి. తమ భర్తలు అత్యంత సుందరాంగియగు సీతను జూచి కామమోహితులయి రామలక్ష్మణులకు ఏమయినా అపచార మొనర్తురేమో నని ఆడవారు, అందరూ ఒకరికి దెలియక మరియొకరుగా ఆ రాత్రియంతయూ నిద్రమాని కనువాల్చక రామలక్ష్మణులను కావలా గాసిరి.

తెల్లవారినది. రాముడు, సీత, లక్ష్మణుడు స్నానసంధ్యానుష్ఠానంబులు నిర్వర్తించి, గంగ దాటుటకు పడవవారిని బిలువ యొకడును రాకుండెను. అపుడు గుహుని బిలిచి నదిని దాటింపుమనిన, "అయ్యా! నీ పాదధూళి తగిలి రాయి నాతి అయినది. మే మీ పడవల ఆధారమున జీవయాత్ర గడుపు చున్నాము. మా కీ పడవదక్క వేరే జీవనోపాధి లేదు. కావున నీ పాద స్పర్శవలన ఈ చెక్కలన్నియు పడతులయిన మా బ్రతుకు బాధాకరము

కాగలదు. కావున నీ పాదములను మేము శుభ్రముగా కడిగి గాని పడవ నెక్కనీయ"మనిన, రాముడు సరేయన, ఆ పల్లెవాసులందరూ సీతారాముల పాదములను పళ్ళెరముల శుభ్రముగా కడిగి, ఆ జలమును అందరూ పానము జేసి, నదిని దాటించిరి. సీతారాములు వచ్చుచున్నారనిన వార్త శిష్యులవలన వినిన భరద్వాజముని ఎదురువచ్చి సీతారాములను దన యాశ్రమమునకు గొని పోయి, సాటి దాపసుల రావించి, సీతారాముల దర్శనంబు వలన వారినందరినీ పునీతుల గావించి, సీతారాములను కొలది దినములు తన యాశ్రమమున నుండునట్లు చేసెను.

## దశరథుని మృతి

రాము డడవి కేగెనను వార్త వినిన దశరథుడు 'హా రామా!' యని క్రిందబడి ప్రాణముల విడచెను. తరువాత వసిష్ఠాదులు ఆ దశరథుని శరీరమును తైలమున యుంచి భరతునకు వర్తమాన పంపిరి. దూత భరతునకు వర్తమానమును గొనిపోయెను.

## భరతునకు కల వచ్చుట

ఇట్లుండ నొకదినమున భరతునకు ఒక పీడకల వచ్చెను. అని జైమిని దెల్ప, వాలఖిల్యులు ఆ కల ఆద్యంతములను జెప్పుమనిన, జైమిని ఇట్లు జెప్పదొడంగెను:

ఏ దినంబు సీతారాము లరణ్యములకు పోయిరో, ఆ రాత్రి భరతునకు తన తండ్రియగు దశరథుడు రక్తవస్త్ర రక్తమాల్యధారుడై గాడిద నెక్కి దక్షిణదిక్యానము గావించినట్లు కలగాంచి ఆ కలతతో మేల్కాంచి తన ప్రక్కనున్న భార్యకయిననూ దెలుపక వ్యాకులచిత్తుడయి, మంచి గుఱ్ఱమునెక్కి అయోధ్యాపురమునకు అడ్డదారిన మధ్యాహ్నమునకు వచ్చెను. ఆ పురమున రాజచిహ్నమగు కేతనము త్రెంచివేయబడినది. ఏ ఇంట జూచిననూ తెగిన తోరణములు అలంకార విహీనములుగా నున్నవి. రాజవీధిని

జనులు గుంపులు గుంపులుగా గూడి, భరతుని జూచి తలలువాల్చి కనుల నీరు నింపుచుండిరి. అది జూచిన భరతునకు కారణము దెలియకుండెను. అయోధ్యాపుర మంతయు భర్తృహీన యగు వధువువలె కళావిహీనమయి యుండెను.

అది అట్లుండ భరతుడు కైకమందిరమునకు వచ్చి, నీలాంబర ధారిణి యగు తన తల్లిని జూచి. "ఇదేమమ్మా! కలినాంబరము ధరించితివి. నా తండ్రి దశరథ చక్రవర్తి ఎచ్చట?" అని అడిగి సమాధానము వచ్చు నంతలో కౌసలరాజపుత్రి గృహమున నుండునేమో జూచివత్తునని బయలు వెడల, కైకేయి నిలువరించి కనుల నీరు నింపెను.

అది జూచి భరతుడు మరింత ఆవేదనాయత్త చిత్తుడయి, తండ్రిని జూడనిదే నా మనసు నిలువదను నంతలో వసిష్ఠుడు వచ్చి భరతుని తగు విధంబున నూరార్చి. తైలభాండమున నున్న దశరథుని యొద్దకు గొనిపోయి చూపించెను. అది జూచి భరతుడు 'హా, తండ్రీ!' యని నేల గూలెను. అంత పరిచారకులు ఉపచర్యల వలన భరతుని సేదదీర్చిరి.

## భరత విలాపము

భరతుడు సేదదీరి వసిష్ఠాదుల వలన రామ వనవాసవార్త విని మిగుల దుఃఖించి, తనకొరకు తనతల్లి ఈ కార్య మాచరించిన దని మనసున దలచి, తల్లిని అనేక విధముల తూలనాడెను. కైకకు ఏమనుటకు దోచ నందున మౌనముద్ర వహించి యుండెను. తరువాత భరతుడు వసిష్ఠాను మతిని తండ్రికి అంత్యక్రియలు జరిపించి, సకల పరివార సమేతుడయి, ముగ్గురు తల్లులతో కలసి, వసిష్ఠాదులు. సుమంత్రుడు తోడురా శత్రుఘ్న పురస్సరుండయి, భరద్వాజాశ్రమంబున కాపల చిత్రకూటగిరి నున్న రాముని సన్నిధికి బయనమై, గంగానదీ తీరమును జేరెను.

అట్లు చేరిన భరతుని పర్వతాగ్రమునుండి లక్ష్మణుడు జూచి గజ రథ వాజి భట సమూహముల దిలకించి, ఔరా! కైకపుత్రుడు దుర్మార్గము నను

దలచి రాము డొంటరిగా నున్నాడని దలంచి, చతురంగబలముల వచ్చినాడని దలంచి, ధనువు ధరించి రాముని సన్నిధికి వచ్చి, "అన్నా! అదుగో కైక కొడుకు. చతురంగ బలంబుల మనపై దండు వెడలినాడు. అతని సేనలు గంగదాటకుండగనే హతమార్చి వచ్చెద. ఆనతిం"డనిన రాముడు ఆనందమున లేచి ఎత్తగు శిలనెక్కి సకల బల సమన్వితుడగు భరతుని జూచి, అతని ప్రక్కనున్న సుమంత్రాదులను గుర్తించి, లక్ష్మణుని భుజమున చేయివైచి "నాయనా, సోదరా! భరతుడు లక్ష్మణాగ్రజుడయ్యా! అతనిని సంశయించుట ధర్మముగాదు" అనునంతలో భరతుడు సేన లన్నిటిని గంగ కావలియొడ్డున నిలిపి, ముగ్గురు తల్లులు, సుమంత్రుడు, వసిష్ఠుడు తోడురా గంగదాటి శ్రీరాముని దూరమునుండియే జూచి సాష్టాంగనమస్కారము గావించి, వినయ వినమ్రుతాంగుడై దరిజేరి నిలుచుండెను. రాముడు భరతుని కౌగలించుకొని, అలంకార విహీనలగు తల్లులజూచి విచారబడి భరతుని వలన దశరథ మరణము విని, శోకాక్రాంతచిత్తుడయి చాలసేపు విలపించి, తల్లులచేత, తమ్ములచేత ఊరడింపబడి, వసిష్ఠానుమతిని భరద్వాజుల గూడి, తండ్రికి తిలోదకక్రియ లాచరింప గంగానదిజేరి, తిలోదకక్రియలు పూర్తి గావించి, తిరిగి భరద్వాజాశ్రమము జేరెను.

భరద్వాజుడు తన యాశ్రమమునకు నచ్చిన దశరథ పత్నులకు, పరివారమునకు షడ్రసోపేతమగు విందు జేసెను. విందు నందిన వెనుక, భరద్వాజాదు లందరూ సావధానులైయుండ, భరతుడు లేచి, అందరూ విన నిట్లనియె:

"అన్నా, రామచంద్రా! నా తల్లి దురాశావేశమున గోరిన కోరికను నీవు దలంపక నా మనవి నాలకించి అయోధ్య జేరి రాజ్యము పాలింపుము. లేకున్న నేనును నీతోడనే అరణ్యముల నుండెద" అని అనెను.

ఆ మాట విని రాముడు భరతుని తనప్రక్క కూర్చుండజేసి, మందస్మిత వదనారవిందుడయి మృదుమధుర భాషణంబుల నిట్లనియె:

"నాయనా, భరతా! తండ్రిగారు పరలోకగతులయిననూ వారి కోరిక దీర్చు భారము నీపై, నాపై గలదు. మన తండ్రి దశరథ చక్రవర్తి నిన్ను రాజ్యపాలనము చేయుమనియు, నన్ను అరణ్యపాలనము చేయుమని యాజ్ఞాపించినారట. తండ్రి యాజ్ఞను దీర్చు భారము మన ఇద్దరియందు సమముగా గలదు. కావున నేను అరణ్యపాలనము గావింతును. నీవు రాజ్య పాలనము సేయుము. ఇది తిరుగులేని నా నిశ్చయ"మనెను.

అపుడు భరతుడు చాలసేపు విలపించి, "నీవు లేని అయోధ్యకు నేను బోజాలను. తండ్రి గతింప తండ్రితో సమానుడవు నీవు. నీ వెనుక తిరుగవలసిన మేము, నీవు లేని అయోధ్య రాజ్యము పాలన చేయజాలను," అని అనినంతనే రాముడు "నాయనా, భరతా! పదునాల్గు వత్సరములు నిండనిదే నేను కోసల సామ్రాజ్యమున అడుగిడజాల. రఘువంశీయుల కీర్తిని గాపాడుభారము మనయందరి భుజములపై యున్నది. కావున, నీవు మారు పలుకక అయోధ్యారాజ్య మేలుకొనుము." అనునంతనే, భరతుడు హోరు, హోరున విలపించి, శ్రీరామపాదముల రెండు చేతులుంచి, "అన్నా! రాజ్య పాలమునకు నే నసమర్థుడ. మరి ఎవ్వరినైనను నియమింపుము. నేను నీవెంట నుండి నీదాస్యము చేయువాడ"నన, రాముడు భరతుని లాలించి, "నాయనా! అట్లు జేసిన తండ్రియానతి మీరిన మహాపాపము మన ఇరువురిని దహించి వేయగలదు. కావున, నీవు రాజ్యపాలనము జేసి దీరవలయును" అనిన భరతుడు, "అటులయిన నీ పాదుకల నిమ్ము, వానిని సింహాసనమున అలంకరింపజేసి, రాజ్య మేలెద"నన, రాముడు భరద్వాజాదు లనుమతిని భరతునకు పాదుక లిచ్చెను.

భరతుడు ఆ పాదుకల తల ధరించి, ప్రయాణమున కాయత్తు డాయెను.

అపుడు కైక సీతారాములను చెరియొక వైపున నుంచుకొని వారి దలలు ముద్దాడి హోరు హోరున ఏడ్వసాగెను. అదిజూచి భరతుడు మెల్లన

భరద్వాజునిజేరి, "మునీంద్రా! కైక రాముని విడజాలక విచారపడుచున్నది. కైక రమ్మనమని దెల్పిన రాముడు దిరిగి రాగలడు. కావున దమరు కేకయ రాజపుత్రిక నొప్పించి రాముని అయోధ్యకు రప్పింపు"దనిన, భరద్వాజ మహర్షి కైక దగ్గరకు మెల్లనవచ్చి, భరత సందేశము వినిపించెను.

అపుడు కైక సేదదీరి, సీతారాములను ఎదుటగల పూలకుంజముల బోనడచి భరద్వాజుని జూచి ఇట్లనియె. "మునీంద్రా! ఇందలి పరమరహస్యము మీ రెరుగనిది గాదు. నా కళ్యాణ సమయమున దశరథ చక్రవర్తి నా దండ్రికి వ్రాసియిచ్చిన బంగారు పత్రమున మీరును సంతకము జేసితిరి గదా! దానికి భిన్నముగా నడచిన నా తండ్రి యూరకే విడచునా? తాతను విడచి భరతుడు రాకున్న అన్నదమ్ములలో విరోధము లెంచి, వంశనాశనము గావించుటయేగాక, ఇక్ష్వాకు వంశమున కపకీర్తి చేకూర్చిన వార మగుదుము. రాముడు అరణ్యవాస నెపమున చెదరిన రాజ్యమును తిరిగి సంపాదింప గలడు. భరతుడు రాజ్యము పరాధీనము గాకుండ గాపాడగలడు. రామునకు లక్ష్మణుడు, భరతునకు శత్రుఘ్నుడు దోడుగ నుండగలరు. అనురూప వతులగు దంపతులకు అరణ్యము - పట్టణ మను భేదము లుండవు. కావున రామవనవాసము నాకు బాధాజనక మయినను, వంశమర్యాద కొరకు సమ్మతింప వలసి వచ్చినది. ఇపుడు భరతుని రాజ్యము ఆత డెవ్వరి కిచ్చిననూ అడ్డువారు లేరు. దశరథునకు అబద్ధీకు డను అపవాదు రాదు. రామునకు పితృవాక్య పరిపాలకు డను కీర్తి ఆ చంద్రతారార్కము నిలువగల"దని చెప్పి, రాము ననుమతిని భరతాదుల గూడి ప్రయాణమయి, నందిగ్రామము జేరి, అచట శ్రీరామపాదుకలకు పట్టముగట్టి, ఏకభుక్త దీక్షను గాలము గడుపుచుండెను.

భరతుడును తన తమ్ముని సర్వసేనాధిపతిని గావించి, సుమంత్రాను మతంబున రాజ్యము పాలించుచుండె నని జైమిని దెల్ప, వాలఖిల్యులు ఆనందమంది, తరువాత వృత్తము చెప్పుమన, మహర్షి జైమిని ఇట్లు చెప్ప ప్రారంభించెను.

## కైక దశార్ణరాజును జయించుట

రాము డడవి కేగిన తరువాత భరతుడు నందిగ్రామమున జటావల్కలధారియై, ఏకభుక్తదీక్షాబద్ధుడై యుండుట, కైక భర్తృ వియోగమున రూపరి అంతఃపురము నిడువకుండుట, అర్భకుడగు శత్రుఘ్నుడు, మూడు కాళ్ళ ముదుసలియయిన సుమంత్రుడు రాజ్యపాలనము సేయుట ఎరింగి దశార్ణ దేశపాలకుడయిన సుమంతుడు మ్లేచ్ఛ, తురుష్క. పుళింద, పారసీకులను సహాయము దీసికొని కోసలరాజ్యము మీదకు దండెత్తి వచ్చెను. శత్రుఘ్నుడు కతిపయ సేనాసహితుడయి ఆతని నెదిరించి మూ డహోరాత్రములు దుర మొనరించి, ఆతని ప్రతాపమునకు, బహుళ సేనానివహమునకు లొంగి, ఆతనిచే పట్టుబడియెను. సుమంతుడు దశరథసేనల నోడించి, శత్రుఘ్నుని దన రథంబునకు గట్టుకొనిపోవ ప్రయత్నించి, రథకూబరంబున శత్రుఘ్నుని గట్టెను. అంత నొక దూత పరుగుపరుగున వచ్చి ఆ విషయము భరతున కెరిగింప, భరతుడు సోదరప్రేమవలన శత్రుఘ్నుడు శత్రుబంధితుడయినాడను మాట వినిన తోడనే ఆవేశపూరితుడయి, రథ మధిరోహించి, శత్రువుని మార్గమధ్యమున అవరోధించి, ఐదు అహోరాత్రము లాతనితో పోరు సల్పెను. గాని అత్యంత సేనాసమన్వితుడును, పారసీక సేనాబలయుతుండును నగు సుమంతుని నోడింప లేక భరతుడును శత్రువునకు బందీయాయెను.

సుమంతుడు భరత, శత్రుఘ్నుల నొకే రథమున గట్టి తనపురంబునకు గొనిపోవు చుండెను. ఆ విషయము ఒక దూత వచ్చి అంతఃపురమున గల కేకయరాజపుత్రికి విన్నవింప, కేకయరాజపుత్రి సుమంతుని రావించి, విషయమంతయూ ఆమూలాగ్రముగా నెరింగి, భరత, శత్రుఘ్నులు శత్రుబందీ లయినారని దెలిసి, శోక రోషావేశపూరితురాలై, దన యరదము రావించి, ధనుర్బాణంబుల ధరించి, దావగా మిగిలిన సేనల సమకూర్చుకొని, ప్రళయకాలమారివలె విజృంభించి, మార్గమధ్యంబున దశార్ణరాజును అడ్డ

గించి, మెరుపుమెరపిన విధమున ఆతని సేనల మధ్యంబున తిరుగాడి, రథ కూబర బంధితులగు భరత, శత్రుఘ్నుల బంధవిముక్తుల గావించి, శంఖ ధ్వానము జేసెను.

ఆ శంఖనాదంబునకు సంద్రము లల్లాడినవి. పారసీక సేనలు పరుగిడ నారంభించినవి. మ్లేచ్ఛ సేనలు సవారి మేసినవి. తురుష్క సైన్యంబులు తూలి పోయినవి. ఆ సమయంబున కైక వారి నంతతో విడువక, చక్రభ్రమణంబున రథంబు శత్రుసైన్యముల ద్రిప్పుచూ శత్రుమూకల దునుమాడుచుండ, భరత శతృఘ్నులునూ తల్లి పరాక్రమమును జూచి, ద్విగుణీకృత యుత్సాహవంతులై దుర మొనరించిరి.

అపుడు అనంతకోటి ప్రమాణంబులయిన దశార్ణ సేనలు రథంబులు విరిగి, గజంబులు జచ్చి, అశ్వంబులు దూపరి, కాల్బలములు కదనము సేయజాలక రణరంగము వదలి పరుగిడ ప్రారంభించెను. అపుడు కైక పుళింద రాజుతో పోరి, ఆతనిని అంపవెల్లిని బంధించి, మ్లేచ్ఛసేనలను మేకల జేసి, గుంపుకట్టి, మ్లేచ్ఛరాజును అరదమునకు గట్టి, భటుల గాపుంచి, దశార్ణదేశపాలకుండగు సుమంతుని దశబాణంబుల కేతనంబు నరికి, నాల్గు బాణంబుల రథంబును దునిమి విరథుని గావించి ఇట్లనియె:

"ఓరీ, రాజాధమా! రాముడు ఊరలేడని, భరతుడు దీక్షాబద్ధుడని, కైక రూపరి యున్నదని దలచి మ్లేచ్ఛసేనల సాయమున వచ్చి నా పుత్రుని రథంబున బంధింతువా? ద్రోహీ!" యని ఆతనిని తన రథకూబరంబుననే బంధించెను. అది జూచి శత్రుసేనలు భయమంది, ప్రాణము లుండిన చాలునని పరుగెత్తిరి.

అంత కైక విజయ భేరి మ్రోగించి, శంఖా నాదంబున దిక్కులు ప్రతిధ్వనింపజేసి, శత్రువులను బంధించి నందిగ్రామము జేరి, మంత్రి యగు సుమంత్రుని బిలచి, "మంత్రివర్యా! భరతుడు శ్రీరామ సేవకుడు, చక్రవర్తి శ్రీరాము డిపుడు లేనందున బంధితులగు ఈ శత్రురాజులను

శ్రీరాముడు దిరిగివచ్చువరకు కారాగార బంధితుల గావింపు"మని ఆజ్ఞ ఇచ్చి, తాను అంతఃపురమునకు పోయెను.

భరతుడు యథావిధిని తన కృత్యములు నెరవేర్చుచుండెను. శత్రుఘ్నుడును అన్న అనుమతిని, దల్లియాజ్ఞను తలదాల్చి రాజ్యపాలనము చేయుచుండెను. సామంతులందరూ, "అబ్బా! కైక సామాన్య వనిత గాదు. రఘుకులము గావ అవతరించిన జగన్మాతగాకున్న, దిక్పాలక తుల్యు లగు తురుష్కుల దూలించునా? పశుపతి సములగు పారశీకులను బందీ గావింప జాలదు. అంతక సముండగు దశార్ణ చక్రవర్తి బంధింపబడినాడనిన సామాన్యమా?" యని కైక వీర, విక్రమ, విజయ గాధల చెప్పుకొనుచూ, ప్రతి సంవత్సరంబునూ బరణము అర్పించుచూ, భరతుని పాదపీఠిని గొలుచుచుండిరి. భరతుడును రాముని రూపము మనసున ప్రతిష్ఠించి ఆరాధించుచూ ధర్మమార్గంబున, తల్లి ఆదేశంబున, సుమంత్రుని అనుమతిని రాజ్యపాలనంబు చేయుచుండె.

ప్రజలు కరువు కాటకాదులు లేక నెలకు మూడు వానలు గురిసి, పంటలు పండి, పశువుల వృద్ధివలన పాడి సుఖంబు లందుచుండిరి. బ్రాహ్మణులు తమ విహితమగు వేదకర్మలు నడుపుచుండిరి. ఆవులు బాగుగా బలసి, చన్నులకి పాలు గురియుచుండెను.

భరత పాలనంబున ప్రజలు ఆనందోత్సాహ సంభరితులై యుండిరి, అని జైమిని చెప్ప వాలఖిల్యులు విని ఆనందించి, ఆవలి కథ యగు రాము నరణ్యవాస విశేషంబును, రావణుని ప్రవర్తిని దెల్పుమనిరి.

ద్వితీయ కాండము సంపూర్ణము

# తృతీయ కాండము

జైమిని మహర్షి సావధానుడయి ఆసనమున గూర్చుండి. మందస్మిత వదనారవిందుడయి, "మహర్షులారా!—రాముని వృత్తాంతమును వినుడ"ని ఇట్లు చెప్ప నారంభించెను.

శ్రీరామచంద్రుడు సీతా సమేతుడయి భరద్వాజాశ్రమంబున నుండ, శరభంగ మహాముని శిష్యసహితుడయి వచ్చి, కుశలప్రశ్నానంతరము ఇట్లు చెప్పెను.

"శ్రీరామా! నీ యాగమనము వలన ఈ యరణ్య మంతయూ పవిత్ర మయినది. క్రూరమృగ బాధలు తప్పినవి. యజ్ఞయాగాది కర్మలు నిర్విఘ్నముగా జరుగుచున్నవి. కాని దండకారణ్యమున విరాధుడను రాక్షసుడు జనులకు గానుపించక దూరమున నెచ్చటనో దాగి, పాంథ జనులను భక్షింపుచున్నాడు. కబంధుడను వాడు కర్కశ బాహువుల ప్రాణికోటుల బంధించి పొట్ట నింపుకొనుచున్నాడు. ఖరదూషణాదు లను రాక్షసులు ఆశ్రమంబుల కూల్చి, హోమాగ్నుల నార్పి, కామధేనువుల కసిమసంగుచున్నారు. వారిని పరిమార్చి, మునిజనంబుల రక్షింపదగినవాడవు నీవు దక్క మరియొకరు లేర"ని జెప్పి, భరద్వాజు ననుమతిని రాముని దండకారణ్యమునకు ప్రయాణము చేయించెను.

రాముడు సీతాలక్ష్మణ సహితుడయి ఘోరాతిఘోర అరణ్యంబులు దాటుచూ, అందందు నివసించు మహర్షి గణంబుల నవలోకించుచూ, పుణ్య తీర్థముల స్నానమాడుచూ, మెల్లమెల్లన దండకారడవి జేరి, తొలుత కబంధుని, విరాధుని రూపుమాపి, ఖరదూషణాదుల పదునాల్గువేల రాక్షస గణంబులతో అంతకాలయము జేర్చి, అరణ్యవాసమున ద్వాదశ వత్సరంబులు పన్నెండు గడియలవలె గడపి పదమూడవ వత్సరంబు ప్రవేశించుకాలంబునకు గౌతమీ తీరప్రాంత మగు పంచవటికి జేరి, అచట సకల సుమపరిమళ భరితంబులగు ఆరామంబుల జూచి ఆనందబడి, నానావిధ ఫలభరితంబులైన

తోటలతో గూడియుండిన ప్రదేశమున, పంచవటీ తీరమున - పర్ణశాల నిర్మించుకొని యుండిరి. సీత గోదావరీ తరంగ సించిత సీకరంబుల పవిత్ర మగు ఆ భూమిని నవవికసిత సుమంబుల గోయుచూ, నవపల్లవ శోభితంబు లగు పూల కుంజంబుల దిరుగుచూ, అనవరతంబును లక్ష్మణు డాచరించు సమయోచిత సేవా నిరతిని ఆనందమందుచూ హాయిగా కాలము గడుపు చుండెను. శ్రీరాముడును ఇక రెండు వర్షములలో తమ యరణ్యవాసము ముగియునను దలపుతో, సీతాలక్ష్మణుల యుపచర్యను సుఖంబున అయో ధ్యను మించిన ఆనందమున కాలంబు గడుపుచుండె.

## శూర్పణఖ రాముని జూచి మోహించుట

ఇట్లుండ నొక దినంబున సాయం సమయమున మంద మలయా నిలంబు గోదావరీ తరంగముల నుండి వెలువడి, నానా విధ పరిమళ పుష్ప వాటికల తేలియాడుచూ, సీతారాముల సంసేవింప వచ్చినదా యనునట్లు సకల ప్రాణులకు ఆనందము సమకూర్చుచుండెను.

అపుడు సీత ఆ సాయం సమయ వినోద విహారమున పూ నికుంజ ముల దిరుగుచుండ, రాముడు యొక పూలవాటికలో తిన్నెపయి కూరుచుండి యుండెను. అపుడు శూర్పణఖ యను దానవకాంత - రావణుని చెల్లెలయి ననూ దూషిత వర్తన గల దగుటచేత - రావణునిచే రాజ్యమునుండి వెడల గొట్టబడినది, దండకారణ్యములో దిరుగునది, ఖరదూషణాదులు జచ్చిన వెనుక దిక్కులేక దిరుగుచూ ఏకాంతమున నున్న రాముని జూచి, ఆ ముగ్ధ మోహన సౌందర్యంబునకు అచ్చెరువు జెంది, కామరూపధారిణియై ఆడుచూ, పాడుచూ రాముని యొద్దకు వచ్చెను. ఇంతలో దూరమున పుష్ప సేచనము గావించుచున్న జానకి, ఈ మహారణ్యమున ఈ సుందరాంగి ఎవరా యని దలంచి, ఏ అప్సర కాంతయో, వనకాంతయో రాముని దరి జేర వచ్చిన దని దలంచి, మెల్ల మెల్లన రాముని దరి జేరి, వామ పార్శ్వమున నాసీన యాయెను.

అది జూచిన శూర్పణఖ అతిశయించిన కామ, రోష, ద్వేషాయత్త చిత్తయై రామునితో నిట్లనియె: "ఓ రాజా! నీ సౌందర్యమునకు మానవ కాంత తగినది కాదు. నా యాటపాటల, నవ్య నవ శృంగార లీలల నిస్నన వరతము అలరింపజేసి, అంగజ సామ్రాజ్య మేలింతును. రమ్మ," అని చేయిబట్టి లాగ, రాము డసహ్యించుకొని, చేయి విదిలించుకొని దూరముగా బొమ్మనప ని గద్దించెను. శూర్పణఖ అంతతో విడువక రాముని అనేక విధముల నయ, అనునయాలాపదారవంబుల బాధించుచుండుట జూచి లక్ష్మణుడు రాము నాజ్ఞ లేక ఏమి సేయరాదు గావున యూరకుండెను. అది గ్రహించి రాముడు, 'అదుగో నను మించిన సుందరాకారుడు: ఒంటరితనమున నున్నా' డనిన, శూర్పణఖ లక్ష్మణుని వద్దకు వచ్చి, కామసూత్రంబు లేకరువు పెట్ట, లక్ష్మణుడు కోపగించి తన మొలనున్న సురియదీసి, శూర్పణఖ ముక్కు, చెవులు గోసి బంపెను. అంత శూర్పణఖ రక్తసిక్తాంగినియై హోరుహోరున నేడ్చుచూ బోయెను. రాముడు సీతను జేరి హాయిగా నుండెను, అని మహర్షి జైమిని చెప్పిన విని, వాలఖిల్యు లానందబడి, రావణుని చరితము చెప్పుమనిన జైమిని ఇట్లు చెప్పదొడంగె.

## శూర్పణఖ రావణునిజేరి విలపించుట

శివచాపము నెత్తుటలో భంగపడిన రావణుడు నారదుని యుపదేశమున దివ్యమంత్ర, జపానుష్టాన తత్పరుడై, ఇరువది ఏడు సంవత్సరంబులు అహోరాత్రంబులు కేవల వాయుమాత్ర భక్షకుడై, ఏకాంత మందిరారామమున జపించుచుండె. అపుడు మండోదరి విభీషణుని బిలచి యిట్లనియె:

"ఏమి స్వామీ! మీ యన్నగారు దానవ సార్వభౌములు నిర్విరామ మౌనవ్రత దీక్షా పరవశులయి ఇప్పటికి ఇరువది యేడు వత్సరంబులు గడిచినవి. ఈ ఇరువది ఏడు వత్సరంబులు నిత్యము మూడు వేళల చేయు పరమేశ్వరారాధనము మానివేసిరి. నిత్యము ప్రభాతసాయాహ్నముల జరుపు సంగీతాలాపన, వినోదంబు మానిరి. రాజ్యపాలనాదికార్యములకు స్వస్తి

చెప్పిరి. నాతో పలుకకుండిరి. అక్షయ, మేఘనాథులను బలుకరింపరు. మనుమల జేత నెత్తరు. తల ముద్దిడరు. ఈ విపరీతమునకు కారణము కానరాదు. పరమేష్ఠి మెచ్చి ఇచ్చిన తలలను, చేతులను ధరింపరు. కిరీటాది భూషణము లలంకరింపరు. ఏమి కారణమో తెలియజేయకున్నాను" అని విలపించుచూ, విభీషణునితో ఆలోచించుచున్న సమయంబున తండ్రి పాద పీఠిని నమస్కరింప మేఘనాథుడు, భార్య, కుమారుడు అక్షయుడు, పక్షైరా బంధుగులు వచ్చి మండోదరీ విలాపము లాలకించి, మనసున దిగులొంది యుండిరి.

ఈ సమయంబున శూర్పణఖ దిక్కులు ప్రతిధ్వనింప, ఘోర కఠోర నాదంబున విలపించుచు, ముఖమున రక్తధారలు గురియ, జూచువారి గుండె లవియ వికృతాననయై రావణ దర్పో మందిర ద్వారమున జేరి పెద్దపెట్టున, "అన్నా! దానవ సార్వభౌమా! రాక్షసాధిపా! త్రిలోకపాలకా!, అఖిలదేవతా గర్వ నిర్వాపణా! రక్షించు, రక్షించు" అని ఏడ్చుచూ వచ్చు శూర్పణఖను విభీషణాదులు జూచి, ఆ వికృతాకార ధారణకు కారణము దెలియజాలక చిత్రపు ప్రతిమల వలె నిలుచుండి చూచుచుండిరి.

ఇంతలో శూర్పణఖ విభీషణుని దగ్గరి రావణుని కెదురుగా నిలచి పెద్ద పెట్టున యిట్లనియె:

"అన్నా, దానవాధిపా! అన్యాయముగా నరాధముల చేత అవమానింప బడితిని" అనెను.

అది విని విభీషణ, మండోదరులు సాభిప్రాయ ప్రశ్నార్థకముగా శూర్పణఖను జూచిరి. మేఘనాథుడు "ఎవరా నరులు, ఎక్కడుండిరి. వారు నిన్ను పరాభవించుటకు కారణమేమి?" యని యడుగ, శూర్పణఖ ద్విగుణీ కృత శోక బాధాపూరితయై, "గోదావరీ తీర వనవాటిని పంచవటియను నొక సుందర వనప్రాంగణము గలదు. అచ్చట రామలక్ష్మణు లను నరాధములు సుందరాతిసుందర కాంతను వెంట నిడుకొని విహరించుచుండిరి" అను

నంతలో రామలక్ష్మణులు అను మాట విని రావణుడు కనులు మెల్లగా దెరచెను.

శూర్పణఖ అది గాంచి రావణునకు దగ్గరగా, ఎదురుగా నిలుచుండి, "నీలమేఘచ్ఛాయ శరీరులు, ఆజానుబాహు లగు నరాధములు-రామలక్ష్మణు లను వారు-పంచవటి ప్రాంతంబున యొక భూలోకసుందరి గూడి విహరించు చుండిరి. నేను వారిని గాంచి, ఆ కాంతను దానవ సార్వభౌమునకు అరణ మర్పించి, నా అపరాధమును మన్నింపవేడ దలంచి, వారి వద్దకు బోవ వారు న న్నకారణముగా దూలనాడిరి. 'నేను దానవ సార్వభౌముడు, అఖిలదేవతా గర్వనిర్వాపకుడు, అఖండ భూవలయ పాలకుం డగు రావణ సార్వభౌముని సోదరిని' అని అనునంతలో వారు నన్ను అవహేళన జేసి, నా ముక్కు చెవులు గోసి, నీకు దిక్కున్నచోటికి బోయి చెప్పుకొన మనిరి" అని వెక్కివెక్కి ఏడ్వ నారంభించెను. అపుడు రావణుండు దన యాసనము నుండి దిగి, ముందునకు వచ్చి, రామలక్ష్మణ రూపముల తీరు మరియొక సారి విని, వారి నివాసము ఎరింగి, పయన మాయెను.

మందోదరి ఎదురేతెంచి ప్రభూ! యన, తలపై చేయుంచి, గడ్డము బట్టి లాలించి, మనముననే సంజ్ఞారూపమున అమెను బంపెను. మేఘ నాథుని, అక్షయుని, విభీషణుని అట్లే నివారించి, అపక్ర విక్రమ విహిత యానంబున పంచవటీ ప్రాంతము జేరి, రామలక్ష్మణుల కుటీరము వెదుక నారంభించెను. అపుడు రాముని భయమువలన బ్రాహ్మణ తపస్విరూపమున నున్న మారీచుడు. రూపరి యున్ననూ రావణుని గుర్తించి, ఎదురేగి నమస్క రింప, రావణుడు ఎవరో విప్రుడని దలంచి ప్రతి నమస్కార మిడి, మంద స్వరమున ఇట్లనియె:

"ఓ తాపసోత్తమా! ఇచ్చట రామలక్ష్మణులను నరాధములు నివసించి యుండిరట. వారి నివాసము నీకు దెలిసిన నాకు జూపింపు" మని యడిగిన, మారీచుడు తనలో, అహో! త్రిలోక ప్రతాప సంపన్ను డగు దానవ సార్వ భౌముడు రాముని వెదకుటలో అంతరార్థము ఇమిడి యున్నది. రాముడు నాకు

విరోధి. రావణుడునూ నన్ను. నా కుటుంబ బంధువులనూ రాజ్యభ్రష్టుల గావించినవాడే. కావున రామ రావణులకు విరోధము అధికము గావించిన వీ రిరువురు రణము గావించిన ఇరువురిలో నెవరో యొకరు మడియగలరు. ఇరువురిలో ఎవరు మృతినందిననూ నాకు మకర సంక్రమణమే యగును. అని దలంచి మెల్లమెల్లన నడచుచు దూరమున నుండి రావణునకు రాముని పర్ణశాల చూపించి, తాను ఆశ్రమంబున సులభముగా ప్రవేశార్హత గలిగిన లేడి రూపము ధరించి సీతారాము లుండిన వనవాటి జేరెను.

రాముడు, సీత యొక శిలపై గూర్చుండి యుండ, రావణుడు దూరము నుండి జూచి. వా రిరువురి అందచందములను జూచి యొకవంక ఆనందము, మరియొక వంక ఆక్రోశము, ఇంకొక వంక ఆశాపాశము తన మనసున లాగుచుండ, రావణుడు కొలదిక్షణములు సీతారాముల సందర్శనోత్సవంబున నేత్రంబులు సార్థకముల గావించి, వార లిరువురను దంపతులుగా సృజించిన పరమేష్టి బుద్ధివిశేషముల కచ్చెరువు జెంది, వారల గన్న తలిదండ్రుల పుణ్యము దలంచి, ఆనంద మంది, నారదోపదేశము తన మనంబున ఆశలూరింపుచుండ. సీతాపహరణమునకు ఉపాయ మాలోచించు చుండెను.

## మారీచుడు సీతను ప్రలోభ పరచి రాముని గొనిపోవుట

ఇంతలో మారీచు డా లేడిరూపమున సీతారాములను దగ్గరి, మెల్ల మెల్లగ గంతులిడుచు సీతారాములు కూర్చుని యున్న ప్రదేశము జేరి సీత దరికి బోయి పాదముల నాకెను. సీత దానిని బట్టబోవ పరుగిడెను. అపుడు ఆ లేడిని బట్టుకొనవలయునను దలంపున లేచి దాని వెనుక పరుగిడుచుండ, ఆ లేడి అందినట్లు అంది తిరిగి పరుగిడుచూ ఆ వనమంతయూ ద్రిప్పెను. అపుడు సీత అలసిపోయి తన కోరిక నెరవేరనందున విసిగి, ఆవేశమున నుండ, రాముడు జానకిని జూచి నవ్వెను. సీత అదిగాంచి శ్రీరాముని అ లేడిని బట్టి తన కిమ్మనెను.

శ్రీరాముడు నవ్వి, "జానకీ! ఇది ఏదియో రాక్షసమాయ. కాకున్న ఇంతకాలము గనుపింపని ఈ మృగ మీనాడు మనల దరి జేరుటలో ఏదో రహస్య మిమిడి యున్నది. ఈ లేడిని జూచినది మొదలు నా మనము కలత బారుచున్నది. కావున నీ వా లేడిపై కోరిక వదలుము" అనునంతలో సీత "స్వామీ! మీ కన్నియూ అనుమానములే, అన్నియూ రాక్షసమాయలే. మన అరణ్యవాసము ఇక ఒక సంవత్సర మున్నది. అది అరిక్షణములో పూర్తి కాగలదు. మనము అయోధ్యజేరిన, కోసలరాజగు భరతచక్రవర్తి మనలను జూడవచ్చిన ఆతని కీ లేడిని అరణ మొసంగిన రాజు సంతసింపగలడు; ముగ్గురత్తలు మురియగలరు. నా చెల్లెండ్రు ఊర్మిళ, మాండవి, శ్రుత కీర్తులు మోదమంద గలరు. అదియునుగాక, నాకు ఆశ్రమంబున ఈ ముద్దుల లేడి సహచారిణియై ఆనంద మీయగలదు. కావున దీనిని బట్టి నాకు ఇమ్మ"ను నంతలో, తిరిగి ఆ లేడి సీత దరికి వచ్చి, తోకబట్టగా జార్చుకొని పరుగిడెను. దానితో సీతకు లేడిని బట్టి తీరవలయునను పట్టుదల మరింత అధికమాయెను. అపుడు సీత రాముని పరిపరి విధముల బ్రతిమిలాడిన, రాముడు ఇది రాక్షసమాయ దప్ప ఇతరము గాదు. నీవు దానియందు ఆశ పడ వలదనెను.

అపుడు సీత రోషావేశపూరితురాలై పర్ణశాలలోకేగి ధనుర్బాణంబులు చేత ధరించి, 'బాణ మెల్లిని ఈ మృగమును బంధించి బట్టితీరెద'నను నంతలో రాముడు సీతను దరిజేర్చి లాలించుచుండ, సీత రాముని బ్రక్కకు దోసి, "నన్నంటవలదు. నా తండ్రి జనకుడు, మిమ్ములను మగరూపమున నున్న ఆడదానివని ఎరుగక నన్ను నీకు వివాహము జేసెను. నీ పరాక్రమాదు లిది వరకే ఎరుగుదును. చాలు. తండ్రి పట్టాభిషిక్తుడవై రాజ్య మేలమనిన భరతునకు దడిసి అడవికి వచ్చిన అసమర్థుడవు. ఆడదాని నాజ్ఞకు అంగ లార్చుచూ, ఆలిని అడవి పాలొనరించిన అనామికుడవు. నీవా నా కోరిక దీర్చునది. చాలు నీ ప్రతాపము. వివాహమయినది మొద లీదినము వరకును నిన్నేనాడును ఏదియును కోరి ఎరుంగను. ఈనాడు ఈ లేడిని కోరినంత

పట్టజాలని అసమర్థతను నాకు నీతులు గరుపవచ్చితివా!'' యని నిష్ఠురము లాడ, రాముడు "ఎన్నడూ పరుషవాక్యమాడని సీత ఈనాడు ఈ విధముగా ఆడుట ఏదో ఆపద సూచకమే యగును. 'కాలో హి దురతిక్రమః' అను నట్లు కాలగతిని ఎవ్వరూ తప్పింపజాలరు కానిమ్మ" అని సీతను సమాధాన పరచి, ధనువును దీసికొని లేడివెనుక పరుగిడ ప్రారంభించెను.

ఇది యంతయు దూరమునుండి చూచుచుండిన రావణుడు, ఈ నాటక మంతయూ తనకార్యమున కనుకూలమే నని దలంచి, రహస్య ప్రదేశమున నుండెను. రాముడు వెనుకరా ఆ లేడి పరుగు పరుగున సీతాసతీ కనులకు దూరమగు ప్రదేశము జేరెను. రాముడు విసిగి దానిమీద నొక బాణము వదిలెను.

అపుడా లేడి మాయాకంఠస్వరమున రాము ననుకరించుచూ—"హా సీతా! హా లక్ష్మణా!" యని దీనాలాపము గావించెను.

అది విని సీత ఆతురపడి, "లక్ష్మణా! మీ యన్న కేదో ఆపద వాటిల్లినది. నీవు త్వరగాబోయి కాపాడు" మనియెను.

లక్ష్మణు దది విని "అమ్మా! పదునాల్గు లోకము లెత్తివచ్చినను ధనువు చేతనుండ రాముని నేమియు సేయజాలవు. నీవు భయపడవల"దని బలికెను.

ఇంతలో తిరిగి, "హా సీతా! హా లక్ష్మణా!" యను నాదము విన వచ్చెను. అది విని జానకి మరింత ఆవేదనబడి సౌమిత్రితో నిట్లనెను.

"లక్ష్మణా! నీయన్న ఏదో ఆపదలో మునిగియున్నారయ్యా! త్వరగా బోవయ్యా!" యనెను. అపుడు లక్ష్మణుడు వినయముగా దరిజేరి "అమ్మా, జానకీదేవీ! సకల దానవ సంహారకు డగు రాముని యెవ్వరూ ఏమియూ చేయజాలరు. ఈ స్వరము రామునిది గాదు. ఈ మృగము మాయా మృగము. ఇది యంతయూ రాక్షస నిలయము. ఇది రాక్షస మాయ. రామున కే యాపద రాదు ..." అనునంతలో తిరిగి "హా సీతా! హా సీతా!" యను హీనస్వరము వినిపించెను

అంత సీత లక్ష్మణుని ఈవిధముగా దూషించెను. "ఓరీ, నరాధమా! నీవు భాతృద్రోహివి. నీయన్న చావు గోరుచుంటివి. నీ సోదరుడగు భరతుడు రాజ్యలక్ష్మి నపహరింప, నీవు గృహలక్ష్మి నపహరింప దలచితివిరా?" యని సంప, లక్ష్మణుడు, "హా, పాపము శాంతించుగాక:" యని ఆశ్రమమున ఒక గీతగీసి, దానిని దాటి రావలదని చెప్పి, ధనుర్బాణంబులు చేతబట్టి రాముడు బోయిన దిక్కునకు బోయెను. సీత కనులకు లక్ష్మణుడు కనుపించు నంతవరకూ ఆతని వైపు జూచుచుండెను.

ఆ సమయ మరసి రావణుడు మధుర మంజుల స్వరంబున సామంబు జతపరచి, ఈ విధంబుగా ప్రార్థించె.

శ్లో॥ "మాతః సప్తజగతాం మధుకైటభారే
వక్షోవిహారిణి మనోహర దివ్యమూర్తే
శ్రీస్వామిని శ్రితజన ప్రియదానశీలే
మాంపాహి దేవి కరుణార్ద్ర విశాల దృష్ట్యా."

అని ప్రార్థింప, సీత ఆ మధురస్వరంబు విని వెనుదిరిగి జూచునంతలో యతివేషమున నున్న రావణుడు సీతను బాగుగాజూచి "భవతీ భిక్షాందేహి" యనెను.

అది విని సీత రావణుని బాగుగా జూచి, యతిరూపము ధరించిన పరమేశ్వరుడో, కాక భిక్షాటన సేయవచ్చిన పరమేష్ఠియో గాకున్న ఈ రూపముండదని దలంచి, లోనికేగి, పశ్చైరమున నీవారధాన్యము, పండ్లు పూలు దెచ్చి నిల్చుని యుండ, రావణుడు లక్ష్మణుడు గీచిన గీటు దాట భయపడి, గీత కావల నిల్చుండియుండెను. అపుడు సీత భిక్షమిడు, వేడుకచే లక్ష్మణ శపథము తలంపక గీతదాటి యడుగిడు నంతలో రావణుడు తన కోరిక నెరవేరిన దను సంతసంబున మనంబున దలంప ఇరువది చేతులు, పది తలలు వచ్చినవి. అది జూచి సీత భయభ్రాంతచిత్తయై క్రింద బడెను. రావణుడు అపుడు సీతను తన దల్లివిధంబున, తనకు మోక్షప్రసాదియినిగా దలచి, తన

బాహువులలో రెండు బాహువులు క్రింది ఆసనముగాను, నాలుగు బాహువులు నాల్గుస్తంభములుగాను, మరిరెండు బాహువులు పైన ఆచ్ఛాదనముగాను జేసి చక్రమేర్పరచి, అందు జానకిని పరుండజేసి. రెండుచేతుల చామరంబులు పూని విసరుచు ఒకచేత గొడుగును బట్టి, మిగిలిన చేతులు రక్షణకు గాను ఆయుధంబులు ధరించి ఆకాశయానంబున పరుగిడుచుండెను. అపుడు గంధర్వులు మొదలగు ఖేచరులు "ఆహా! రామపత్ని రాక్షసునిచే దీసికొనిపోబడుచున్న"దని విచారపడిరి.

అపుడు జటాయు వను గృధ్రరాజు రావణుని ఎదిరించిన, రావణుడు అతని రెక్కలు నరికి ప్రాణావశిష్టుని జేసి క్రిందబడవైచెను. సీతను అవక్ర విక్రమ అప్రతిహతగలిని లంక జేరిచి, ఈ మహాతల్లిని ఎక్కడ విడిది దింపుటయా యని ఆలోచించి, అశోకవనమున గల రత్నమందిరమున నివసింపజేసి, అచ్చట ముక్కోటి దేవతలను గాపుంచెను.

తరువాత రావణుడు ఇంటికేగి, విభీషణుని రావించి, "ఈ దినంబున మన నగరమున గల వారందరూ మహోత్సవము గావింపవలయును" అని ఆజ్ఞ నొసంగి, మందోదరిని బిలిచి, "నీవు స్నానమాచరించి కనకాంబర భూషణాదు లలంకరింపవలయు"నని అనిన, ఇరువది ఏడు సంవత్సరముల నుండి పలకరింపని భర్త ఈనాడు తనకు ఇడిన ఆజ్ఞలను శిరసావహించి, భర్త ఇష్టప్రకారము అలంకరించుకొనెను.

## రావణుడు సపరివార సహితుడయి సీతను జూడవచ్చుట

అనాడు లంకానగరమంతయూ సర్వతోరణంబుల అలంకరింప బడినది. గాయకులు గానముసేయ ప్రారంభించిరి. నాట్యగత్తె లాడ ప్రారంభించిరి. వేదపారణులు నాల్గువేదముల పారాయణ జేయ మొదలిడిరి. కొంత మంది ఉదాత-అనుదాత్త స్వరంబుల ఉపనిషత్తులు పాడుచుండిరి. అట్లుండ రావణుండు భార్యాపుత్ర సహితుడయి విభీషణుడు దోడునడువ, ప్రహస్తాది మంత్రులు బారులు దీరి రాగా, మేఘనాథాదులు సైన్యవిన్యాసంబులు సలుపు

చుండ, ఎన్నడులేని యానందమున ప్రజ లోలలాడుచుండ అశోకవన సింహ ద్వారమునకు జేరి. అచ్చట అందరినీ నుండ నియమించి, ప్రముఖ బంధు వర్గమును మాత్రము గొని లోనికేగి, దివ్యమందిరసుందరంబగు దివ్యకల్ప ద్రుమభూషితము, త్రిస్థాయీ సంచరితము, భవ్యనవరాగ విలసితం బగు సామగానంబున లోకమాతను ప్రార్థించెను.

ఆ ప్రార్థనను విని మండోదరీ మొదలగు కాంత లాశ్చర్యపడిరి. విభీషణాదులు ఇది ఏమని వింతపడిరి. ఆకాశచారులు ఆత్మలయందు గోచ రము గాక ఆవేదనపడిరి. సీత రావణుని సంరంభము జూచి కింకర్తవ్యతా మూఢురాలయి మిన్నకుండెను. రావణుడు సీతాసందర్శనము ముగించు కొని ఇంటికిరాగా, మండోదరి రావణుని దగ్గరి అనునయవాక్యంబుల నిట్లడిగెను.

"ఓ సార్వభౌమా! దానవాధిపా! లంకాధీశ్వరా! మీరు నన్ను వివాహమాడునపుడు మీ తలిదండ్రుల పాదసాక్షిగా జేసిన ప్రమాణము జ్ఞాపక మున్నదా? నిన్ను దప్ప ఏకాంతను-ఎంత సౌందర్యవతియయినా సరే నేను కామించి ప్రేమించి భార్యగా స్వీకరించనని యంటిరే. ఇపు డీకాంత ఎవరు? ఎందులకు దెచ్చితిరి. ఈ కార్యము సేయనగునా?" యని కనుల నీరు నింపుచూ అనియెను.

అది విని రావణుడు చిన్న నవ్వునవ్వి, మండోదరిని తన దొడలపై గూర్చుండజేసి, ఉత్తరీయంబున కనులు దుడిచి, చుబుకమును బట్టి లాలిం చుచూ ఇట్లనియె. "ఓ సుందరీ! నేను నీ వివాహసమయమున జేసిన ప్రతినను ఎన్నడూ దాటను. ధర్మము నతిక్రమించి నడవను" అనెను.

అపుడు మండోదరి మెల్లగా "నాథా! ఇపు డీ కాంతను ఏమి కాంక్షను దెచ్చితిరి. ఈమె యందు మీ కామిత మేమి?" అనెను.

అప్పుడు రావణుడు శూన్యములను జూచుచు "కామితము, అది పరము రహస్యము, అది నా హృదయైకవేద్యము, ఇతరులకు జెప్పరానిది" అని యూరకుండెను.

అంత రావణుండు నిత్యమూ జేయు శివపూజలు మాని త్రికాలముల యందు సీతాసంసేవనా యత్త చిత్తుడయి యుండెను.

అది జూచి కొందరు రావణుడు సీతను కామోద్రేకమున దెచ్చినాడని, మరికొందరు వివాహమాడ దలచి శివధనస్సు నెత్తుటలో భంగపడి, నరుడేమి జేయగలడని రహస్యముగా సీతను దెచ్చి ఆమె యిష్టమునకు ఈ నాటక మాడుచున్నాడని పలువిధముల లోకు లాడుచుండిరని జెమిని చెప్పినంత వాలఖిల్యు లానందబడి, "మహానుభావా। రామరావణ చరితము రమ్యమగు భక్తిప్రధాన మయినది" అని రావణుడు సీతను దెచ్చిన తరువాత రామ లక్ష్మణు లేమిజేసిరో వారి చరితము చెప్పుమన, జెమిని తరువాత జెప్పెదనని సంధ్యావదన సమయమయిన కారణంబున నదీతీరమునకు బోయెను.

తృతీయకాండము సంపూర్ణము

# చతుర్థ కాండము

మాయారూపుడగు మారీచుని జంపి, రాముడు వచ్చుచుం లక్ష్మణు డెదురుబడెను. రాముడు లక్ష్మణుని జూచి ఆవేదనపడి, 'ఏమి లక్ష్మణా! సీత నొంటరిగా వదలివచ్చితివా?'' యని పరుంగు పరుం పర్ణశాలకు రాగా అచ్చట సీత గనుపింపదాయె.

అపుడు రాముడు పెన్నిధిని గోలుపోయిన పేద చందంబున, ద లేని ఆవు విధంబున అల్లాడుచు చెట్టు చెట్టును, పుట్ట పుట్టను, ఆకు ఆకు పొద పొదను వెదకుచూ, "హా జానకీ! హా సీతా! హా మైథిలీ!'' యరచుచూ వనమంతయూ దిరిగి దిరిగి, కానలేక దిగులొంది దిక్కు గలచుజూచుచూ రాముడు లక్ష్మణుని జూచి, "లక్ష్మణా! ఎంత పని తివి. జానకి నొంటరిగా విడచిన కారణంబున ఏ రాక్షసాధముడో అప రించి యుండవచ్చు; లేకున్న సీత ఏమయినది?'' అని అడవి యంతయ వెదుక నారంభించెను.

## రామలక్ష్మణులు జటాయువును జూచుట

అట్లు వెదకుచు వనంబున వచ్చుచుండ దారిలో యొకచోట రెక్క తెగి, రక్తసిక్తాంగుడయి, ప్రాణావశిష్టుడయిన గృధ్రరాజు జటాయువు ప యుండెను. ఆ జటాయువు రూపు లక్షణంబుల రామలక్ష్మణుల గుర్తించి, పెద్దగా పేరుబెట్టి బిలచి నమస్కారమని చెప్పి ఇట్లనియెను:

"ఓ రాజపుంగవులారా! సీతను రావణుడు అపహరించి స్వహ కల్పిత చప్పరంబున గొనిపోవుచుండ నే నడ్డగించితిని. అతడు నా రెక్క నరికి నన్నీగతికి గురిచేసినాడని చెప్పి, మీరలు అన్నగారి భయంబున ఋష మూక పర్వతంబున నున్న సుగ్రీవుని స్నేహంబున రావణుని వధిం

సీతను బొందుడ''ని చెప్పి, ప్రాణములను వదలెను. రాముడు జటాయువునకు అగ్ని సంస్కారమును గావించి, జటాయు వచనంబును మనమున మననంబు జేయుచూ సుగ్రీవుని వెదకుచూ బోవుచుండిరి.

## సుగ్రీవ మైత్రి

ఈ సమయములో ఋష్యమూక పర్వతమున వాలి భయమున దాగిన సుగ్రీవుడు ధనుర్బాణములు ధరించి వచ్చు రాజపుత్రుల గాంచి, వారు వాలి చేత పంపబడినవార లేమో యని భయమంది, తన మంత్రియగు హనుమంతుని బిలచి, వచ్చువారలను జూపించి, ''వారు దప్పక వాలి దూతలే. సందేహము లేదు. వాలి మారువేషముల జటావల్కల ధారులగు వీరులను నను సంహరింప బంపినాడు'' అనెను.

అపుడు హనుమంతుడు మరల పరీక్షించి జూచి, ''సుగ్రీవా! భయమందకు. వారి వాలకముల చూడ వారు వాలి భటులవలె గనుపించుట లేదు. వా రేదో పెన్నిధిని పోగొట్టుకొనిన పేదలవలె నున్నారు. ఎందుకయిననూ నీ విచటనే యుండుము. నేను బోయి వారి ఇతివృత్త మెరింగి వత్తు'' నని, సుగ్రీవుని రక్షక ప్రదేశమున నునిచి, ఆంజనేయుడు మారువేషము ధరించి, ద్వాదశోర్ధ్వ పుండ్రములు ధరించి, శుద్ధ శ్రోత్రియ శ్రీవైష్ణవుని, వలె రూపు మార్చుకొని, రామలక్ష్మణుల కెదురుగా వచ్చి, ''సర్వాపరాధిని, అభివాదయేహం'' అని సాష్టాంగ నమస్కారము గావించెను.

అది విని రాముడు, లక్ష్మణుడు గూడ ఆంజనేయునకు ప్రతి నమస్కారము గావించిరి. అపు డాంజనేయుడు తన యుత్తరీయపు చెంగున గల పండ్లను రామలక్ష్మణుల కిచ్చి, ''అయ్యా! తమ దే యూరు? ఎచ్చట కేగుచున్నారు. కుసుమ సుకుమారులగు మీ రేడ? కర్కశ కఠిన శిలాతలంబగు అడవి ఏడ? మీ రిటు వచ్చుటకు కారణము?'' అని అర్ధోక్తిలో ఆపి, రామలక్ష్మణుల జూచినంత రాముడు కనుల నీరు నింపుట గమనించి, ఊర

డిల్లు డని శాంతబరచి, ప్రశ్నార్థకముగా లక్ష్మణుని జూడ, లక్ష్మణు డిట్లు చెప్ప ప్రారంభించెను.

"మహానుభావా! మేము అయోధ్యాపురాధిపతి యగు దశరథుని పుత్రులము, రామలక్ష్మణులము. తండ్రి యాజ్ఞమేరకు నా యన్న రామచంద్రుడు అడవులకు రాగా, మా వదినెను, శ్రీరామచంద్రుని ధర్మపత్నిని పంచవటియందలి పర్ణశాల నుండి రావణు డను మాయావి అపహరించినాడు. ఆ విషయము మాకు జటాయువను గృధ్రరాజు జెప్పి, సుగ్రీవునితో స్నేహము గావించిన మీ బాధ దీరగలదని చెప్పిన, మేము అతనిని వెదకుచూ వచ్చుచున్నార"మని నంతనే. ఆంజనేయుడు ఆనందబడి, "రండు, నేను సుగ్రీవుని బంటును. మిమ్ముల నాతని వద్దకు గొనిపోవుదు"నని, తాళవృక్ష ప్రమాణమగు తన రూపమును జూపించి. వా రిరువురను తన భుజముల మీద గూర్చుండ జేసి, సుగ్రీవు నొద్దకు క్షణములో జేర్చి, సుగ్రీవునితో వారి వృత్తమంతయూ సవిస్తరముగా జెప్పెను.

అప్పుడు సుగ్రీవుడు, "వాలి తన భార్య నపహరించి, రాజ్యము నుండి వెడలనడిచినాడని జెప్పి, తన భార్యను తన కిప్పించిన, సీతాసతీమ తల్లిని వెదకించి తీసుకొచ్చి మీ కప్పగింతు"నని అనెను.

అది విని రాముడు "వాలిని వధించి నీ భార్య న్నిప్పింతు" ననెను.

సుగ్రీవుడు జానకి జాడ దెలిపికొని, జానకిని సమకూర్తునని ఇరువురు ప్రతిన లాడుకొనిరి. తరువాత మూడు దినము లిద్దరును, ఒకరి సామర్థ్యము లొకరు యెరింగి, మంచి ముహూర్తమున వాలిపై యుద్ధమునకు వెడలిరి.

అపుడు వాలి తన భార్యతో విలాసక్రీడ నుండ, సుగ్రీవుడు గంభీర గర్జనము జేసెను. అది విని వాలి గదాధారుడయి వచ్చి సుగ్రీవునితో తలపడెను. ఇరువురు గదాయుద్ధ మొనరించుచుండ రాముడు ఇరువురిలో సుగ్రీవుడెవరో, వాలి యెవరో కనుగొనజాలక, సంశయాకులిత చిత్తుడయి యున్నంత, వాలి సుగ్రీవుని జావబాద, సుగ్రీవు డా బాధ భరింపజాలక

పర్వతముపైకి పరుగిడి వచ్చెను. రామలక్ష్మణులు అతని వెనుక పర్వతము జేరిరి.

అంత సుగ్రీవుడు రాము ననేక విధముల నిందించెను. రాముడు "మిత్రమా, సుగ్రీవా! మీ రిరువురి హస్తలాఘవములు, రూపములు ఒక్క తీరున నుండ నేను మీ ఇరువురిలో భేద మరయ లేక ఊరకుంటినిగాని వాలిని వధింపలేక గాదు. ఈసారి తప్పక వాలిని వధించెద"నని మందారమాల నొకదానిని సుగ్రీవుని మెడలో గుర్తుగా వేయించి, తిరిగి వాలిమీదకు యుద్ధమునకు సుగ్రీవుని బంపి ధనుష్పాణియై యుండెను.

సుగ్రీవుడు మరల కిష్కింధాపుర సింహద్వారముజేరి సింహగర్జనలు సేయ, వాలి భార్య పోవలదని వారించినను నిలువక, గదాపాణియై వచ్చి సుగ్రీవునితో దలపడిన, రాముడు కోలనేసి వాలిని గూలనేసెను. వాలి నేల గూలి, రాముని జూచి, "ఓరీ, రాజాధమా! చాటుననుండి కోలనేసితివా? ఇంత అధర్మము తగునా?" యని అనేకవిధముల దూషింప, రాముడు వాలి వద్దకు జేరి. "వానర రాజేంద్రా! యిది రాచధర్మము, రాజులకు వేట వినోదము. వేటాడు నపుడు మృగమును ఎదురుగాబోయి కూలవేయగూడదు.

రించి, కిష్కింధకు రాజయి, రాజ్యమేల రాము ననుజ్ఞనొంది, భార్యాసహితు డయి రాముని పాదములపై బడెను.

రాముడు "ఇది వర్షాకాలము. ఇది యుద్ధమునకు తగిన కాలము కాదు. కావున ఈ రెండు మాసములు నీవు నీ భార్యలతో సుఖ ముండు" మని జెప్పి, తాను లక్ష్మణ సహితుడయి ఋష్యమూక పర్వతమునకు బోయెను.

సుగ్రీవుడు ఇరువురి భార్యలతో కిష్కింధా రాజ్య మేలుచుండెను. అని మహర్షి జైమిని చెప్పిన విని, వాలఖిల్యు లానందాతిరేకమున ఆపలి కథ లెట్లు జరిగినవో చెప్పుమన, జైమిని ఇట్లు చెప్ప ప్రారంభించెను.

వర్షాకాలము గడచినది. సుగ్రీవుడు భార్యాసహితుడయి శృంగార లీలాసంభ్రమున ఓలలాడుచు రామునితో చేసిన ప్రతిన మరచెను. అప్పుడు రాముడు వర్షాకాలము గతించి వారము దినము లయినను సుగ్రీవుడు తన యొద్దకు రాకుండుటకు విచారించి, తన పని పూర్తయినది గనుక సుగ్రీవుడు మనలను మరచినాడు. "లక్ష్మణా! నీవు బోయి జ్ఞాపకము సేయుము" మనిన, లక్ష్మణుడు కిష్కింధాపుర సింహద్వారమున నుండి ధనుష్టంకారము గావించెను.

అది విని కిష్కింధలోని వారందరూ ప్రళయకాల పుష్కలావర్త మేఘ గర్జనమా యని భయపడిరి. సుగ్రీవుడు టంకార నాదము విని భయపడి పరుగు పరుగున వచ్చి, లక్ష్మణుని గాంచి, పాదముల బడి, అలస్య మయినందులకు క్షమార్పణజెప్పి, హనుమదాదులను గూడి రాముని సన్నిధికి వచ్చెను.

హనుమంతుడు, "స్వామీ! సీతమ్మ తల్లి రూపురేఖలను మే మిసుమంతయు ఎరుంగము. గుర్తుపట్టుట ఎటులా యని, ఒక వేళ గుర్తుపట్టినను, ఆమెకు మేము రామదూతలము అని నమ్మకము కలిగించుటకు...." అని అర్ధోక్తిలో ఆగిన రాముడు తన చేతి యుంగరమును ఆంజనేయున కిచ్చెను. ఆంజనేయు డా యుంగరమును తన యుత్తరీయమున భద్రపరచి, ముడుపున దాచి, రామునకు మూడు పర్యాయములు ప్రదక్షిణ మాచరించి, అనుమతిగొని రెండు మాసములలో సీతాసతీ వృత్తాంతము వివరముగా దెల్పెదనని శపథము గావించి, వానరేంద్రునకు నమస్కరించి, అంగదులను గూడి ఆకాశమార్గమున దక్షిణదిక్కునకు ప్రయాణ మాయెను, అని చెప్ప వాలఖిల్యులు తరువాత కథ నడిగిరి.

చతుర్థ కాండము సంపూర్ణము.

# పంచమ కాండము

శ్రీరామచంద్రుని వద్దనుండి బయలుదేరిన వానర సమూహము- అంగదాదులు - ఆకాశయానమున అనేక పర్వత కాననంబులను గడచి మహేంద్రపర్వతము జేరి, అందొక గుహలో దూరి దారితెలియక జటాయువు అన్నయగు సంపాతి అను వానివలన రక్షింపబడి, తిరిగి గుహనుండి బయటకు వచ్చి పర్వత శిఖరాగ్రమున గూర్చుండి, ఒకరి నొకరు జూచుకొని 'అయ్యో! కార్యవిలంబమయినది. జానకి జాడ తెలియరాలేదు' అని విచారించి, జాంబవంతుని అనుమతి ననుసరించి, దక్షిణసముద్రము లంఘించి, లంకానగరము జేరిన సీత జాడ తెలియగలదు. అందులకు మనలో సంద్రము లంఘింపగల వీరు డెవ్వరా యని ఆలోచించి, ఆలోచించి, చివరకు హనుమంతుడే అందుకు తగిన దండిమగడని నిశ్చయించి, అందరూ హనుమంతుని సముద్ర లంఘనమునకు బురికొల్పిరి.

హనుమంతుడును వా రిచ్చు యుత్సాహమున సరేనని సముద్ర లంఘనమున కుద్యుక్తుడయి ఇట్లనియె:

"కపీంద్రులారా! మీరందరూ ఈ పర్వతంబున నివసింపుడు. నేను ఒక గంతున సముద్రము లంఘించి, లంకాపురి జేరి, సీత జాడ దెలియుదును. అచ్చటను జానకిజాడ తెలియకున్న ఆ వేగంబున అష్టదిక్పాలక పురంబులు గాలింతును. అచ్చటను సీత గనుపింపకున్న రావణుని నా వాలమున కంటగట్టి రాముని పాదముల వద్ద నుంచుదును" అని ప్రతిన గావించి, హుంకరించి, యొక్కుమ్మడిని సంద్రము లంఘించి, ఆకాశమున మేఘమండల మధ్యగతుండయి బోవు సమయంబున గలిగిన అనేక అవరోధంబులను దాటి, లంకానగరము జేరి, లంఖిణిని జంపి, లంకాపుర రాజవీధులను ప్రవేశించి, ఒక్కొక్క మందిరము గాలించి, చివరకు రావణుని

మందిరమునకు జేరి, అంతఃపురమున నున్న మందోదరిని జూచి, సీతయా యని భ్రమించి, చివరకు అలంకారమును జూచి, భర్తృవియోగమందియున్న జానకి అలంకరించుకొనుట కల్ల. కావున ఈమె జానకి కాదు. అని నిశ్చయించుకొని, నానావిధ సౌధసౌదాంతరముల, ఆరామంబుల, వనంబుల, రహస్యమందిరములను అన్నింటిని వెదకి. వెదకి వేసారి తుదకు ఒకచోట శిలాఫలకమున గూర్చుండెను.

అపుడు రాత్రి మూడుయామములు గడచి నాల్గవజాము ప్రవేశించిన కారణంబున, వందిమాగధులు స్తోత్రంబులు పాడదొడగిరి. నర్తకు లాడ ప్రారంభించిరి. వేదపారణులు వేదపారాయణము సేయుచుండ, నానావిధ వాద్యవిశేషంబులచే రావణుండు గంధమాల్యాంబరధారియై మందోదరి ప్రక్కనడువ, విభీషణాదులతో గూడి అశోకవనము చేరెను.

హనుమంతుడును అంగుష్టమాత్ర శరీరుండయి ఎవ్వరూ తనను గుర్తింపకుండు విధంబున రావణుని వెనువెంట బోయి, అశోకవనమున యొక వృక్షమూలమున నున్న జానకిని చూచెను.

రావణుండును సీతాసతి యొద్దకు వచ్చి, అనేక విధముల బ్రతిమాలాడుచుండెను. జానకి రావణుని మాటలకు బదులిడకుండెను. రావణుడు కొంచెము సేపు సీతను, "అమ్మా! నీవు సర్వలోకాధి దేవతవు. నీ కనవసరముగా యుపవాసములు, మలినాంబరధారిణి అనుచితము" అనునపుడు ఆ మాటలకు అనేకార్థములు గల్పించుకొని. రావణుడు కామోద్రేకమున సీతను దెబ్బెనని వ్రాక్రుచ్చిరి. అంత ఆ రావణుండు కొంతసేపుండి. తిరిగి తన భవనమునకు బోయెను.

సీత రావణుని ప్రవృత్తిని ఎరుంగ జాలక, శ్రీరాముని జాడ తెలియ జాలక చింతించి చింతించి, చివరకు ఆత్మహత్య చేసికొనదలచి, తన పమిట చెరగును మెడకు దగిలించు కొని చెట్టుకొమ్మకు వ్రేలాడగట్ట యత్నింప, హనుమంతుడు అది గ్రహించి మానుషవాక్యంబుల రామచరితంబు పాడ ప్రారంభించెను.

సీత ఆ పాటలను విని ఆనందమంది చెట్టుపైకి జూడ, అంజనేయుడు అంగుష్టమాత్రరూపంబున క్రిందికి దిగి, రామవృత్తాంతమంతయూ ఆమెకు నివేదించి, రాము డిచ్చిన యుంగరమును జూపెను. సీత ఆ యుంగరమును దీసికొని కనులకద్దుకొని, రాముని జూచినట్లు భావించి, కనులనీరు గార్చుచూ, హనుమంతుని శ్రీరాముని గుణగణములను పలుమారు లడిగి, అతడు చెప్ప విని, లక్ష్మణుని రూపగుణసంపదను విని మనస్సున ఆనందమంది, దన తలనున్న రత్నమును దీసి ఆంజనేయున కిచ్చి, రెండు నెలల లోపున రాముడు సకల దానవసంహారము జేసి, నన్ను చేపట్టకున్న నేను ప్రాణము విడుతునని చెప్పు మనెను.

అపుడు హనుమంతుడు, "అమ్మా! రాము నాజ్ఞ కాలేదు గాని, లేకున్న ఈ లంకాపురముతోసహా నిన్ను రాము పాదసన్నిధిని దించెడి వాడ"నన, సీత ఫక్కున నవ్వి, "అంజనేయా! వానరచాపల్యము జూపితివి. అఖండ బల సంపన్నుడగు రావణు డెక్కడ? అంగుష్టమాత్ర శరీరుడవగు నీ వెక్కడ?" అను నంతలో హనుమంతు డవమాన మొంది 'అమ్మా!' యని తన శరీరము పెంప నారంభించెను.

సీత సర్వసన్నిభంబగు ఆ శరీరమును జూచి ఆశ్చర్యపడి, "అంజ నేయా! నీవు సర్వశక్తి సంపన్నుడవనుటలో సంశయము లేదు. కాని రాముని ప్రతాపాదులు లోకమునకు దెలియవలయును గదా! కావున నీవు నా మాటగా రామలక్ష్మణులకు ఈ విధముగా దెల్పుము. రెండు మాసములు దాటిన సీత మీకు లేదు" అనిన అ మాట విని హనుమంతుడు చెవులు మూసి కొని, "అమ్మా! అఖండ వానరబలముతో రాముడు నెలలోపున వచ్చి, దానవ బలమును సంహరించి, నిన్ను కొని పోగలడు. ఇది నిశ్చయము. నా కనుజ్ఞ నిమ్మ"ని అనుజ్ఞపొంది, అశోకవన సింహద్వారమున జేరి, ఒకసారి లంకానగర మంతయూ జూచి, "ఆహా! ఏమి ఈ లంకానగర సౌందర్యము. అమరావతిని మించి యున్నది. రావణ బలము అతీతమయినది. రాము డిటకు వచ్చుట ఎట్లు? వచ్చి ఏమి చేయగలడు?" అని ఆలోచించి, తిరిగి

సమాధానపడి, ఇంతదూరము వచ్చినవాడను లంకాధిపతిని గాంచి మాట్లాడి పోయిన మంచిది అని తలంచి శత్రువు వద్దకు అధికారమున జేరవలయునే కాని, దీనత్వమున జేరరాదు. కావున ఈ వనమును భగ్నము కావించెద.

వనపాలకులను హతమార్చిన రావణుడు నను బట్టి బల్లిదులను బంప గలడు. అపుడు నేను వారికి పట్టుబడినట్లు నటించి రావణ పేరోలగంబుజేరి అతనితో మాటలాడెద. అని నిశ్చయించి అశోకవనమును పాడుచేయ నపు కట్టెను.

అపుడు దాని కావలివారలు రాగా హనుమంతుడు వారిని అందరినీ హతమార్చెను. ఆ వార్త దూతలు రావణునకు జెప్ప, రావణుడు కొంత మంది వీరులను బంపెను. హనుమంతుడును వారిని చంపెను. తరువాత ప్రహస్తపుత్రుల నేడుగురను బంపగా, హనుమంతుడు వారినీ యమపురి కంపి, ప్రధాన ద్వార పైభాగము జేరి, సింహనాదము జేసెను. ఖేచరులు హనుమంతునిపై పూలవాన గురిపించిరి. సురదుందుభులు మ్రోగినవి.

## అక్షయ వధ

అది విని రావణుడు తన పుత్రుడగు అక్షయుని బిలచి, "నాయనా! ఎవరో కోతి అశోకవనమును నాశనము గావించి, ప్రధాన ద్వారపాలకులను హతమార్చి, జంబుమాలి మొదలగువారిని అంతమొందించి, లంకానగరమును రాయిడి పాలు గావించినది. నీవు నీ బలానుగుణ్యముగ వాని పద మణగించి రమ్ము" అన, అక్షయుడు ప్రళయకాల రుద్రునివలె విజృంభించి సింహ నాదము గావించి, రథారూఢుడయి, అస్త్ర శస్త్రధారియై వచ్చి పది బాణంబు లాంజనేయునిపై గురిపించి, సింహనాదంబు గావించెను. ఆంజనేయుడు బాణంబులు వక్షమున దూర వాటిని బలవంతముగా లాగి వేసి, రోష తామ్రాయ తీక్షణుడై, "ఓరీ, రాక్షసాధమా! నేడే నీ కాయువు మూడినది రా!" యని అచటనున్న యొక ఇనుప స్తంభమును ఊడబెరికి అక్షయునిపై విసర, అక్షయు డా యుక్కు స్తంభమును మార్గమధ్యంబుననే తిల ప్రమాణంబున

తుమురు గావించి, ఒక బాణమున వక్షమును, రెండు బాణముల భుజములను, నాల్గు బాణముల ఫాలంబున నేసి ఆంజనేయుని బాధ నొందింప, ఆంజనేయుడు ఆ బాణ బాధాపీడితుడయి ద్విగుణీకృత రోషావేశంబున ఆంపవాన లెక్కసేయక వచ్చి అక్షయుని రథంబును బట్టి ఆకాశమార్గమున విసరివేయ, రథము గిరగిర తిరిగి క్రిందబడెను.

అక్షయు డపుడు కోపోద్రిక్తుడయి, గదాదండమును చేతబూని రాగా ఆంజనేయుడు మరియొక యినుప స్తంభమును చేతబూని, అతని తల పగులనేసి, యమాలయమున కంపెను.

అది జూచి రాక్షససేనలు 'హాహా'కారములు చేయుచూ పరుగిడెను. అట్లు పరుగిడు రాక్షసులను ఆంజనేయుడు తోకను జుట్టి విసరుచుండ, వారు గోపురంబులమీద, సౌధంబులమీద బడి కొంతమంది ప్రాణములు వదలిరి. కొంతమంది ప్రాణావశిష్టు లయిరి. ఈ విధంబున రాక్షస సంహారము గావించుచుండ, కొంతమంది రాక్షసు లేగి రావణునకు ఆంజనేయుని ప్రతాపము నెరిగించి, అక్షయ మరణము దెల్పిరి.

అపుడు మండోదరి అక్షయ మరణమును విని నేల గూలి శోకించెను.

రావణుండును "ఆహా. ఏమి ఈ విచిత్రము. యముని బట్టి నేల గొట్టిన జెట్టి, ఒక వానరముచే హతుడగుటయా? ఆహా, కాలవిధి, వరుణుని బట్టి వాపి బోగొట్టిన రణవిక్రము డక్షయుడు. ఒక కోతిచేత రణమున మృతినందుటయా? వీరాధివీరులగు దానవవీరులు రణమున ఒక కోతి నెదిరింపజాలక భీతిల్లుట - ఎలుకవచ్చి ఏనుగుల గుంపును ఏపడగించినట్లున్నది" అని పరిపరి విధముల శోకింప, సోదర మరణంబు విని, మేఘనాథుడు ధనుర్బాణములు ధరించి, తండ్రికడకు వచ్చి దుఃఖింపుచున్న తల్లినిగాంచి, ఓదార్చి, తండ్రి పాదములకు నమస్కరించి ఇట్లనియె:

"అమ్మా, నాయనా, రాక్షసాధిపా! మీ రానతిడిన క్షణములో బోయి అక్షయు నంత మొందించిన ఆ వానరాధిపుని బంధించి మీ పాదముల

నుంచెద. ఆనతిండ'' నిన మండోదరి తనయుని ఆలింగనము జేసి, తల ముద్దిడి, సర్వవిధంముల విజయుడవు గమ్మని ఆశీర్వదించెను.

తరువాత మేఘనాథుడు తండ్రికి నమస్కరించి, ఆశిషము లంది విభీషణునకు నమస్కరించి, రథ మధిరోహించి, శంఖనాదముల గావించి, ప్రధానద్వారోపరిభాగమున ఫలము లారగించు కోతిని జూచి, "ఓరీ, వానరాధమా, నేటితో నీ కాయువు దీరినది" అని నాల్గు బాణములను వేయగా. ఆంజనేయు డా బాణములను విరిచి, నేలగొట్టి, ఒక పెద్ద రాయినెత్తి మేఘనాథుని వక్షమునకు గురిజూసి విసరెను. అపుడు మేఘనాథుడు ఆ రాతిని మధ్యనే పగులనేసి హనుమంతునిపై యొక ముసలమును ప్రయోగించెను. ఆంజనే డా ముసలమును చేతబట్టి తిరిగి విసర, మేఘనాథుని సారథి కూలెను. అది జూచిన మేఘనాథుడు సారథిలేని కతంబున పెడదారిని బోవు, అశ్వముల నిలువరించి ఒక చేత కళ్ళెముల బట్టి పెరచేత ఆయుధప్రహారముల ఆంజనేయుని గొట్టసాగెను. ఆంజనేయుడునూ భయమందక తనపై వచ్చు రాక్షసులను వాలమున జుట్టి విసరుచూ, శిలలచేత మేఘనాథుని బాదుచూ నాల్గు క్షణములు హోరాహోరి పోరు సలిపెను.

అపుడు ఆంజనేయుడు మేఘనాథుని బాణఘాతంబుల శరీరమునుండి వెడలు రక్తధారలు. గైరిక ధాతువుల ప్రసారితంబగు మహేంద్ర పర్వతము వలె విరాజిల్ల, ఒక ఇనుప స్తంభము పెరికి మేఘనాథు రథంబును, గుఱ్ఱములను జంపి, కేతనము నరికి, చక్రరక్షకుల నాశనము గావించి, సేనల మట్టుబెట్టి సింహగర్జనంబులు సేయ, మేఘనాథుడు రథహీనుడును, చాపహీనుడును అయి, రణరంగమున నిలుచుండి పితామహాస్త్రమును మంత్రించి ఆంజనేయునిపై ప్రయోగింప, ఆంజనేయుడు బ్రహ్మాస్త్రమున ఏడుఘడియలు తనకు బంధనము కలుగు నెరింగినవాడు కావున అయ్యస్త్రమునకు చేతులు జోడించి నమస్కరింప, ఆ యస్త్రము ఆంజనేయుని బంధించినది.

అది జూచి రాక్షసులు ఆంజనేయుని త్రాటగట్టి, ఇంద్రజిత్తు నను మతిని దానవసార్వభౌముడగు రావణుని కొలువుకూటమునకు గొనిపోయిరి.

ఆంజనేయుడు రావణుని జూచి, ఆహా! ఏమి రూపము, ఏమి ఆ ధీరత్వము! త్రిభువన శ్లాఘనీయ మగు అతని రూపమును గాంచి, ఒకవంక ఆనందము, మరియొక వంక ఆక్రోశము మనంబున పెల్లుబికిరా, ధీరచిత్తు డయి సభాముఖమున నిలుచుండెను.

అంత విభీషణాదులు ఆంజనేయుని జూచి, ప్రారబ్ధకర్మమున ఈతడు వానరు డాయెనుగాని, నిజముగా ఏ యక్షుడో కిన్నరుడో అయి యుండ వల యును. లేకున్న కోతి కింత ధైర్యసాహసము లెక్కడివి? అని ఆశ్చర్యపడ సాగిరి.

రావణుడు ఆంజానేయుని గాంచి, "ఏరా, వానరాధమా! నీ వెవడవురా? మా లంకాపురమున కే విధమున జేరితివి. ఇచ్చటకు వచ్చుటకు కారణ మేమి? అశోకవనమును పాడుచేయ నీకు గలిగిన లాభమేమి?" యని గద్దించి యడిగెను.

ఆంజనేయు డది విని అప్పటికి బ్రహ్మాస్త్ర పటుత్వము సడలి యుండు టెఱింగి, ఒక హుంకారమున బంధనముల త్రెంచి తనతోక పెంచి రావణ సింహాసనమునకు మీదు హస్తంబు లున్నతిని సింహాసనము గల్పించి, దాని నధిరోహించి, ఎల్లరూ ఆశ్చర్య భయ సంభ్రమాయత్త చిత్తులు కాగా ఇట్లనియె:

"ఓరీ, దానవాధమా! నేను శ్రీరాముని దూతను. సుగ్రీవుని మంత్రిని. నా తండ్రి వాయుదేవుడు. నా పే రాంజనేయుడు. నీవు రాము డింటలేని సమయంబున జానకి నపహరించి దెచ్చి లంకా నగరమున దొంగ వలె దాచి యుంచితివి. రాముడు లోకాభిరాముడు. ఆతని పత్ని నపహ రింపుట వలన నీవు దండనీయుడవైతివి. నేను రాము నాజ్ఞచే సీతాన్వేషణము నకు వచ్చి అశోకవనమున సీతను జూచితిని. నీ బంట్లు నన్ను బంధింపరా, వారిని హతమార్చితిని. నిను జూచు వేడుక మనసులో ప్రలోభపరుప నీ కుమారు నక్షయుని హతమార్చితిని. బ్రహ్మాస్త్రంబున పట్టుబడి నీ కొలువు కూటము జేరితిని. రాముని ఆజ్ఞ లేనందున ఊరకుంటిని. లేకున్న నిన్ను

సహపుత్ర బంధు మిత్ర కళత్ర బాంధవంబుగా ఈ లంకా నగరంబును త్రికూట పర్వత సహితముగా కొనిపోయి యుందును. రాము నాజ్ఞ లే నందున దీనుడనయి నీ ఎదుట నిలచితి''నని గంభీరముగా బలుక, రావణుండు క్రోధ మూర్ఛితుండయి, "ఔరా, ఈ వానరమున కింత అహంకారమా? ఇంద్రాదులచేత ఊడిగము లందు దానవ సార్వభౌముని ఎదుట వాలమున ఆసన మొనరించి, జంకు బొంకు లేక 'ఓరీ' యని సంభోధించిన ఈ వానరుని శక్తి నేమందును. వాలి సుషేణాది వానర వీరుల నెందరినో మును పెరి గుంటిని. వారి యం దీ ధీరత్వము నెన్నడూ జూడలేదు. ఈతని కింత పరా క్రమము గలుగుట జూడ, నాదర మహాముని వచించినటుల, శ్రీరామ నామ స్మరణమే ఈతని కింత శక్తిని గలిగించిన దనుటలో సందేహము లేదు. ఖేచరుల కయినను దాట నలవిగాని సంద్రమును దాటి, దేవ దానవ గరుడ గంధర్వ యక్ష కిన్నరుల కలవిగాని లంకాపురము జొచ్చి, లంఖిణిని హత మార్చి, అక్షయాది శూరుల నవలీల నెదిరి, దురమున సంహరించెనన అంతయూ ఆది స్వరూపుడయి అవతరించిన ఆ శ్రీరామనామ సంస్మరణము వలన గలిగిన శక్తి. నిరంతర భగవన్నామ స్మరణ సేవాదురంధరుల కలవి గాని కార్యము భూమి నుండదు. కానిమ్మ. ఈతనిని ఊరకే విడువరాదు'' అని విభీషణుని జూచి, "ఈతనికి మరణదండన విధింపు''మనిన, విభీష ణుడు ప్రహస్తుని ముఖ మవలోకించి, రావణుని కెదురై నిలిచి "ప్రభూ! ఏ దుష్కృతము గావించిననూ దూత అవధ్యుడు. కావున ఈతనికి మరేదయినా శిక్ష విధింత''మనెను.

అది విని రావణుడు, "వానరమునకు తోక ప్రీతియగు వస్తువు. కావున ఈతనిని తోకలేని వానినిగా జేయుడు'' అనెను.

అప్పుడు విభీషణుడు "ఈతని తోకకు నిప్పంటించిన ఈతడు మర ణించిన మరణించవచ్చు. అందువలన రాజధర్మమునకు విరుద్ధము లేదు'' అని ఆంజనేయుని తోకకు గుడ్డలు చుట్టుమని భటుల నాదేశింప, వారు లంకా నగరమున నున్న చీరెలు, ధోవతులు ఎన్ని జుట్టిననూ ఆంజనేయుని తోకకు

చాలకుండెను. అపుడు రాక్షసులలో నొకడు 'సీత చీరదెచ్చి జుట్టుమ'నిన అది విని ఆంజనేయుడు తోక నుపసంహరించెను.

అంతట రాక్షసులు తోకను తైలమున ముంచి, నిప్పంటించి ఆంజనేయుని త్రాటగట్టి వింతమృగమును జేసి, వీధుల ద్రిప్పదలంచిరి. ఆంజనేయుడు తన తోకకు నిప్పు రగులుచుండ బాధను నటించి, తనను బట్టిన దానవులను విసిరి నేలగొట్టి పురవీథుల నెగురుచూ, సౌధంబుల నగ్నిని ముట్టించుచూ, లంకానగరమంతయూ గాల్చుచుండెను. అపుడు రత్నమందిరములు నేల గూలినవి. ప్రాసాదంబులు భగ్నమయినవి. సింహద్వారములు చిచ్చునకు కుమిలినవి. అందలి రాక్షస సమూహముల హాహాకారములు మిన్నుముట్టినవి. అశోకవనమంతయూ సీత నివసించు ప్రదేశము దప్ప మిగిలినవి నిప్పులో నీల్గినవి. అదియంతయూ జూచి ఖేచరులు ఆంజనేయునిపై పూలవాన గురిపించిరి.

ఆంజనేయు డీ విధమున లంకానగరము దగ్ధము గావించి, తన వాలంబును సంద్రంబున ఆర్పుకొని, ఒకసరి త్రికూట పర్వత శిఖరము నధిరోహించి జూడ, లంకానగర మంతయూ రాణవీడి, భర్తృవియోగమున ఆభరణ రహితమయిన విధవవలె కళాహీనమయి కనుపించెను. అప్పు డాంజనేయుడు సీతామహాతల్లి కేదయిన ఆపద సంభవించనా యను దలంపున జానకి దరికి వచ్చి ఆమె సురక్షితముగా నుండు టెరిగి, సంతసించి, శ్రీరామనామ సంస్మరణ జేయుచూ సీతాసతికి పాదాభివందనముజేసి, తిరుగు ప్రయాణమున కనుమతి నంది, రెప్పపాటు కాలమున మహేంద్రపర్వతము జేరెను.

## జాంబవంతాదులు ఆంజనేయుని లంకానగర విశేషము లడుగుట

సిద్ధహస్తుడై వచ్చిన హనుమంతుని జూచి, వానరులు ఆనందమంది హనుమంతుని కనేక ఫలము లిచ్చి, ఫలరసంబు లిచ్చి గౌరవించి,

అందరూ అంగద, జాంబవంతుల అనుమతిని తగిన విధంబుల కూర్చుండి యుండిరి.

అపుడు జాంబవంతుడు అంజనేయుని యెదుర గూర్చుని యిట్లనియె:

"హనుమంతా! నీవు వానర కులమునకు శిరోభూషణము వంటి వాడవు. నీవు లంకానగరము నే విధమున జేరితివో, ఏ విధంబున సీతామ తల్లిని జూచితివో ఆ విధం బంతయూ ఆమూలాగ్రంబుగా నెరిగింపు" మనిన, హనుమంతుడు అందరినీ యొక్కసారి పరికించి చూసి, అంగదుని దగ్గరకు బిలచి, అతని భుజమున చేయిడి, ఇట్లు చెప్ప ప్రారంభించెను.

"నేను మీ అనుమతిని సంద్రంబు లంఘించి పోవునపుడు నన్ను ఛాయ అను రక్కసి అవరోధింప, దానిని సంహరించి పోవుచుండ, మైనా కుడు కనుపించి తన శిఖరమున నిలువమనిన, నిలువనని సాయం సమయ మునకు లంకాలగరము జేరితిని. అచ్చట సింహద్వారమున లంఖిణి యను స్త్రీ నన్నడ్డగింప, దానిని ముష్టిప్రహారమున యమపురి కనిపి, ఆ రాత్రి యంతయూ లంకానగరము ద్రిమ్మరి, ద్రిమ్మరి, జానకిని గానక దిగులందు చుండ, బ్రాహ్మీ ముహూర్తమున రావణుడు పాదచారులగు విప్రపుంగవులు తన్ను గొలువ, నాట్యకత్తె లాడ, సంగీత విద్వాంసులు పాడ, మందోదరీ, మేఘనాథులు వెంట రా, అఖిల విభవంబున పురరాజవీధిని పాదచారుడై వచ్చుచుండుట జూచి, ఏమియా యని తలంచి, అతని వెనుక అంగుష్టమాత్ర శరీరుడనయి అశోకవనము జేరి సీతను గాంచితిని. రామముద్రిక నిచ్చి, ఆమెకు రామలక్ష్మణుల తీరులు వివరించి, ఆమెనుండి ఈ రత్నమును గొని వచ్చితి" ననెను.

అపుడు జాంబవంతుడు రావణుని రూపురేఖా విలాసాదులు ఎట్లుండె ననిన, అంజనేయుడు ధీరచిత్తుడయి, గంభీర నాదంబున నిట్లనియె:

"జాంబవంతా! మీ రందరూ శ్రీరాముని జూచియే యుండిరి.

రాముని గుణగణ పరాక్రమము లెరిగిన వారే మీరు. రామునందు ఏ సుందర రూపము గలదో రావణునందు అదియే రూపము. రామునందు ఏ వీర ధీర ప్రతాపములు శోభిల్లుచున్నవో, రావణునం దా రూపములే ప్రతిఫలించు చున్నవి. వేయేల రామరావణులలో భేద మొక్కటియే గలదు. అది ఏదనిన బ్రహ్మదత్తమగు తలలు రావణునకు పది గలవు. అట్లే చేతు లిరువది. అదియే రామరావణులలో భేదము'' అనినంతనే ఆంజనేయునిపై పూలవాన గురిపినది. సుర దుందుభులు మ్రోగినవి. అంత నందరును అంగ దానుమతిపై పయనమయి మధువనంబు జేరి మార్గాయాస ముపశమింప, మధువనంబున దిగి, విడిది జేసి అంగదాభిమతంబున అందలి మధు ఫలాదు లారగింప, దాని కావలా వారలు నిరోధింప, వారలను దండించిరి.

అపుడు సుగ్రీవుని మేనమామ యగు మధువన ప్రధాన పాలకాధికారి యగు వానరుని దండింప, వాడు పరుగుపరుగున బోయి, ఋష్యమూకమున వున్న సుగ్రీవుని జేరి, అంగదానుమతంబున ఆంజనేయాదు లొనరించిన దుండగ కార్యమును వినిపింప, సుగ్రీవుడు "కార్యదక్షులగు వారు మధు వును త్రాగనిమ్ము. వారిని వారింపక వేగ రమ్మనమని సుగ్రీవు నాజ్ఞగా దెలుప'' మనిన, దధిముఖుడు వచ్చి అంగదాదులను పరామర్శించి, తా నిది వర కాచరించిన తప్పిదముల మన్నింపగోరి, వానరులకు గావలసిన మధు ఫలంబుల నిచ్చి ఆనందపరచి పంపెను.

అపుడు వానరులందరూ పెద్ద, పెద్ద కేకలు వేయుచూ, పాటలు పాడుచూ ఆనందముగా రాముని సన్నిధానము జేరిరి. సుగ్రీవుడు వారి నంద రినీ జూచి కుశలప్రశ్న లడుగ, రాముడు ఆంజనేయుని దగ్గరకు బిలచి మందస్మిత వదనారవిందుడయి, అందరూ విన నిట్లనియె:

"ఆంజనేయా! నీవు దలంచిన కార్యము లేవయినను నిర్విఘ్నముగా సంపూర్తి కాగలదు'' అని సీత ఎటులున్నదనిన, ఆంజనేయుడు సీత

వృత్తాంతమంతయు దెలిపి, తన బొడ్డున భద్రపరుపబడిన రత్నమును దీసి రాముని కీయ, రాము డది దీపికొని హృదయమునకు హత్తుకొని కనుల వెంట నీరు గార్చుచు సుగ్రీవాదుల జూచి నిట్లనియె:

"వానరేంద్రా! ఈ రత్నము నా సవతితల్లి యగు కేకయ రాజపుత్రి కకు ఆ జగన్మాత ప్రసాదించిన పెన్నిధి. దీనిని కైక నా వివాహ సమయ మున జానకికి యిచ్చినది," అని నంతనే వానరు లందరూ పరమానంద బడిరి.

శ్రీరాముడు ఆంజనేయుని జూచి మందస్మిత మధుర స్వరంబున నిట్లనియె: "అంజనేయా! లంకానగరమున గల రాక్షససేన ఎంతయో, అందలి యోధుల సంఖ్య ఎంతయో, తరువాత లంకానగరమున నివసించు వారల ప్రవృత్తి ఎటులుండునో ఆ విషయమును సవివరము దెల్పుచూ, రావణుని రూపురేఖా విలాసములు, వీర విక్రమ లక్షణములు దెల్పు"మనిన అంజనేయు డిట్లనియె:

"శ్రీరామచంద్రా! లంకానరమున గల రాక్షససేన లిన్ని యని జెప్పుటకు ఎవరికీ సాధ్యముకాదు. సముద్రంబున వచ్చు కెరటము లెన్ని వచ్చును. ఆకాశమున గల నక్షత్రముల నెన్ని లెక్క చెప్పవచ్చుగాని రావణ సేనల నెన్న ఆ యాదిశేషునకైననూ తరము గాదు. లంకా నగరమందు గల వారందరూ, పురుషులు వేదపారణులే. నిత్యాగ్నిహోత్ర నిష్టాగరిష్టులే. త్రికాల ఈశ్వరసేవా దురంధరులు. స్త్రీలు నిరతసామగాన కళాప్రియులు. భర్తృసేవా పరాయణులు. లంకానగరమున ఏ రచ్చ చూచిననూ వేద వేదాంత న్యాయేతర మీమాంసావాదనలే జరుగుచుండును. వీధివీధులయందు పరమేశ్వర సర్వమంగళ ప్రతిష్టాపితములగు ఆలయములు ప్రతిష్ఠింపబడి నవి. అందు త్రికాలములయందు యథావిధి పూజాదికములు జరుగు చుండును. కాని దానవులందు ఎన్ని సుగుణము లున్ననూ దయా సత్య శౌచములు గానరావు. ఇంక లంకేశ్వరుని రూపురేఖలు ఒక్క మాటలో జెప్పెద. రామునం దేరూప మున్నదో, శ్రీరామచంద్రుని యం దే

సుగుణము లున్నవో అవి యన్నియూ రావణుని యందు మూర్తీభవించి ప్రతిఫలించినవి. రామరావణులకు సౌందర్యమున, సౌభాగ్యమున, సారస్వత మున, వీర ధీర శౌర్య ప్రతాపముల రామునకు సాటి రావణుడే. రావణునకు దీటు రాముడే. రామరావణులను దెల్ప పరబ్రహ్మకేనియు అలవికాదు. కాని ఒక భేదము. రాముడు దైవ స్వరూపుడు; రావణుడు కర్మరూపుడు. ఇది నాకు దెలిసిన సంగతి" యని ఆంజనేయు డూరకున్న రాముడు కొంచెము సేపాలోచించి సుగ్రీవునితో నిట్లనియె:

"సుగ్రీవా! రేపు బ్రాహ్మీ ముహూర్తమున వానర సేనలను తరలిం పుము" అనినంతనే సుగ్రీవుడు అంగద, జాంబవంత, సుషేణాది వీరులను జూచి సేనలను తరలింపుమని యానతిచ్చెనని జెమిని చెప్పిన వాలఖిల్యు లానందబడి ఆవలి వృత్తాంతము జెప్పమనిరి.

పంచమకాండము సంపూర్ణము

# షష్ఠము కాండము

తరువాత జెమిని ఇట్లు జెప్పదొడంగె.

సుగ్రీవుని అనుమతిని రామలక్ష్మణులు అంగదుని సకల వానరసేనలకు నాయకుని గావించి, లంకానగరమునకు ప్రయాణమయి, కతిపయ ప్రయాణంబుల సముద్ర తీరమును జేరిరి. శ్రీరాముడు ఈ వానరమూకలను సంద్రము దాటింపుటెట్లా అని ఆలోచించుచూ సముద్రపు యొడ్డున - ఇసుక దిన్నెల - నొక శివలింగమును జేసి, ఆ శివలింగమునకు యథావిధిని ధూప దీప గంధ మాల్యాక్షతల బూజ గావించి, సముద్రుని ప్రార్థింప, సముద్రుడు తన యల్లు డరుదెంచెనను యానందమున యుప్పొంగి తన కెరటముల రాముడు గావించిన శివలింగమును ముంచి, వానరులను తకబిక గావించి, రామునకు తలమునకల నీరు నింప, వానరులు ఆ కెరటముల ధాటికి ఆగలేక మునుగుచూ, తేలుచూ, "హా రామా! హా సుగ్రీవా! హా రామా!" యని పెద్దగా కేక లిడ, రామునకు కోపము వచ్చి లక్ష్మణుని కద్దనున్న ధనువును లాగి చేతబట్టి సంద్రమును ఇంకజేతునని విల్లు నెక్కిడి, బాణము సంధింప సముద్రుడు మానవ రూప మంది, ఇరువురి భార్యలతో రాముని పరామర్శించి, "స్వామీ! నీవు వచ్చితివను ఆనందమున యుప్పొంగితిని గాని నీకు గానీ, నీవారికి గానీ అపకారము జేయ దలంపున కాదు," అని క్షమార్పణ జెప్పి, "నీ సేనలలో నున్న వానరుల చేత శిలలు నీట బడవేయింపుము, వానిని మునుగకుండ జేతు"నని చెప్పి అంతర్ధానమాయెను.

రాము డా సంగతి సుగ్రీవునకు దెల్ప, వానరులు సుషేణానుమతిని రాలను దెచ్చి సంద్రమున వేయ నీటిపై దేలి వారధి తయారాయెను. ఆ వారధి గట్టిగా యున్నదో లేదో యని పరీక్షింప దలంపున ఆంజనేయుని

బిలిచి పరీక్షింపు మనిన, ఆంజనేయుడు దానిని పరీక్షించి గట్టిగా నున్న దనెను. వారధి సరిగా నున్నందున దానిపై వానరసేనలను నడువ నాజ్ఞ యిడెను. వానరసేనలు దానిపై నడువ, ఆంజనేయుడు ఇరు భుజంబుల రామలక్ష్మణుల నధిరోహింపజేసి, సంద్రము నధిగమించి, త్రికూట పర్వత శిఖరాగ్రమునకు జేర్చెను. వానరులును నానావిధ ఫల మధు భక్ష్యములు గలిగిన ఆ త్రికూట పర్వతమున గల వృక్షంబుల గల ఫలాము లారగించి హాయిగ నుండిరి.

అపుడు రాముడు సుగ్రీవ, జాంబవంత, ఆంజనేయుల అనుమతిని అంగదుని బిలచి, రావణు నొద్దకు రాయబారము అంపెను. శ్రీరాము నాజ్ఞమేరకు రావణు నిండు పేరోలగము జేరి, తన గోత్ర నామంబులు దెలుప, రావణుడు అంగదుని అర్ధాసనమున గూర్చుండజేసి ఇట్లనియె:

"అంగదా! నీవు వాలి పుత్రుడవు. రాముడు నీ పినతండ్రి కోరిక మేరకు నీ తండ్రిని సంహారించిన క్రూరుడు. నీ వాతనిని సేవింపవచ్చునా?" యనెను.

అపు డది విని అంగదుడు "అది ఇపు డప్రస్తుతము. నేను సుగ్రీ వాజ్ఞను రామదూతనై నీ వద్దకు రాయబారమును దెచ్చితిని. కావున నీవు నా రాయబార విషయములను విని నీవు చేయునది సవిస్తరముగా దెల్పుము" అని ఇట్లు చెప్ప ప్రారంభించె.

"నీవు రాముడు లేని సమయమున సీత నపహరించి దెచ్చుట క్షమింపరాని యపచారము అయిననూ రాముడు ధర్మాత్ముడు గావున నిన్ను రక్షింపదలచి నన్ను నీ వద్దకు రాయబారిగా పంపెను. నీవు సీతమ్మ తల్లిని రామున కప్పగించి, రాముని పాదముల బడి క్షమాపణ వేడిన, నీవు నీ పుత్ర మిత్ర బాంధవ సహితంబుగా సుఖంబుండ గలవు. లేకున్న అంతకాలయము జేరగలవు. ఒక్క ఆంజనేయుడు లంకలో కాలిడి ఏమి గావించెనో నీకు దెలియును గదా. ఇపు డనేక అర్బుదసంఖ్యల నొప్పు వానరవీరులు వచ్చి యున్నారు. రామ బాణముల ధాటికి నీ వాహూతి గాక మునుపే శ్రీరాముని

శరణువేడి సుఖముండుము. లేకున్న నిన్ను వధించుట నిక్కువము"
అని చెప్పినంత రావణుడు విభీషణుని ముఖ మవలోకించి, ప్రహస్తుని
పలుకరించి, నయగంభీర వచనముల నిట్లనియె:

"అంగదా! రణమున జయాపజయముల నిర్ణయించుట నెవ్వరికి తరముగాదు. కాని ధర్మాధర్మములు నిర్ణయించుట సాధువులకు సులభమగు కార్యము. నేను రాముడు ఇంటలేని సమయమున సీతను దెచ్చినది నిజము. ఏలనన జనకుడు రాజకంఠీరవుడు. తన కూతురగు జానకిని రామునకిచ్చి వివాహము గావించినాడు. రాముడు జానకితో హాయిగా అయోధ్య నుండక అరణ్యములకు వచ్చి సీతను కష్టములపాలు జేయుట ధర్మమా? రాము డెంత అవని పాలకుడో నేనును అంత పాలకుడను గావున అపరాధియగు రాముని దండింపనెంచియే సీతను దెచ్చితిని. పార్వతీ పరమేశ్వర నిలయమై నానావిధ పుష్పఫల వృక్షమండితంబయిన అశోకవనంబున నానావిధరత్న రమణీమయ మండితంబయిన ప్రాసాదంబున కాపురముంచి సకలదేవతా సమూహంబును సీతకు కాపునునిచి, నిత్యము సేమమరయుచుంటిని. భర్తృవియోగమున పడతులు పరివేదన బడుట ధర్మదూష్యముకాదు. నిజముగా రామునకు నాతో సంధిచేసుకొనవలయునని తలంపున్న నేను సీతామతల్లిని దెచ్చి రాముపాదముల నునిచెద. రాముడు సీతాసహితుడై ఈ లంకానగర సామ్రాజ్య సింహాసన మధిరోహించి, చతుర్దశ భువనముల నేలవలయును. నేను సర్వ సేనాధిపతిగా నుండెదను. అందులకు రాము డిచ్ఛగించిన, సీతను నీవు జెప్పిన విధంబున రామునకు సమర్పింతును. ఇది నా నిశ్చయము. కాకున్న నేను దుర మొనరింపక మానను" అని దృఢముగా జెప్ప, అంగదు దది విని ఈ విషయమును రామునకు దెలిపెదనని ప్రయాణమయి వెళ్ళెను.

అపుడు రావణుడు సకల రాక్షస నివహంబును సభజేసి ఇట్లనియె: "ఓ దానవులారా! మీ రందరూ ఇంతవరకూ నా వెనుక నిలచి నన్ను అధిపునిగా జేసిరి. ఇపుడు నేను గావించిన అకార్యమో, సుకార్యమో, సీతాపహరణ వలన పెద్ద యుద్ధము సమకూరినది. రాముడు శివచాప భంగమును

బట్టి జూడ అఖండ బలపరాక్రముడనుట నిశ్చయము. అతనికి దోడు అనేక సహస్ర పరిమితంబులగు వానర సేనలు సంగరమునకు వచ్చి యున్నవి. ఇది వరకు ఒక్క అంజనేయుని వలన లంకానగర మంతయూ భగ్నమయిన సంగతి మీ రంద రెరిగినదియే కదా! ఇపుడు సంప్రాప్తమగు ఈ ఘోర సంగ్రామంబున ధర్మాధర్మ నిర్ణయము మీరే నిర్ణయించుకొని జయమో, మరణమో రెంటికిని ఇష్టపడిన యుండుడు; శక్తికొలది పోరుడు. లేకున్న రాము నాశ్రయించి సుఖంబునందుడు. మీ యిష్టము. నేను ఆ మరణాంతము పోరు సల్పక మానను. యిది నా నిశ్చయము" అనినంత విభీషణుడు అన్న కెదురు నిలువబడి ఇట్లనియె.

"అన్నా, నీవు సకల దానవ సార్వభౌముడవు. సకల శాస్త్రనిష్ణాతవు. సకల ధర్మ పరిపాలకుడవు. రాముని భార్యను దెచ్చుట ధర్మదూరము. అయినను నీవు దానిని దలంపక రామునితో రణరంగమున పోరాడ నిశ్చయించుట అధర్మము. "అధర్మే నిధనం నిత్యం" అనునట్లు అధర్మవర్తనులకు చావు తప్పదు. ఒక్క కోతికి మన సేనలు బదులిడ లేక లంకానగరము నాశనమయినది. అదియంతయూ అధర్మమువలన గలిగిన హానిగాని వేరు గాదు. నీవు సకలదానవ సంక్షేమము దలచితివేని సీతను రామున కిచ్చి పాదములబడి క్షమాభిక్ష వేడుము. లేకున్న నీ యనిధనము ఖాయము" అనినంతనే రావణుడు తమ్ముని దగ్గరకు తీసికొని, తలముద్దిడి "విభీషణా! నీవు వచించినది ధర్మబద్ధమే కాగలదు. కాని నా కోరిక ఒక్కటియే. 'కర్మశక్తి గొప్పదా? దైవశక్తి గొప్పదియా' అను సంశయము దెల్పుటకే నేను నిశ్చయుడనై యున్నాను. నాకు గావలసినవి రెండు. అందొక దానికి సమాధానము సమకూరినది. ఎరింగితిని. సంశయ నివృత్తి యయినది. అది ఏమన దైవము గొప్పదా? దైవ నామ సంస్మరణ గొప్పదా? యను సంశయము దీరినది. దైవముకన్న దైవనామస్మరణము బలమయినదని నిశ్చయించితిని. ఇక కర్మశక్తి, దైవశక్తిలో ఏది గొప్పదో తేలవలయును. అందుకొరకు నేను రామునితో పోరక మానను."

అపుడు విభీషణుడు "నీ వాచరించునది అధర్మముగావున నిను వీడి పోయెద"నని అన్నపాదములకు నమస్కరింప, రావణుడు "మనోభీష్టసిద్ధిరస్తు" అని ఆశీర్వదించి, కనులనీరుతో విభీషణుని తలను అభిషేకించి, తలను ముద్దిడి, "నాయనా, సోదరా, విభీషణా! ఇదియే నీకు లంకానగర సామ్రాజ్యాభిషేకము పొమ్మ"న వాని దీవించెను.

## విభీషణుడు రాముని జేరుట

అంత విభీషణుండు పాదచారియై త్రికూటపర్వత శిఖరాగ్రముననున్న శ్రీరాముని పదసన్నిధిని జేరి "శరణాగతోస్మి, రక్షమాం, రక్ష" అని ముమ్మారు పలికి శ్రీరామచంద్రునికి సాష్టాంగ నమస్కారము గావించెను.

అపుడు సుగ్రీవుడు నీవెవరవన, విభీషణుడు వినయ వినమ్రుతాంగుడై, "నేను రావణుని తమ్ముడను, విభీషణుడను నామధేయుడను, రావణు డొనరించిన సీతాపహరణ కార్య మధర్మమని తెల్ప ఆగ్రహించి, దానవ సార్వభౌముడు నన్ను రాజ్య బహిష్కృతుని గావింప, లోక రక్షకుడగు శ్రీరామ పదసేవాయత్తచిత్తుడనై వచ్చియున్నాడ" అని సంతనే, సుగ్రీవుడు ఫక్కున నవ్వి, "ఓరీ దానవాధమా! నీ యన్న భిక్షుక సన్యాసిరూపమున పర్ణశాల ప్రవేశించి సీతమ్మ తల్లిని అపహరించినవాడు. నీవు శరణాగతుని విధమున జేరి శ్రీరాము ప్రాణము లపహరింప వచ్చితివా? తులువా?" యని గద పైకెత్త, ఆంజనేయుడు గదాదండము పట్టుకొని, "సుగ్రీవా, ఆగుమాగుము" అనినంత సుగ్రీవుడు ఆంజనేయుని గద్దించి, "హనుమంతా! నీ వాగుము. ఈతడు కపట నాటకము నటించుచున్నాడు. 'తలగడిగి బాసలిచ్చిన, ఖలదైత్యుల నమ్మరాద'ని శాస్త్రములు వాపోవుచున్నవి. కావున ఈతనిని తొలుత పరిమార్చి, తరువాత సీతని యన్నను సహపుత్రబాంధవ సహితంబుగా యమపురమునకు బంపుదము" అనునంత ఆంజనేయుడు ముందునకు వచ్చి, విభీషణునిచేయి తనచేతిలోనికి దీసికొని రామునకు ఎదుర నిలచి, "స్వామీ, శ్రీరామచంద్రా! వానరాధిపా! ఈతడు ధర్మాత్ముడు.

సత్యసంధుడు. నియమనిష్టాగరిష్ఠుడు. దయా సత్య శౌచ దానశీలుడు. ఈతడు అగుటకు రావణుని తమ్ముడేకాని ఈతనియందు అన్నియు సుగుణములే. నేను లంకానగరమున రావణుని పేరోలగముజేర, నన్ను సంహరింపుమని అచ్చటి పెద్దలందరూ పలుక రాక్షసరాజేంద్రుడగు రావణుడు వారి మాటలకు తలయూప, నన్ను సంహరింప ఆజ్ఞ ఇడ, ఈతడు అన్నపాదముల ప్రణమిల్లి ధర్మవచనంబులుపలికి. అతనిని సమ్మతింపజేసిన పుణ్యమూర్తి. సీతాపహరణము అకార్యమని పలుతడవులు ఈతడు పల్కుచుండినను రావణుడు దానిని లెక్కసేయకున్నాడు. ఇపుడు అంగదుని వాక్యములు విని రావణు డాగ్రహించిన ఈతడు వారించి యుండవచ్చును. సర్వశాస్త్రపరిజ్ఞాత యయినను రావణుడు పరమమూర్ఖుడు. కావున సీతనిని దండించియుండ వచ్చును. ఈతడు ధర్మపాలకుడుగాన మనల జేరవచ్చెను. కావున ఏది ఎట్టయినను. ఆపద మునింగి శరణన్న వానిని కాపాడుట వీరలక్షణము. కావున ఈతనిని కాపాడమని నామనవి,” అని బలుక శ్రీరాముడు విభీషణుని దగ్గరదీసి “నాయనా, విభీషణా! భయపడకుము. నే నిదివరకు ముగ్గురు తమ్ములకు అన్నను. ఇపుడు నీవు, సుగ్రీవుడు జేరిన కారణంబున ఐదుగురకు అన్నను” అని నంతనే విభీషణుడు ఆనందమంది, రామునకు నమస్కరించి, లక్ష్మణు నాలింగనముజేసి, సుగ్రీవుని కౌగలించుకొని, అంగద, జాంబవంతాది వానరుల తగువిధమున గౌరవించి యుండెను.

అపుడు శ్రీరామ నసుమతిని వానరపుంగవులు రణభేరిని మ్రోగించిరి. శంఖనాదంబు గావించిరి. లక్ష్మణుడు ధనుష్టంకారము జేసెను. శ్రీరామచంద్రుడును ధనువును సారించి, శంఖమునూది, సుగ్రీవుని జూచి “వానరరాజేంద్ర! ఇక సంగరమునకు సంసిద్ధము కండు. లక్ష్మణా! నీవు వీరులను జాగ్రత్తగా జూచుచుండవలయును. అంగదా! నీవు సర్వసేనానాయకుడవై, శత్రువులను దునుమాడుటయేగాక, మన సేనలను పరులవాత బడనీయక కాపాడవలయును. జాంబవతాదులు నీకు సహాయులుగా నుందురు. సుగ్రీవా! నీవు నా పజ్జనుండి మన సేనలను జాగ్రత్తగా నడిపింపుము.

విభీషణా! నీవు లక్ష్మణుడు, సుగ్రీవుడు అతి జాగరూకులై యుండి, మన సేనలను గాపాడుట, పరసేనలను సంహరించుటలో అతిజాగరూకులై యుండవలయును సుమా!" యని అంగద పురస్సరముగా రణమునకు బయలు వెడలిరి అని జైమిని చెప్ప, వాలఖిల్యు లానందమంది ఇట్లనిరి.

"మహానుభావా! జైమిని మునీంద్రా! విభీషణుడు పోయిన వెనుక రావణుడేమి జేసె"నన, జైమిని ఇట్లు చెప్ప ప్రారంభించెను.

## రావణుని యుద్ధ సన్నాహము

విభీషణుడు వెళ్ళిన తరువాత రావణుడు కొలదిక్షణములు విభీషణుడు బోయిన దిక్కును జూచుచూ చిత్రప్రతిమవలె చలనరహితుడై నిలుచుండి యుండి. కన్నుల నీరుమున్నీరై యొలుక "ఆహా! కాలమహిమ గడవరానిది. నాకు ఆరణప్రాణమయి, అఖిల ధర్మస్వరూపుడయి. అనవరతము నా క్షేమ మరసెడివాడు, నా ఆత్మకు ఆత్మ, నాబహిఃప్రాణము, నా సోదరుడు నన్నెడ బాసినాడు. ఇదియొక విధమున ఆనందబడవలసినదైననూ మరియొకవిధమున అశనిపాతమువలె ఆత్మను ఆవేదన బరపుచున్నది" అని తలంచి మేఘనాథా దుల బిలచి ఇట్లనియె.

"నాయనా. మేఘనాథా! యిపుడు శ్రీరాముడు అఖండసేనాపరివృతు డయి దురమొనరింప లంకానగర పరిఖులలో జేరి. రణభేరీలను మ్రోగించు చున్నాడు. మన మందరము నతని నెదిరి రణమొనరింప వలయు"ననిన, మేఘనాథుడు దానవవీరుల బిలచి ఇట్లనియె.

"వీరులారా! మీరందరూ ఇదివరకు జేసిన యుద్ధములు యుద్ధములు గావు. ఇపుడు మీ మీ శక్తు లుపయోగించి పోరాడి జయము నందవల యును" అని విజయ దుర్జయులను అఖండ సేనానాయకులను గావించి రణభేరి మ్రోగించెను.

అంత ఇరుసైన్యములు రెండు ప్రక్కల దురము సేయ సిద్ధముగా నుండుటజూచి, ఖేచరులు ఆకాశమున బారులుదీరి యుండిరి. నారదుడు తనకు

కడుపునిండా ఆహారము లభించినదని ఆనందపడెను. భూత ప్రేత పిశా చంబులు తమకు కడుపునిండా ఆహారము లభించినదని నాట్యములు సలిపినవి. ఉభయసేనలు దురమున కుపక్రమించినవి. వానరులు వాహనములు లేని వారలు. దానవులు రథ, గజరాజుల నధిష్ఠించి, పోరుసలుపుచుండ, వానరులు తరు పాషాణాదుల చేతబట్టి రణముసేసిరి.

ఆ విధంబగు సంకుల సమరంబున దానవసేనలు చాలవరకు పెచ్చు రేగి పోరాడ, వానరవీరులు వారలనుబట్టి రథంబులను విరచి, గజంబులను జంపి దానవులను అంతకాలయమున కంపిరి. అపుడు మహావీరులగు దాన వులు చాలమంది మడిసిరి.

అంత ప్రహస్తుడు, దుర్భీషుడు, దుర్మదుడు, దురంతకుడు, దుర్జ యుడు రోషావేశ పూరితులయి, ఐరావతంబులవోలు ఏనుగుల నెక్కి దురమొనరింప. అంగదుడు, దుర్జయు నెదిరి, పాషాణవర్షమున వానిసేనలను జంపి, తొండమునుచేతబట్టి, ఏనుగును నేలగొట్టి దుర్జయుని అంతకాల యమున కంపెను. జాంబవంతుడు ముష్టిప్రహరణముల ప్రహస్తుని నూలగ జేసి యమపురికంపెను. సుగ్రీవుడు దుర్భీషుని జంపెను. ఈ విధముగా దానవ వీరులను హతమొనరించి వానరవీరులు సింహానాదములు జేసిరి.

అది జూచిన మేఘనాథుడు తాను విజృంభించివచ్చి, తన రథంబును చిత్రగతుల వానరసేనల నడుమ నడపుచూ, బాణవర్షంబుల వానరులను ప్రాణావశిష్టులను జేయ, లక్ష్మణు డాతని నెదిరించెను. అపుడు లక్ష్మణ, మేఘనాథులకు పెద్ద పోరు జరిగెను. అది జూచి ఆహా, యని ఖేచరు లానంద మందిరి. వా రిరువురు పోరు జూడ వేడుకబడి దానవులు, వానరులు వైరం బులు మరచి నిలుచుండిరి అంతలో లక్ష్మణుడు మేఘనాథుని కేతనము నరికి, సారథిని జంపి, అశ్వంబుల గూల్చి, ధనువు నెగరవేయ, మేఘనాథుడు క్రిందగూలి, లేచి మరియొక రథ మధిరోహించి వచ్చి ప్రళయకాల రుద్రుని వలె రోషావేశ పూరితుడయి ఇరువదినాల్గు క్షణములు అవక్రవిక్రమంబున పోరెను. లక్ష్మణుడును అతని కిసుమంతయు తీసిపోక పోరుచుండెను.

అపుడు మేఘనాథుడు ఒక బాణమున లక్ష్మణుని వక్షంబు నేయ, లక్ష్మణుడు ఆగ్రహించి పది బాణంబుల రథసారథి, గుఱ్ఱంబుల రూపుమాపి, ధనువు నరికి మేఘనాథుని బాహువుల గొట్టెను. అపుడు మేఘనాథుడు ఒక పెద్ద ఏనుగు నెక్కి వచ్చి లక్ష్మణుని ఎదురించిన, లక్ష్మణుడు ఆ ఏనుగు తొండము నరికి, దానిని నేలగూలనేయ, మేఘనాథు డాగ్రహము జెంది తాను నిరంతరము పూజింపు శక్తిని లక్ష్మణునిపై ప్రయోగించెను. లక్ష్మణు డాశక్తిని ఆపజాలక మూర్ఛితుడయ్యెను. అంత మేఘనాథుడు సింహనాదము గావింప రాక్షసబలంబులు ఆనందమున ఆడిరి. వానరులు దీనవదనులైరి.

రాముడు లక్ష్మణుడు బడుట జూచి విచారగ్రస్తుడయి యుండ, సుషేణుని వాక్యంబున హనుమంతుడు బోయి సంజీవిని దెచ్చి లక్ష్మణుని కీయ, లక్ష్మణుడు నిద్రమేల్కొని లేచినట్లుగా లేచి, ధనుర్బాణంబుల ధరించి రోషావేశంబులు పెంపిరిగొన యొక్కుమ్మడి బాణవర్షముల దానవసేనలను రూపుమాప, మేఘనాథుడు తిరిగి రథారూఢుడయి దురము చేసెను. అపుడు లక్ష్మణుడు దానవసేనలలోని రథంబులు నేలగూల్చి, ఏనుగులను పీనుగులను గావించి, భటులను ప్రాణావశిష్టులను జేసి, సింహనాదంబున దిక్కులు పిక్కటిల్లజేసి, పెచ్చురేగి, విచ్చలవిడి విహరింపుచూ మేఘనాథుని ఎదుర నిలచి, "ఓరీ, దానవాధమా! నన్ను మూర్ఛమునుంగ జేసితివి. నిన్నిపుడు శాశ్వత నిద్ర నందింతు" నని, ఆరు బాణముల సారథిని, పది బాణముల రథములను, ఇరువది బాణముల చక్రరక్షకులను, ఐదు బాణంబుల కేతనంబును ద్రునియ, ఒక ముసలాయుధమున మేఘనాథుఫాలమున బాదెను. మేఘనాథుడును ఆ దెబ్బకు కొంచెము తూలినను, తిరిగి ధైర్యోత్సాహములు పెంపరి, గద ధరించి లక్ష్మణు నెదిరించెను. లక్ష్మణుడును ఆ గదాదండమును తిలమాత్ర ప్రమాణమున తుటురు గావించి, మరియొక బాణము మేఘనాథుని రొమ్మున వేయ, ఇంద్రజిత్తు హాహాకారమున నేలగూలి ప్రాణములు వదలెను, అని జెమిని చెప్ప, వాలఖిల్యులు ఇవలి కథ వినవలయునను దలంపున యిట్లడిగిరి:

"మహా మునీంద్రా, పుత్ర మరణానంతరము రావణు డేమి జేసెనో చెప్పు" మన ముని ఇట్లు చెప్పదొడంగెను.

## మండోదరీ విలాపము

మేఘనాథుని మరణము వినిన మండోదరి నేలగూలి హోరుహోరున ఏడ్చుచూ, 'హా పుత్రకా, హా మేఘనాథా!' యని పలుమారులు పలుకుచూ నేల దొర్లుచుండ, రావణు డంతఃపురమున కేతెంచి పుత్రశోకాతురయైన సతిని లేవదీసి, తొడపై గూర్చుండజేసి, తన యుత్తరీయంబున కనులు తుడచి, సమయానుకూల వచనముల నోదార్చెను.

అపుడు మండోదరి శోక గద్గద భాషితయై, భర్తృముఖము గాంచి ఇట్లనియె:

"స్వామీ, ఎందులకు ఈ యుద్ధము? తీరి, తిని గూర్చుని యీ దాటిని బోవు దరిద్ర ఆపదను దీసికొని వచ్చి, అగ్నిని తూల భాండారమున దాచినట్లు దాచిరి. మనకు వలదు. రామునితో వైరము వలదు. సీత నాతని కిచ్చి సంధిగావించి, చావగా మిగిలిన వారితో హాయిగా రాజ్యపాలనము సేయుండి. ఈ అకారణ కలహమున అక్షయు డంతమొందె. మేఘనాథుడు నేలగూలె. అనేకులగు దానవవీరులు అంతమొందిరి. సకలశక్తి సమన్వితుడగు విభీషణుడు వీడిపోయె. మన కెందుల కీ అకారణ కలహము. సీత పరమ దరిద్ర సంభూత. ఆమె పాదము సర్వాపదల మూలము...." అనునంతలో నారదుడు వచ్చెను.

రావణుడు నారదుని అర్ఘ్యాసనుండనుజేసి, మండోదరి నూరార్చి ఇట్లనియె:

"దేవీ! సీత జగన్మాతయని, ఆమెయే సకల దైవ స్వరూపిణి యని నారదమునీంద్రుడు పల్క, ఆమె సేవవలన నాకు మోక్షము సమకూరగల దని చెప్పితిని. తపంబుచే పరమేష్ఠిని మెప్పించి, మరణము లేకుండ వర మిమ్మనిన అతడు అది నాకు సాధ్యము గాదనినాడు. పోనీ మోక్షము ప్రసా

దింపు మనిన అదియును సాధ్యము గాదని బలికి, పనికిమాలిన బైసాని వరము లొసంగి, కనులనీరు తుడచి పంపెను. అదే విధముగ పరమేశ్వరు డును చేసెను. నిరంతరము త్రికాలముల యందు శివపూజ సేసిన ఫలము, నేను శివచాప యెక్కిడ లేకుండుటయా? నరుడు పంచహస్త పంచాంగుళ ప్రాయుడు, అవలీలనెత్తి దానిని విరచుట జూడ, నా యిరువది బాహువులు నిరర్థకములని తలంచితిని. రామునకు అంత శక్తి గలుగుటకు కారణము ఏమని యడుగ నారదుడు సీతావలోకనమే యనినంత, యిరువదేడు సంవ త్సరములు తపోనిష్ఠుడై నామె నామము జపించి, లంకానగరమునకు దెచ్చి తిని. యీ సీతాసేవనము వలన నా కోరిక బూర్తిగా నెరవేరు నను ఆశ కలదు....” అను నంతలో మండోదరి నారదుని జూచి, “ఓ నారదా! ఇది యంతయు నీ వాచరించిన కపట నాటకమా స్వామీ! ఇదివరకు దేవదానవు లకు కలహము గల్పించి కృతకృత్యుడవు గాజాలక యిపు డీ కలహము గల్పించితివా? నీ కెందులకయ్యా, ఈ అకారణ కలహా కల్పిత వ్యవ హారము? పిలువ తోడు, నిలువ నీడ లేని సన్యాసివి నీ కెందుకయ్యా” అనెను.

అది విని నారదుడు చిరునవ్వు చిందులాడ ఇట్లనెను: “అమ్మా, మండోదరీ! నేనేమంటినమ్మా, నీ మగడు శివచాప మెత్తలేక, రాముడు దానిని విరచిన ఆక్రోశపడి ఏమనిన, “సీత జగన్మాత, ఆమె క్రీగంటి చూపువలన రాము డంతటి వాడంటిని. అది తప్పా” యనిన, మండోదరి కోపోద్రిక్తయై, “సీత ఒక జగన్మాత, నీ వొక జటానేతవు. ఏమిటయ్యా ఆమె శక్తి? అమె దరిద్రురాలు. ఏమందువా, నాగటి చాలులో ఉదయించి సకల సౌభాగ్య సంపన్నుడగు జనకుని ఇంటజేరి, ఆయనను సన్యాసిగావించి నది. అత్తవారింట జేరి, అనంత భోగభాగ్య విభవ విలాస సంపన్నుడగు మామగారిని అంతకాలయమున కంపినది. సకల, సౌందర్య లక్షణ లక్షి తుండు, సకల కళాశోభితుండు, సర్వశక్తి సంపన్నుడు, రాజశేఖరు డగు రాముని చేతబట్టి, ఆలి యయి అడవులపాలు జేసి ఆపగల ముంచినది. తనను

తల్లిగా గొలుచు పరది యగు లక్ష్మణుని దరిద్రనారాయణుని గావించి చెట్టు, పుట్టల పాల్జేసినది. ఏమయ్యా ఆమె మహిమ....'' అనునంత రణభేరి విని పింప రావణుడు అది విని హడావిడిగా లేచి వెడలెను. నారదుండును బయ టికి వచ్చెను, అనిన మునులు తరువాతి కథ తెల్పమనిరి. జైమిని ఇట్లు చెప్పెను:

## కుంభకర్ణుని యుద్ధము

రావణుడు చావగా మిగిలిన సేనానులను బిలచి కుంభకర్ణుని నిద్రలేప మని పంపిన, వారు కుంభకర్ణుని నిద్ర లేపిరి. అర్ధనిద్రనుండి లేచిన కుంభ కర్ణుడు యుద్ధమునకు బోయి దుర మొనరించెను. అతని శరీరమున కపులు ప్రాకులాడిరి. ఆటలాడిరి. అతడు అరువది గడియలు అమిత విక్రమంబున పోరి పదిలక్షల కపివీరులను హతమార్చెను. అది గాంచి శ్రీరాము డాతనిని పాశుపతాస్త్రంబున యమపురికి బంపెను.

దూతలు రావణుని దరికరిగి, "ప్రభూ! దానవసేన అంతయూ అంత మందినది. సముద్రమువలె నుండు సేన ఈ రోజున ఎండాకాలమున ఎండి పోయిన ఏరువలె గనిపించుచున్నది. వీరాధివీరులగు ప్రహస్త, దుర్జయ, దుర్మర్షణ, దుర్జరాదు లందరూ రామబాణంబున అమరపురి జేరిరి. మేఘ నాథుని లక్ష్మణుడు పరిమార్చెను. కుంభకర్ణుని శ్రీరాముడు యమపురి కంపెను. మనసేనలలో ఇపుడు కపివీరుల నెదిరించు వీరుడు లేడు. కపులు జచ్చిన వారు చచ్చిననూ, మిగిలిన సేన అనంతముగా నున్నది. వారి బల పరాక్రమములు ఇది వరకెన్నడునూ కన్నదియూ, విన్నదియూ లేదు'' అని వచించెను.

అది విని రావణుడు పంచ మహాభూతములు అశ్వములుగా గల తన రథ మాయత్తపరుపమని, తాను మందోదరీ అంతఃపురమునకు జనెను.

అపుడు మందోదరి ఎదురువచ్చి సాదర గౌరవంబుల లోనికి గొని పోయి, ఆసనమున గూర్చుండజేసి ఇట్లనెను:

"ప్రభూ! ఇపుడైననూ నా మొర ఆలకించండి. సీతను రామున కిచ్చి, చావగా మిగిలిన దానవసేనతో రాజ్యమేలండి" అనియెను.

అది విని రావణుడు మండోదరిని తన ప్రక్క గూర్చుండ జేసి, లాలించి ఇట్లనియె: "మండోదరీ! నీవు వీరపత్నివి; వీరమాతవు. నేను ఈనాడు సీతను రామున కిచ్చిన, నేను చావక శాశ్వతముగా బ్రతికి యుందునా? అదియును గాక దురమున ప్రాణములు బాసిన అక్షయాదులు తిరిగి వత్తురా? ఏల ఈ వృథాప్రయాస. నేను సీతను దెచ్చుటలో గల పరమ రహస్యమును ఎరుంగక మాటలాడుచున్నావు," అనెను.

అపుడు మండోదరి సాభిప్రాయముగా భర్తను జూచి. "ఆ రహస్య మేదో వచింపరాదా?" యనెను.

అపుడు రావణు డిట్లనినెను: "నేను వేద. వేదాంతాది గ్రంథము లన్నియు ఆమూలాగ్రముగా పఠించితిని. నాల్గు వేదములు సకలార్థ సర ణిని పఠించితిని. షడ్దర్శనంబులను శోధించితిని. కాని నాకు గల సందేహ ములు దీరలేదు. ఏమనిన మొదటిది: కర్మశక్తి గొప్పదా? దైవశక్తి గొప్పదా యనునది ఒకటి. ఇక దైవము గొప్పవాడా? దైవనామము గొప్పదా యనునది రెండవది. ఇక దేవుడు భక్తుని కోర్కెను దీర్ప ఎచ్చటకైనను వచ్చితీరునా యనునది. ఈ మూడు సందేహములను మనం బున నిర్ణయింపజాలక నారద వచనమున సీతను దెచ్చితిని. పండితులు రాముని నారాయణాంశ సంభూతు డనియు, సీత మహాలక్ష్మి యని ఆడు మాటలను విని సీతను దెచ్చితిని. సీతకొరకు రాముడు రాక మానడు. శ్రీమన్నారాయణుడు, ఆదిలక్ష్మి మన ఇంట కాలిడిన, యింతకన్న మనకు కావలసిన భాగ్య మేమి? ఇదివరకు శివపార్వతులను మన గృహమునకు రప్పించి పూజించితిమి. ఇప్పుడు లక్ష్మీనారాయణులను పూజింప నున్నా రము. భగవంతుని సేవించుటకు భక్తి ప్రపత్తులు ఎటువంటివో, పౌరుష, వీర, ధీరత్వము లటువంటివే. కావున భక్తిని పరమేశ్వరుని ఆరాధించితిని. బలమున నారాయణుని ఆరాధించితిని. అన్నిటికన్న కర్మాచరణ చాల

ముఖ్యము గాని దానిని మించినది దైవశక్తి. రామునికన్న రామనామ సంస్మరణ అధికము. భక్తుల కోరిక దీర్ప భగవంతుడు సర్వదా సంసిద్ధుడు. నాకు మోక్షమీయ, నె కోరిన విధంబున ఆదినారాయణుడు, శ్రీ మహాలక్ష్మి ఇల్లు జేరిరి. నాకు మోక్షము సంప్రాప్తమయినది. నాకు మోక్షము ఎపుడునూ సంసిద్ధమే గాని, నా సహచరులగు దానవులకు, కుంభకర్ణునకు మోక్షము ఎట్లు సిద్ధించును. అందులకీ కార్యమును జేసితిని. అటు జూడుము" అని దివ్యదృష్టి నొసంగిన, మండోదరి ఆకాశమున జూడ, అక్షయుడు, మేఘనాథుడు, కుంభకర్ణుడు వగైరా అందరూ దివ్యాలంకార శోభితమయిన ఉద్యానవనంబున దివ్యాంబర, దివ్యగంధ దివ్యమాలాలంకృతులై గానుపించిరి.

అపుడు మండోదరి, భర్త దృఢదీక్షను మనంబున దలచి ఆనందించి, భర్త పాదముల బడి ఇట్లనియె - "మీ మనోగతాభిప్రాయము దెలియక, మిమ్ములను అపార్థము జేసికొని ఆడిన నా అజ్ఞానమును మన్నించి రక్షించ"మన, రావణుడు మండోదరిని ఆలింగనము జేసి, ముద్దిడి యిట్లనియె:

"మండోదరీ! నాదొక కోరిక గలదు. దానిని నీవు తప్పక నెరవేర్చవలయును" అనిన మండోదరి ఇట్లనియె:

"మీరు కోరిన దేదియైననూ తప్పక దీర్తు"నని హస్తమున హస్తమిడిన, మండోదరిని లాలనపూర్వకముగా, "ఏ విషమపరిస్థితి సంప్రాప్తించిననూ, నీవు విల్లు ధరించి దురమొనరించనని ఆన ఇమ్ము," అనెను.

అపుడు మండోదరి రెప్పపాటు కాల మాలోచించి కనుల నీరు నిండ, "సరే" నని, రావణుని ఒక్కసారి ఆలింగనము జేసుకొని హోరు హోరున విలపించెను.

అపుడు రావణుడు మండోదరి నోదార్చి, "మండోదరీ, విచారించకు. నీ కోరిక దీరగలదు. వత్తు"నను నంతలో రణభేరి వినిపింప

 

రావణుడు రథ మారోహించి రణాంగణమునకు వచ్చెను, అని జైమిని చెప్పిన వాలఖిల్యులు ఆవలి వృత్తాంత మడిగిరి.

## రావణుడు రాముని లంకానగరమేల మనుట

జైమిని మహర్షి వినుండని ఆవలి వృత్తాంత మిట్లు చెప్పం దొడంగెను:

రావణుడు దివ్యాలంకారభూషితుడయి, పంచమహాభూతములు వాహనములుగా గల రథ మధిరోహించి, రణరంగమునకు బోయి, ఒక్కసారి వానరసేనలను, వారి మధ్య సుగ్రీవ, హనుమంత, జాంబవంతాది వానర వీరులకు మధ్య ధనుర్బాణములు ధరించి, నిలుచుని యున్న రామలక్ష్మణుల గాంచి, తన చేతనున్న ధనువును రథమందుంచి, రథము దిగి పాద చారియై రాము దగ్గరకు బోయి, సాష్టాంగ నమస్కారములు గావించెను. రాముడును రావణునకు ప్రతినమస్కారము గావింప, రావణుడు రాముని తన పది బాహువుల తనివితీర ఆలింగనము గావించి, దివ్యసుందరమగు రాముని ముఖారవిందమును ఇరువది నేత్రముల దిలకించి, కనుల నీరు నింపి ఇట్లనియె:

"శ్రీరామా! చతురుదధివేలావలయిన భూచక్రము నవక్ర విక్రమంబున ఏలిన దశరథ చక్రవర్తి పుత్రుడవు. రఘువంశ పయఃపారావార చంద్రుడవు సర్వసౌందర్య సరస సంగీత సత్కళా నిపుణుడవు కాల గతిని అడవుల పాలయిననూ అధిపుడవే గదా! నా వినతి నాలకించ ప్రార్థన. ఏమందువా, నీకు జానకిని అర్పింతును. నీవు సీతాసతీసహితుడవయి ఈ త్రికూట పర్వతంబున, లంకానగరమున సింహాసన మధిరోహించి, చతుర్దశ భువనములను పరిపాలింపుము. నేను నీకు సర్వసేనాని గాను, విభీషణ, సుగ్రీవులు అమాత్యులుగాను, అంగద, జాంబవంత, హనుమంతాదులు అంతరంగికులుగాను నిన్నవరతము సేవింతుము. అష్టదిక్పాలకులు నీకు త్రికాలములు సేవ చేయుదురు. అఖల దేవ, దానవ, గరుడ, గంధర్వ,

కింపురుష, వానర, ఖేచర, భూసుర సంఘంబులు నిను గొలువ, అఖండ విభవంబున లంకానగర రాజ్యమేలు కొమ్మ”నెను.

అది విని లక్ష్మణుడు హేళనాపూర్వకముగా “ఆహా! దానవ సార్వభౌము డెంతటి దానశీలి. నీ దగ్గర దానము బట్టుటకు రాముడు బ్రాహ్మణుడు గాడు. సుక్షత్రియ వీరుడు” అనెను.

అది విని రావణుడు ఫక్కున నవ్వి “లక్ష్మణా! తండ్రి ఆద్దీకము బెట్టుటకైననూ అర్హతలేని నీవు ధర్మవాదివా? రాముడు క్షత్రియుడే. క్షత్రియు డాచరించవలసిన కర్మల నే మాచరించెనో దెల్పుము. ఊరకొనెద వేమి? క్షత్రియుడు సకల శస్త్రాస్త్ర సంపద నంది, రాజ్యమును పాలించి, ధర్మమును లోకమున ప్రతిష్ఠించి, పుత్రవంతుడయి, తన పుత్రుని రాజ్య పట్టాభిషిక్తుడను గావించి, తాను వానప్రస్థము స్వీకరించవలయును. అది నీ యన్న జేసినాడా?” అనిన లక్ష్మణుడు ఇట్లనియె'

“రాముడు తండ్రి యాజ్ఞను అరణ్యములకు వచ్చెను” అనెను।

అది విని రావణుడు వికటముగా నవ్వి, అందరి ముఖంబుల తేరిపార జూచి, “లక్ష్మణా! నీ తండ్రి దశరథ చక్రవర్తి, సకల సామంత, పౌర, జానపదులు నిండిన పేరోలగంబున దివిచర, భూచరులు విన, నీ యన్నను బిలచి. 'నీవు రేపు రఘుకుల సామ్రాజ్య పట్టమహిషి కరగ్రహణము జేయవలయు' ననియెనా లేక అలితో అడవులకు బొమ్మనెనా? లక్ష్మణా! మాట్లాడవేమి? అయోధ్యలో అంతఃపురమున జరిగిన సంగతి అన్యులకు దెలియ దనుకొంటివా?” అనునంత లక్ష్మణుడు, “తండ్రితో సమమగు తల్లి ఆనతిడినది” అనెను.

అపుడు రావణుడు గంభీరముగా ఇట్లనియె: “లక్ష్మణా! అనవసరముగా ఒక అనృతమాడి, దానిని దిద్దుకొనుటకు అనేక అబద్ధము లాడినట్లు అనవసర ప్రసంగము గావించితివి. కౌసల్య రాముని అడవికి బొమ్మనలేదు గదా! కేకయ రాజపుత్రి తన కొమారునకు పట్టము గట్టు తలంపున పన్నిన పన్నుగడకు భయపడి రాముడు అలితో అడవుల పాలయినాడు. అధ

మస్తుడవు గావున నీవును అలి నూర వదలి అతని వెంట బడితివి. లక్ష్మణా! నీ చరితము నాకు దెలియనిది గాదు. నేను చెప్పినట్లు చేయుడు" అనెను.

అప్పుడు సుగ్రీవుడు, "రావణా! రామునకు సీత నొసంగి, పాద ములబడి ప్రార్థించి, నీ రాజ్యము నీవే ఏలుకో" అనెను.

అపుడు రావణుడు, "ఓరీ, నీచాతినీచ కపివరా! నీవును నాకు హిత ముపదేశించు వాడవా? అన్యాయముగా అన్న జచ్చినాడను అపవాదు వేసి అన్న భార్యతో అంగజ రాజ్యమేలిన అధమాధముడవు. మీతో నాకేల, శ్రీరామా, ఏమందువు? నేనవినట్లు లంకానగర పీఠ మలంకరించి రాజ్య పాలనము జేతువా? ధనువు ధరించి దుర మొనరింతువా? తెలుపుము" అనెను.

ఆ మాటలు విని శ్రీరామచంద్రుడు 'రణమునకే సంసిద్ధుడను' అనెను.

అపుడు రావణుండు మందహాస వదనారవిందుడయి తాను కోరిన కోరిక సిద్ధించుచున్నదని మనసున సంతోషించి, ఇట్లనియె: "శ్రీరామా! నీవు చక్రవర్తి బిడ్డవు. రాజశేఖరుడవు. మన మిరువురము దుర మొనరించు నప్పుడు నేను రథమున, నీవు భూమిని నిలుచుండి దురము చేయుట ధర్మము గాదు. కావున నీవు నా వాహనబలమున నీకేది కావయునో దానిని తీసికొని రణము సేయుము" అనెను.

అది విని శ్రీరాముడు ఇట్లనియె: "ఓ దానవాధిపా! నీవు నాకు విరోధివి. నా భార్యను అపహరించినవాడవు. కావున నీ యపరాధమునకు నిన్ను శిక్షింప వచ్చినవాడను. నీ విచ్చిన అరణము స్వీకరించిన నేను నీకు మిత్రుడ నయ్యెదను. నీవు నాకు ఆప్తుడ వయ్యెదవు. అదియును గాక రణ ధర్మము ననుసరించి యిరువురు ఒకే విధముగా సమమగు వాహనము లధి

రోహింపవలయు ననుట ధర్మమే గాని, నీవు నాకు రథ మిచ్చిన మిత్రుడ వగుదువు గదా! మిత్రునితో రణమొనరించుట మహాపాపము గదా! కావున నీ వాహనము లేవియు నా కక్కఱలేదు" అనునంతలో హనుమంతుడు, రావణుని రథాశ్వము లనుకరించు ఐదు మొగములు గలిగి, తన చేతులు కాళ్ళు నాల్గు చక్రముల విధమున జేసి, తన మూపును రథ కూబరముగా నమర్చి, తన వాలమున గరుడధ్వజ మమర్చి రాముని ఎదుర నిలచెను.

అది జూచి రావణుడు "ఆహా! ఏమి ఆంజనేయుని సేవానిరతి!" యని ఆశ్చర్యమొందెను.

ఖేచరులు హనుమంతునిపై పూలవాన గురిపించిరి. అపుడు రామ రావణు లిరువురూ రథారూఢు లయి దురము సేయనుండిరి. రామ రావణ యుద్ధము జూడ సకల ఖేచరులు ఆకాశమున నిలచిరి. వానరులు, దానవులు తమ తమ వైరములు మరచి, రామ రావణ రణవిశారదత్వమును జూడ సంసిద్ధులుగా నుండిరి. విభీషణ, సుగ్రీవులును రామ రావణ సంగ్రామ దర్శన కుతూహలురై యుండిరి.

## మండోదరి మారు వేషమున వచ్చుట

ఆ సమయమున మండోదరి తన భర్త యొక్కడయి అఖండ వానరసేనలతో దురమొనరింప బోయినాడను దలపుతో, తాను అవసరమైన భర్త రక్షణార్థము మగ వేషము ధరించి, తనరూప మెవ్వ రెరుంగకుండ జేసికొని ఖడ్గపాణియై రణరంగమునకు వచ్చెను. అపు డా యుద్ధ భూమి లోని వారందరూ పరస్పర వైరములు మరచి రామరావణ సంగ్రామ దర్శనోత్సుకులై యుండిరి.

అది చూచి మండోదరి అమందానంద సంభరిత హృదయయై, "ఆహా! ఏమి రామ రావణుల ప్రభావము. ఇదివరకు అనేక దేవాసుర సంగ్రామములు జరిగినవి. ఏ యుద్ధమందైననూ ఈ విధముగా ఇరువురి

జోదుల యుద్ధమును జూడ కుతూహలంబున ఇరుసేన లుండుట ఎరుంగము. ఈ దినంబున ఈ రణరంగమున గల ఎల్లవారు క్రోధ ఆక్రోశ రోషావేశంబు లెరుంగక, పెండ్లి జూడవచ్చిన పెద్దలవలె పరస్పరావగాహనంబుల నుండుట మహాదాశ్చర్యకరముగా నున్న"దని ముదమంది, తాను యొక ఉన్నత ప్రదేశ మలంకరించి కూర్చుండి యుండెను.

## రామ రావణుల యుద్ధము

అపుడు రావణుడు రథమునుండి శంఖారవము గావించెను. శ్రీరాము డును అట్లే శంఖనాదము గావించెను. అపుడు రావణుడు శ్రీరాము నుద్దే శించి మూడు నమస్కార బాణములు వేసి, రామా ఇక రణము సేతుమని పది బాణంబుల కేతనంబును, నాల్గు బాణముల విల్లును, రెండు బాణముల నారిని నరుక ప్రయత్నింప, రాముడు ఆ బాణములను మధ్యనే నరికి వేసి శంఖనాదము గావించి, ఇరువది బాణముల రావణుని హస్తములు నరికిన తోడనే తిరిగి ద్విగుణీకృత బల పరాక్రమంబున మొలచినవి. అంత రావ ణుండు రోషావేశములు ముప్పిరిగొన రామునిపై బాణవర్షము గురి పించెను. రాముడునూ రావణుని బాణములు నరుకుచూ, రావణుని అంప వానలో ముంచివేసెను. ఆ సమయంబున రామరావణుల చేత విడువబడు బాణముల వలన భూమ్యాకాశములు నిండి సూర్యుని అనంతకళలా యను విధంబున ప్రకాశించినవి.

ఇట్లుండ రాముడు రావణుని తలలను ఇరువది బాణములతో నరికెను. ఆ తలలు తిరిగి బ్రహ్మాండ మగు నవ్వులతో దిక్కులు ప్రతిధ్వనింప రెప్పపాటు కాలములో మొలుచుచుండెను. అది గాంచి ఆకాశచారు లందరూ ఆశ్చర్యమందుచుండిరి. శ్రీరాముడు రోషావేశములు మూర్తీభవించిన విధమున మూడహోరాత్రంబులు రావణునితో దుర మొనరించి, అనేక పర్యాయములు తలలను, చేతులను ఖండించెను గాని ప్రయోజనము లేకుండెను. రావణుని శౌర్యము క్షణక్షణమునకు పెరుగుచుండెను. ఉత్సా

హము అతిశయించుచుండెను. ఆ యుద్ధమును జూడ దేవతానివహములు, ముని బృందములు ఆకాశమున నిండిపోయిరి.

మండోదరి ఆ ఇరువురి సంగ్రామము జూచి ఆనందమున యుప్పొంగెను. నారదుడు "ఆహా! దేవాసుర సంగ్రామము లెన్నియో గాంచితిని. అవి యన్నియు ఉప్పులేని పప్పువలె, జ్వాలలేని అగ్నివలె, రసికత్వము లేని అంగనవలె, రాణిలేని రాజువలె, దానము లేని ధనమువలె, గృహిణిలేని గృహమువలె, చమత్కారము లేని కవిత్వమువలె, శృతిలేని సంగీతమువలె నిర్జీవములై యున్నవి. రామ రావణుల యుద్ధము అట్లుగాక రంభాది అప్సరసల నాట్యమువలె జూచిన కొలది ఇంకను చూడవలయునని ఆశ కలుగుచున్నది" అనునంతలో రావణుడు ఉచ్చైశ్రవమున రాముని పిలచి ఇట్లనియె:

"శ్రీరామా! ఇపుడైననూ నేను చెప్పిన విధంబునకు సమ్మతించి లంకారాజ్య పట్టభద్రుడ'వగుము. కాకున్న నీ కీ నాడు మరణము తప్పదు. నీ వియోగమున సీతామతల్లి మృతినంద గలదు. మీ ఇరువురి మరణము కనులార గాంచిన లక్ష్మణుడు ప్రాణములు వదలగలడు. తరువాత ఈ వార్త విని భరత, శత్రుఘ్నులు, మీ ముగ్గురు తల్లులు, కోదండ్రుడు మరణించ గలరు. తరువాత సుగ్రీవ, జాంబవంత, అంగద, హనుమంతాదులు అందరూ అంతమందగలరు. కావున నా మాట విని యిందరి మృత్యువునకు శ్రీరాముడు కారకు డను అపయశమును బొందక, హాయిగా సీతా సహితుడవై రాజ్యమేలుము" అనెను.

అపుడు ఆకాశ చారు లందరూ రావణుని ధీరత్వమునకు, సాధు స్వభావమునకు అచ్చెరు వొంది, రామ రావణుల మీద పూలవాన గురిపించిరి.

అది విని రాముడు ధనువును సారించి, నారి సంతరించి, టంకారము గావించి, "రావణా! కాచుకొనుము. నేడే రామ రావణులలో ఒకరు

అంతము కా గలరు'' అని అనేక శతశరంబులను రావణునిపై గురి పించెను. రావణుడు ఆ శరముల నన్నిటినీ దునుమాడి, రాముని కేతనంబు నరికి, అశ్వముల వలె నున్న ఆంజనేయుని ముఖములను బాణవెల్లిని బంధించి, చక్రములవలె నున్న కాలుసేతులను బంధించి, కదలనీయక, శక్తి బాణమును రామునిపై ప్రయోగింప రాముడా శక్తిని ఖండించెను.

తరువాత రావణుడు ముసలమును ప్రయోగింప, దానిని రాముడు ఖండించెను. అపుడు రామ రావణుల యుద్ధము అతిఘోరము గాగ, ఆకాశ చారులు, "అహో! రామునకు సాటి రావణుడే. రావణునకు దీటు రాముడే. రామ రావణుల యుద్ధమునకు సాటి ప్రపంచమున లే''దని ఆనందమున సుర దుందుభులు మ్రోగించి, పూలవానలు గురిపించిరి.

అపుడు రావణుడు ఉత్సాహంబున పెల్లుబికి పెచ్చురేగి నారాయణాస్త్ర మును రామునిపై ప్రయోగింప, రాముడు నేల కొరిగెను. అదిగాంచి వానరులు 'హాహా'కారములు గావించిరి. రాక్షసులు సంతోషంబున సింహ నాదంబులు గావించిరి. అపుడు రావణుడు చింతాక్రాంత చిత్తుడయి, తనచేతి ధనువును రథమునం దుంచి, తాను రథము దిగి, విచారపడుచున్న సమయ మున, మారువేషంబుననున్న మండోదరి, తనయొద్ద నున్న అమృత భాండము లోని అమృతమును రావణుని కీయ, రావణుడు "అది నాకు వలదు, నీవు బోయి మూర్ఛమునింగిన రాముని కా యమృతము నిమ్ము'' అనెను.

అది విని మండోదరి, "స్వామీ, శత్రుమరణము విజయము. తిరిగి శత్రువును బ్రతికించిన అపదను కోరి దెచ్చుకొనుటయే గదా!'' అనెను.

అది విని రావణుడు కఠోరకంఠ భాషణమున, "ఓరీ, ఛండాలా! రాము డంతమందిన లోకము చీకటిలో మునుంగ గలదు. రావణుడు అపుడు ప్రాణము లేని శవమువలె బ్రతుకవలయును. కావున నీవు మారాడక, త్వరగా బోయి ఆ యమృత మెటులైననూ రాముని ముఖగహ్వరమున బోయుము'' అనునంతనే, మండోదరి నిమిషకాలమున రాముని సన్నిధానము

జేరి, విషయము వివరింప, అచ్చటి వానరవీరులు మండోదరిని రాము దరి జేరనీయక అడ్డగించిరి.

మండోదరి వారిని లెక్కచేయక, ఒకచేత అమృత భాండమును భద్రముగా ధరించి, యొకచేత గల ఖడ్గమున అంగదాది వీరుల జెనకు చుండెను. అపుడు వానరులు, 'ఆహా, రావణుడు ఎంత కుట్రగాడు. ఇది వరకు మూర్ఛమునింగిన లక్ష్మణుని బ్రతికించి కాపాడితిమని, ఆలాగుననే తిరిగి ఈ శ్రీరాముని మూర్ఛనుండి రక్షింపగలమను భావముచే ఈ విష భాండమును రాముని ముఖగుహ్వారమున బోయుమని పంపినాడు'' అని వారి వారి శక్తికొలదీ మండోదరి నడ్డగించి ఆ యమృత భాండమును లాగికొన వలయునని ప్రయత్నించిరి.

అపుడు మండోదరి వీరకాళీరూపధారిణియై లక్ష్మణుని పడద్రోసి, సుగ్రీవుని నడుము విరగజేసి, అంగదుని చేతులను గాయపరచి, విభీషణుని దూరముగా బడవేసి, అడ్డము వచ్చిన వానరులను హతమార్చి రాముదగ్గరకు బోవ, ఆంజనేయుడు గదా దండమున అమృతభాండము నేసెను. ఆ దెబ్బకు అమృత భాండము పగిలి, అందలి యమృతము చింది రాము ముఖమునబడి నోటిలోనికి పోవ, శ్రీరాముడు నిద్రమేల్కాంచిన విధమున లేచి కూర్చుండి ఎదురనున్న పగవేషధారిణి యగు మండోదరిని జూచి, ఎవరు నీవని యడిగెను.

మండోదరి మృదుమధుర భాషణంబుల వినయము గోచరింప చేతులు జోడించి, "లంకాధిపుని బంటును. లంకాధీశుడు తమరు మూర్ఛ మునుంగుటకు విచారించి, ఈ యమృత భాండ మిచ్చి నన్ను బంపెను'' అనినంతనే రాము డా సగము పగిలిన యమృత భాండమును దీసికొని, దాని యందు గల అమృతమును త్రావి, ఆనంద పరవశుడయి, తనయొద్ద నున్న అక్షయ మాలను రావణుని కిమ్మని ఇచ్చి, రావణునకు తన దన్యవాదములు దెలుపమని మండోదరిని బంపెను.

మండోదరి రావణుని దరికి వచ్చి రాము డిచ్చిన అక్షయ మాలను ఈయగా, రావణుడు దానిని కన్నుల కద్దుకొని, మెడలో ధరించి తన కడ నున్న రత్నమాలను దీసి మండోదరికి బహుమతిగా నొసంగి, "ఆహా, నీ వెవ్వడవో, నా భృత్యగణములలో నెన్నడును జూచియుండలేదు గాని, ఈ సమయంబున వచ్చి నీ బల, పరాక్రమ, ధైర్య, సాహసంబులు ప్రదర్శించి నా యానతి నెరవేర్చిన వీరుడవు. నేను నీ కిచ్చు ఈ యల్ప కానుక చంద్రుని కొక నూలుపోగు వంటిది." అని పొగడ, మండోదరి ఒక వంక ఆనందము వెల్లివిరియ, తన రూపము రావణునకు గుర్తు దెలియుననుభయము మన మున దోప, మందస్మితాననయై రావణునకు నమస్కరించి పోయెను. అని జైమిని చెప్ప, వాలఖిల్యులు విని "ఆహా, రావణుని దాతృత్వము ఎన్నతగినది. తరువాత నేమి జరిగినదో రామ రావణు లేవిధమున ప్రవర్తించిరో దెల్పు" మన, జైమిని ఇట్లు చెప్ప ప్రారంభించెను.

## శ్రీరాముని వద్దకు అగస్త్యుడు వచ్చుట

అటు తరువాత కథ జైమిని ఇట్లు చెప్ప ప్రారంభించెను.

రాముడు మూర్ఛదేరిన వానరు లందరూ ఆనందబడి శ్రీరాముని చుట్టు జేరిరి. శ్రీరాముడు లక్ష్మణుని తన దగ్గర కూర్చుండ నియోగించి, అతని భుజములపై చెయివైచి, అంగదాదులను ఎదుర కూర్చుండ నియోగించి, సుగ్రీవుని బిలచి ఇట్లనియె:

"సుగ్రీవా! మన కిక రణము వలదు. వానరసేనలను కిష్కింధకు గొని పొమ్ము" అనినంతనే అందరూ నిర్ఘాంతపోయి జూచుచుండిరి.

తిరిగి రాముడు లక్ష్మణుని జూచి, "లక్ష్మణా! మనకు రావణునితో సమరము వలదు. హాయిగా అరణ్యముల కేగి మునిపుంగవులను సేవించుచూ కాలము గడుపుదము" అనినంతనే లక్ష్మణుడు, ఆజ్యముపోసిన అగ్నివలె మండి, "శ్రీరామచంద్రా! ఇపుడు మనము యుద్ధము మాని అడవులకో, అయోధ్యకో యరిగిన జానకీమాత గతి ఏమగును. జానకీమాత

ప్రాణము వీడక యుందునా? ఇపుడు మీరు రావణసంహారమునకు విముఖులయిన సుగ్రీవునితో చెలిమి వ్యర్థమే గదా! ఆంజనేయుడు అనేక ఆపదల కోర్చి సంద్రము లంఘించి, లంకజేరి, సీతామాతకు మీ ముద్రిక నిచ్చి రత్నము దెచ్చినది అంతయూ బూడిదలో పోసిన ఆహూతి వంటిది గదా! మీకు రణమున విజయము లభింపదను అనుమాన ముండిన మీ రందరూ ఇచ్చట నుండుడు. నేను బోయి రావణుని మేఘనాథుని కడ కనిపి, సీతామాతను దెచ్చి మీ సన్నిధానములో నుంచెద. అంతియేకాని ఇపుడు దురము నుప సంహరించి మనము బోయిన లోకమున శ్రీరాముడు రావణునికి ఓడి పారి వచ్చెనను అపవాదము వాటిల్లగలదు. అపవాదుతోడ మనుటకంటె, ఆయుధమున జచ్చుటయే మేలనునది నీకు దెలియని ధర్మముగాదు. రాక్షస సేనా వాహిని నిదాఘనదీ ప్రవాహమువలె యింకిపోయినది మహావీరు లందరూ అంతమొందిరి. ఇక మిగిలిన దొక్క రావణుడే" అను నంతలో అంగదుడు, జాంబవంతుడు, హనుమంతుడు, సుగ్రీవుడు, విభీషణుడు లేచి గదల చేత బట్టి గంభీరముగా ముక్తకంఠమున నిట్లనిరి:

"శ్రీరామా! దిగులందకుము. మేము బోయి రావణుని సంహరించి సీతామతల్లిని దీపికొని రాగలము"అని నంతనే ఆంజనేయుడు రామపాదముల తలనుంచి, కనుల నీరునింప గద్గద కంఠమున "స్వామీ, శ్రీరామచంద్రా! తమరు యానతీయుడు, నేను బోయి రావణుని సంహరించి సీతామతల్లిని తెచ్చెద. ఆ మహాతల్లి మీ దర్శనమున కువ్విళ్లూరుచున్నది. నే నామెకు మీ ముద్రికనిచ్చి రత్నము గ్రహించినపుడు, అరువది దినముల లోపల మిమ్ము లను శ్రీరాముడు పరిగ్రహింపగలడని రాయిగుద్ది శపథము గావించితిని. ఇపుడు మీ రీ విధమున రావణునితో యుద్ధము మానిన యెడల సీతామతల్లి గతి ఏమగునో గదా! నా సముద్ర లంఘమునకు ప్రయోజనమేమి? అటు జూడుడు. ఎందరు వానరులు మీ కొరకు ప్రాణములు వదలిరో" అని నంత రాముడు ఆంజనేయుని కనులనీరు తన యుత్తరీయముతో తుడచి, భుజమున తన చేతినుంచి "ఆంజనేయా! నీవు అందరివలె గాక అఖండశక్తి

సంపన్నుడవు. సకల శాస్త్ర విశారదుడవు. నీకు దెలియని విషయములు ప్రపంచమున ఏమియు లేవు. ఎన్నడయిననూ, ఏ యుగంబున నయిననూ, అపహరించిన శత్రుని ప్రాణములను తిరిగి దానముచేసిన దాతను మీరు కని, రణరంగమున విని ఎరింగి యుంటిరా? దానవ చక్రవర్తి తన బాహుపరాక్రమమున నా ప్రాణములు గ్రహించి, మిమ్మందరినీ శోకసముద్రమున మునుంగజేసి, మీ రందరూ నా కొరకు దుఃఖింపుచుండ, తన భటునిచే అమృతభాండమును బంపి నా ప్రాణమును దానము జేసెను. అట్టి ప్రాణదాతతోడ రణముసేయుట ధర్మమా? ఆలోచింపుడు" అను సమయమున అందరూ ఏమియు బదులిడజాలక యూరకుండిరి.

తిరిగి రాముడు, ప్రాణదాత, మహాతపస్వి, శౌర్యధనుడు, నిరంతర పరమేశ్వర పాదారవిందపూజాదురంధరుడు. అఖిల బృందారకవందనీయుడు రావణుడు. అట్టివానిని రణమున సంహరింప పాపమేగాని సుఖము రాదు. అప్పు డందరూ ఏమిసేయుటకును దోపక రాము డనినట్లు ప్రాణదాతతోడ యుద్ధముసేయుట అధర్మమని తలంచుచూ, యుద్ధముజేసి రావణుని జంపకున్న సీతావియోగము దీరుటెట్లు? అను సంశయముల నుయ్యాలలూగు సమయంబున అగస్త్యమహాముని శిష్య సహితముగా వచ్చెను.

వచ్చిన అగస్త్యుని జూచి అందరూ లేచి నమస్కరించిరి. శ్రీరాముడును అగస్త్యునికి సాష్టాంగ నమస్కారము జేసి, మౌనముద్ర వహించి కూర్చుండెను. అపుడు విభీషణుడు శ్రీరామచంద్రుని సంశయము లన్నింటిని ఆమూలాగ్రముగ అగస్త్యుని కెరిగింప, అగస్త్యుడు ఫక్కున నవ్వి ఇట్లనియె:

"శ్రీరామా! ఈ కమండలోదకము నాచమించి కనుల నొకసారి ఈ యుదకమున కడిగికొని జూడు"మనిన రాముడు మహాముని చెప్పిన విధమున జేయ, తొలినాడు జయుడు తనను వైకుంఠమున ప్రార్థించిన సంఘటన అంతయూ కన్నులకు గానవచ్చెను.

అపుడు రాముడు మనసును సుస్థిరపరచుకొని, మునిని జూచి, "మహామునీంద్రా! రావణ పరాక్రమము అద్వితీయము. నే నతనిని జయింప జాలనను శంక మనమున పొడసూపుచున్నది" అనినంత అగస్త్యుడు రాముని ఏకాంత ప్రదేశమునకు పిలచి మూడుపర్యాయములు ఆచమింపజేసి, ఆదిత్య హృదయము నుపదేశించి, దానిని నూటఎనిమిది పర్యాయములు జపింపుమన రాముడు మహాముని చెప్పిన విధంబున జపింప, మాతలి సారథికంబున ఇంద్రరథంబు వచ్చెను.

అంత శ్రీరాముడు ఆ రథ మధిరోహించి, తనతో యుద్ధముసేయ సంసిద్ధుడయి, విల్లు చేతబట్టి, రథమ్మున నున్న రావణుని జూచి యిట్లనియె: "రావణా! రమ్ము! ఈ దినమున రావణుడు లేడు" అని రథమును రావణుని రథమున కెదురుగ తోలించు సమయంబున, విభీషణుండు గబగబ వచ్చి రథము నాపి, రాముని పజ్జచేరి రహస్యముగా నిట్లనియె:

"శ్రీరామచంద్రా! రావణుని నాభియందు అమృతకలశము గలదు. అది యాతనియం దున్నంతవరకూ అతనిని మనము ఏమియు చేయజాలము. కావున సమయమరసి ఆ కలశమును ఛేదింపు" మనిన, రాముడు రహస్యము గ్రహించి తన చేతియుంగరమును విభీషణున కిచ్చి, శంఖ నాదము గావించి, రథంబును రావణున కెదురు తోలించి దుర యొన రించెను.

రావణుడు ఈ దినమున తన కోరిక దీరినదను ఆనందమున విజృం భించి, యుప్పొంగి, శౌర్యధైర్యము లొక్కుమ్మడి పొంగి పొరల, అరువది ఘడియలు నిర్విరామ సంగరము గావించెను. అంత శ్రీరాముడు రావణుని రశచాప సంధానమునకు, దివ్యాస్త్ర పటిమకు ఆశ్చర్యము జెంది, ఆలసించిన లాభము లేదని శక్తి అస్త్రమును సంధించి, అమృతకలశమును భిన్నము గావింప, రావణుడు 'హా' యని రథమున గూలెను.

అంత మారువేషమున నున్న మండోదరి 'హా, నాథా!' యని రావ

ణుని మీద బడి ఏడ్వ నారంభించెను. కపులందరూ సింహధ్వానములు జేసిరి. రాముడు రథముదిగి రావణుని యొద్దకు వచ్చెను. అపుడు రావణుడు మండోదరీ సహాయమున, రథమునుండి క్రిందకు దిగి, రాముని పాదముల చెంత మోకరిల్లి కూర్చుండి. మండోదరిని బిలువమన, మండోదరి తన నిజ రూపమును చూపెను. అపుడు రావణుడు, 'అహా! అర్ధాంగి యన నీవే' యని మండోదరి నాలింగముజేసి, బంగరుపళ్ళెము దెమ్మని ఆజ్ఞ ఇడెను.

## అగ్నిహోత్రుడు సీతను దెచ్చుట

శచి మొదలగు దిక్పాల కాంతలు, సీతను దివ్యాభరణాదుల నలంకరించి, అగ్నిహోత్ర పురస్సరముగా రాముని సన్నిధానమునకు దీసుకొని వచ్చిరి. అపుడు సీత యలంకారమును జూచి ఖేచరులు సయితము ఆశ్చర్య పడిరి.

రాముడు సీతను జూచి తననేత్రముల తానే నమ్మలేకపోయెను. సీత రాముని జూచి తలవంచి, సిగ్గున నిలుచుండెను.

రావణుడు అపుడు సకల భూచరులు, ఖేచరులు, వానరులు విన యుచ్చైస్స్వరమున నిట్లనియె: "ఓ సభాసదులారా, మునులారా, ఖేచరులారా, శ్రీరామచంద్రా! సీతను ఎందులకు దెచ్చితినో ఆ సీతారాములకు దెలియును. అయిననూ నన్ను లోకము, నా భార్యాపుత్రులు సహితము దూషించిరి. దానికి నేను చింతించను. ఎందువలన ననగా రాముడు నారాయణాంశ సంభూతుడు, సీత ఆదిలక్ష్మి. వారిరువురకును సర్వకాల సర్వావస్థల యందును అవినాభావ సంబంధమే గదా. అయినపుడు సీత రామునకు నిత్యానపాయిని. రాముడు సర్వాంతర్యామి. కావున వారిరువురకు వియోగము లేనే లేదు. కావున నేను సీతను దెచ్చుటలో గల పరమార్థము రాముడు లంకకు వచ్చుటయే. ఈ దినము నా కోరిక నెరవేరినది. నేను జానకిని దెచ్చి మూడుకోట్ల దేవతలకు ఆదిదేవుడగు అగ్నిహోత్రుని పర మొనరించితిని

దిక్పాలక కాంత లామెకు ఎవరికీ దెలియకుండ సేవ లొనరించిరి. ఆమెను నేను దివ్యద్రుమలతా పరివేష్టితంబగు అశోకవనమున, దివ్యరత్నమండిత గృహంబున నుంచి త్రికాలముల యందు సేవించుచుంటిని. దాని ఫలిత మీనాడు గంటిని" అనునంతలో అగ్నిహోత్రుడు తన నిజస్వరూపము జూపించి, సీతామతల్లికి ముమ్మారు ప్రదక్షిణ మాచరించెను. అపుడు సీతాసతిమీద పూలవానలు కురిసెను.

అంత రావణుడు తమ్ముడగు విభీషణుని బిలిపించి, రత్నసింహాసనమును దెప్పించి అందుపై సీతారాములను నాసీనులను గావించి, మండోదరి నీరు పోయ, బంగరు పళ్ళెరమున సీతారాముల పాదములను కడిగి, ఆ జలమును తనివితీర త్రాగి తన తల నున్న కిరీటము, రాజముద్రిక యగు ఉంగముదీసి రాముని చేతనుంచి, రాముని పాదముల తలనుంచి ప్రాణములు వదలెను.

అపుడు పూలవానలు కురిసినవి. సురదుందుభులు మ్రోగినవి. అప్సరస లాడిరి. అంత మండోదరి రావణునిపై బడి కొంతసేపు విలపించి, సీతాసతి పాదములబడి హోరు హోరున నేడ్చుచూ ఇట్లనియె: "అమ్మా, జానకీ! నీవు భర్తసమాగమ మొంది, నన్ను భర్తృహీనను చేయుట న్యాయమా! భర్తృవియోగము పడతి కెంత మహా భయంకరమైనదో నీకు దెలియని విషయము కా"దని ఏడ్చుచుండ, సీత మండోదరిని లేవనెత్తి, "నీవు జీవించి యుండునంత కాలము నీ భర్త నిత్యయౌవనుడై కనిపించి నిన్ను లాలించగల"దని చెప్పెను.

అంతట శ్రీరాము ననుమతిని మండోదరీ సమక్షంబున రావణుడు రామున కిచ్చిన రత్నకిరీటము విభీషుని తల నుంచి, విభీషణునికి లంకానగర సామ్రాజ్య పట్టము గట్టిరి.

తరువాత విభీషణుడు తన యన్న మృతకళేబరమునకు యథావిధిన దహన సంస్కారము లాచరించెను.

మండోదరి సీతారాములకు నమస్కరించి త్రికూటశిఖరమున గల ఏకాంత మందిరమునకు బోయెను.

రాముననుమతిని విభీషణుడు పుష్పకవిమానమును రావించి. అందు సకల వానర సంఘంబులతో శ్రీరాముని గొనిపోయి అరువది గడియలలో భరద్వాజాశ్రమమునకు జేర్చెను.

అపుడు రాముడు హనుమంతుని పిలచి భరతునకు వర్తమాన మంపెను. భరతుడు రామ వనవాసమునకు పదునాలుగేడులు నిండినవి. రాము డింకను రాలేదు. సాయంత్రము లోపల రాకున్న అగ్నిప్రవేశము కాగలనని నెగడు కల్పించియుండ - అందరూ ఆవేదనబడుచుండ - ఆంజనేయుడు బోయి, శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడయి భరద్వాజాశ్రమమునం దున్నాడని దెలుప, భరతుడు యథాగౌరవముగా ఎదురేగి నంది గ్రామమునకు జేరి, సకల సామంత, మంత్రి, మునిపుంగవులు, ముగ్గురు తల్లులు, సకల వానరులు, విభీషణ, సుగ్రీవులు, ఖేచరులు విన రాముని పాదపీఠివద్ద మోకరిల్లి యిట్లనియె:

"శ్రీరామా, మా తల్లివలన సంప్రాప్తమయిన ఈ రాజ్యమును నీకు ధారవోయుచున్నా"నని రాముని పాదముల నీరు వదలెను.

అపుడు అందరునూ ఆనందమందిరి. కైక వసిష్ఠుని బిలచి పట్టాభిషేకమునకు మంచి ముహూర్తము నిర్ణయింపుమన, వసిష్ఠుడు, భరద్వాజుడు కలపి చైత్రశుద్ధ నవమి, పుష్యమీ నక్షత్రమున శ్రీరామ పట్టాభిషేకమునకు ముహూర్తము నిర్ణయించిరి, అని జెమిని చెప్ప, వాలఖిల్యు లానందమంది, "ఆహా! రామ రావణ చరితము సకల ప్రాణి హృదయానందవహము, సకల పాపసంహారము" అని శ్రీరామచంద్రుని పట్టాభిషేక వృత్తాంతము చెప్పుమన జెమిని ఇట్లు చెప్పెను:

# శ్రీరాముని పట్టాభిషేకము

నంది గ్రామము నుండి అయోధ్యపురమునకు బోవు మార్గంబున చలువపందిరులు సమకూర్చి, దివ్యాలంకార మండితంబులు గావించిరి. రత్న దీపముల నెలకొల్పిరి. అపుడు రాముడు యింద్రుడు బంపిన నాలుగు దంతముల ఐరావతంబు నధిష్టించి, భూచర, ఖేచర, వానర బృందంబులు గొలుచుచుండ, సీత వామ భాగమున కూర్చుండ, భరతుడు పాదములచెంత వుండ, లక్ష్మణశత్రుఘ్నులు చామరంబులు వీచుచుండ, హనుమంత, జాంబవంత, సుగ్రీవ, అంగద, విభీషణాదులు పార్శ్వంబుల రా, అఖండ వైభవంబున, అనేక అక్షౌహిణీ సైన్యంబులు ముందు వెనకల కలపి గొలువ, వేదపండితులు వేదములు పాడ, అప్సరస లాడ, అయోధ్యపురంబు జేరి ఇక్ష్వాకు కులక్రమానుగతంబగు సింహాసనమున, భరద్వాజాదు లాశీషంబులిడ పట్టాభిషిక్తుడాయెను, అని జెమిని వాలఖిల్యులకు జెప్పి, ఈ కథ ఎవరు చదువుదురో, ఎవరు వ్రాయుదురో, ఎవరు విందురో వారందరూ అఖండ భోగవైభవముల నందగలరు. సర్వపాపములు నశించగలవు. సకల యాత్రాధి ఫలంబులు, సకల దివ్యక్షేత్ర సందర్శన ఫలంబులను పొందగలరు, అని మహాకవి జెమిని మహర్షి వాలఖిల్యులకు జెప్పెను.

సంపూర్ణం. మంగళమ్. మహత్. శ్రీరస్తు.

---

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం.
మంగళం జానకీ దేవ్యై, మంగళం రఘుమూర్తయే
మంగళం లక్ష్మణేతుభ్యం, మంగళం సర్వదా భువి.

ఇయ్యది శ్రీ మహాకవి జైమిని మహామునిచే రచింపబడిన శ్రీమద్రామాయణమునకు - ఉ. వే. క. ఉభయకవితా విశారద, ఉభయ భాషా ప్రవీణ, దైవజ్ఞభూషణ శ్రీమాన్ విద్వాన్ S.T.G. ఒయ్యారి రంగాచార్యులు స్వామి వారిచే రచింపబడిన గద్యానువాదము సంపూర్ణము.

మంగళం మహత్. శ్రీశ్రీశ్రీ.



